*Issued on 29—10—1956*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

## DEBATES

# OFFICIAL REPORT

*FRIDAY, 2nd DECEMBER, 1955.*

VOLUME XII — No. 2.

CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.
1956
*Price 6 annas.*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Friday, the 2nd December, 1955.*

The House met in the Assembly Hall, Kurnool, at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

### STARTED QUESTIONS.

*Publication of an amending Bill to the Madras Estates Abolition Act.*

100-A.

*365-B-Q.—Sri R. B. RAMAKRISHNA RAJU: Will the Hon. the Minister for Revenue be pleased to state the stage at which the investigation into the question of amending Section 38 of the Madras Estates Abolition Act stands and whether the Government propose to publish any amending Bill?

The Hon. Sri K. CHANDRAMOULI :—

In connection with this question, certain necessary particulars relevant to the financial commitment involved have been called for from the Board of Revenue, the Commissioner for Hindu Religious and Charitable Endowments, the Director of Public Instruction, and the Collectors, and their reports are awaited. After their reports are received and examined, the Government propose to publish an amending Bill.

Sri S. RANGANATHA MUDALIAR :—What is the probable time the Government will take?

The Hon. Sri K. CHANDRAMOULI :—సాధ్యమైనంత త్వరలో దానిని తీసుకురావడానికి ప్రయత్నం చేస్తాము. మళ్లీ reminder కూడా పంపినాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Necessary particulars చెప్పగలరా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఏఏ institution ఏవిధముగా నాలో అవుతున్నది ఎంతడబ్బువస్తున్నది అన్నీ చూడవలెను.

SRI B. RATNASABHAPATHI :—అటువంటి estates ఎన్ని వున్నవో చెప్పగలరా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—సంఖ్య చెప్పడం కష్టము.

*REPORT OF THE LAND REFORMS COMMITTEE.*

100-B.

*368-A. Q-SRI PILLALALAMARRI VENKATESWARLU: Will the Hon. the Minister for Revenue be pleased to state:

(a) Whether the report of the Land Reforms Committee appointed by the Government had been received by the Government, and

(b) If so, whether any action was taken by the Government?

The Hon. Sri K. CHANDRAMOULI

(a):— Yes.

(b):— The report is under consideration by the Government.

SRI PILLALAMARRI VENKATESWARLU :—రిపోర్టులో సిఫార్సులు వారు చేసినవి ఏమిటో చెప్పగలరా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—Examination లో వున్నవి చెప్పగలరాఅంటే ఎట్లా ?

SRI PILLALAMARRI VENKATESWARLU:—Report ఇంకా మీరు చదవలేదా ?

THE HON. Sri K. CHANDRAMOULI :—ఇప్పుడు చెప్పడానికి వీలులేదు.

SRI P. RAJAGOPAL NAIDU :—సభ్యులకు రిపోర్టు కాపీలను అందచేస్తారా,

THE HON. SRI K. CHANDRAMOULI :—ఆలోచనలో వున్నది.

Sri P. SUNDARAYYA :—ఆలోచన పూర్తిఅయి ఎప్పుడు అందచెయ్యగలరు సభ్యులకు. బహుశః జాన్యువరీ నెలకైనా అందచెయ్యగలరా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—Date సరిగా చెప్పడానికి వీలులేదు. మొన్ననే రిపోర్టువచ్చింది. ఎక్కువకాలం కాలేదు. ఇప్పుడు డిపార్టుమెంట్లు దానిని examination చేస్తున్నారు. తొందరగా చెయ్యమని వారికి instructions ఇచ్చాము. రావడంతోనే గౌరవసభ్యులకు తెలియచేస్తాము.

SRI P. SUNDARAYYA :—ప్రభుత్వం చర్చించవచ్చును. తరువాత నిర్ణయాలు ప్రకటించవచ్చును, రిపోర్టువచ్చినతరువాత ప్రకటించక తప్పదుకదా ? ప్రజలఅభిప్రాయం తీసుకోవడంకూడా అవసరంకదా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—సరిగా పరిక్షచెయ్యకుండా publish చేయించడం చాలాకష్టం.

SRI PILLALAMARRI VENKATESWARLU:—కనీసం recommendations నయినా ఇవ్వగలరా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—పరిశీలన జరుగుతున్నవి. తొందరగానే చేస్తారు.

SRI P. SUNDARAYYA :—కేంద్రప్రభుత్వం States Reorganisation అలాంటి ముఖ్యమైన రిపోర్టుమీద తమనిర్ణయాలు తీసుకోకముందే ప్రజల ముందు అభిప్రాయము మంచిదని అందిన 10 రోజులలో ప్రకటించారు. అందుచేత land reforms మీద ప్రజాభిప్రాయం తీసుకోవాలి కనుక త్వరగా ప్రకటిస్తే మంత్రివర్గ ఆలోచనకుకూడా ఉపయోగపడవచ్చును. ప్రభుత్వం యీ విషయం ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI:—నేను యిదివరకే చెప్పాను. దానిని examine చేసి ప్రజాభిప్రాయానికి పంపాలని తొందరగా summary అయినా తయారు చెయ్యమని డిపార్టుమెంటుకు instructions ఇచ్చామని చెప్పేము. సాధ్యమైనంత త్వరలో ఇస్తాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఏమిచెయ్యాలో, ఆలోచిస్తాం అన్నారు. పబ్లిషు చెయ్యకుండా [illegible]. (d)

[2nd December 1955

THE HON. SRI K. CHANDRAMOULI :—అవసరమైతే అదికూడా ఆలోచనసే.

SRI PRAGADA KOTAIAH :—విశాలాంధ్ర ఏర్పడబోతున్నది కాబట్టి అంతవరకు దానిని ఆపివుంచవలెనని ప్రభుత్వం చూస్తున్నదని అంటున్నారు. అది నిజమేనా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ప్రభుత్వానికి ఇంకా ఆ అభిప్రాయం కలగలేదు. కోటయ్యగారు చెప్పినతరువాత అదికూడా ఆలోచిస్తే బాగాఉంటుందని అనుకొంటున్నాను.

SRI P. SREERAMULU :—విశాలాంధ్ర రాబోయే తరుణంలో విశాలాంధ్రసమస్య తేలినతరువాత ప్రచురించడం సమంజసముగా ఉంటుందేమో ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇప్పుడే కోటయ్యగారి ప్రశ్నకు జవాబు చెప్పేను.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, మంత్రిగారు చెబుతూ కోటయ్యగారు చెప్పినది ఆలోచనలో ఉన్నదన్నారు. విశాలాంధ్ర రావడందృష్ట్యా వాయిదా వెయ్యవలెనని మంత్రివర్గం తరఫున లోగడ పత్రికలలో ప్రకటించినట్లు పడింది. మంత్రిగారు చూసేరా ? ఎందుకు contradict చెయ్యలేదు.

THE HON. SRI K. CHANDRAMOULI:—వారు చెప్పినదానినిబట్టే తెలిసింది. ఎవరో ప్రకటించినదానికి మంత్రిమండలి ఏమీ బాధ్యత వహించదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఆవార్తలో సత్యం లేదనుకోవచ్చునా ?

*Persons exempted from the provisions of the Arms Act.*

104—

*83 Q.—Sri S. VEMAYYA: Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the number of persons who are exempted from the provisions of the Arms Act now in this State, and

(b) the reasons for the exemptions therefor?

2nd December 1955]

The Hon. Sri. N. SANJEEVA REDDI

(a) Fifty-five.

(b) Fifty-four persons are exempted under the Indian Arms Rules as they are ex-zamindars. One is exempted under the Indian Arms rules for meritorious service to the State.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ex జమీందార్లు అయినంతమాత్రాన వారిని ఎందుకు Exempt చెయ్యవలెను.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇది గవర్నమెంటు ఆఫ్ ఇండియావారికిగాను మనము చేస్తున్నాము. వారు ఏదో చేశారు. ఇమ్మన్నారు. ఇచ్చాము. దానివల్ల నష్టం ఏమీలేదు. ప్రమాదం ఏమీలేదు.

SRI B. RATNASABHAPATHI :—ఇతర దేశాలలో Licence లు తీసి వేసినారు అని వింటున్నాము. ఇదివరకు కాంగ్రెసు ప్రభుత్వం వచ్చిన రోజులలో Licence లు తీసివేసే ఆలోచన ఉన్నదని వింటూవచ్చాము. అటువంటిది ఇప్పుడు ఏమైనా ఉన్నదా ? ఇంత Strict గా పెట్టినా కడకు మా జిల్లాలో మర్డర్లు అగుతున్నాయి. తీసివేస్తే ఇంకెంతమందిఉంటారో. ప్రమాదం కాబట్టి కొంతమంది జాగ్రత్తగా ఉండడం మంచిది.

*Supply of Service Registers for sale in the Taluk Offices.*

105—

*163 Q.— Sri S. VEMAYYA: Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) whether there is supply of Service Registers for sale in the Taluk Offices of the State since (i) 1952-53, and (ii) 1953-54;

(b) If so, the numbers supplied; and

(c) if not, the reason therefor ?

The Hon. Sri. K. CHANDRAMOULI :—

(a), (b) and (c) :–A * statement showing the particulars required is placed on the table of the House.

* Vide Appendix at page infra.

[2nd December 1955

*Employment to Ex-servicemen.*

107—

*121 Q.—Sri S. VEMAYYA: Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) the number of Ex-servicemen who sought employment through Employment Exchange, and

(b) the number of Ex-servicemen provided with the jobs for the year ending 1954?

The Hon. Sri D. SANJIVAYYA :—

(a) 4,508

(b) 565

Sri V. VISWESWARA RAO:—అధ్యక్షా, 4000 రిజిస్టరు అయితే 500, 600 మందికి మాత్రం ఉద్యోగాలు చూపించారుఅంటే కారణం ఏమిటి? Employment లేకనా ఇంతతక్కువమందికి మాత్రం ఉద్యోగాలు చూపించ గలిగేరు.

THE HON. SRI. D. SANJIVAYYA :—లేకనే.

*Special Chief Engineer to Highways Department.*

109—

* 180 Q.—SRI P. PARTHASARATHY AND SRI V. KODANDARAMA REDDI : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether there is any proposal to appoint a Special Chief Engineer or a Chief Engineer to the Highways Department ; and

(b) if so, when ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) The Government have sanctioned the creation for a period of one year in the first instance of a separate post of Chief Engineer for the Highways Department designated as 'Additional Chief Engineer' in the scale of Rs. 1,500—150/2–1,800 the same pay given to Chief Engineer.

(b) A separate Chief Engineer has been appointed for the Highways Department from 1st October 1955.

*Formation of a separate taluk for Pamarru area in Krishna district.*

110—

* 177 Q.—SRI V. VISWESWARA RAO : Will the Hon. the Minister for the Revenue be pleased to state whether the Government propose to form a separate taluk for Pamarru area in Krishna district ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

Proposals in this regard are awaited from the Collector of Krishna and the Board of Revenue.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, కలెక్టరుగారు ఆ రిపోర్టును Submit చేసి ఎంతకాలమయింది ? ఇప్పుడు క్రిష్ణాజిల్లాలో ప్రభుత్వం జమీందారు గ్రామాలన్నికూడ స్వాధీనం చేసుకొంది కాబట్టి, దానిని వెంటనే ఆచరణలోనికి పెట్టడానికి చర్య తీసుకొంటారా ?

THE HON. Sri K. CHANDRAMOULI :—ఇంకా పూర్తిగా ఇంకా survey and settlement కాలేదు. ఇందులోఉన్న ఉద్దేశం ఏమిటంటే అక్కడక్కడఉన్న Villages కొన్ని కలిపి తాలూకాలు చేయాలంటే, survey and settlement కాకుండాఉండె, Villages కూడ కొన్ని ఉంటాయి. అవి Pockets గ ఏర్పడడానికి ఆవకాశం ఉంటుంది అనే ఉద్దేశంతప్ప ఇంకావేరె ఉద్దేశంలేదు. అందువల్ల కొంచెము ఆపవలసివచ్చింది.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా మొత్తంజిల్లాలు, తాలూకాలు పునర్విభజనచేయాలి అని ప్రభుత్వం ఆలోచిస్తుంది అని అన్నారు. ఆ ఆలోచన ఏమైందండీ ?

The Hon. SRI K. CHANDRAMOULI :—ఆ విషయం ఇదివరకే చెప్పానండి. దీనికి ఏమి సంబంధంలేదు.

Sri G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, ఎస్టేట్లు Taken over, 7, 8 సంవత్సరాలు అయినాగాని, ఒకే తాలూకాలో అనేక తాహశీలుదార్లు వేరు వేరుగా ఉన్నారు. వాండ్లందరిని Consolidale చేసి ఒకే Head క్రింద పెట్టడానికి ప్రయత్నం చేస్తారండీ ?

THE HON. Sri K. CHANDRAMOULI :—ఎంత చేయాలన్నా అది 1959 వరకు సాధ్యంకాదు అని ఇదివరకు చాలాసార్లు చెప్పానండి. అందువల్ల ఇంకా ఎక్కువ Staff వేసినా, ఎక్కువపనిఉంది కాబట్టి కొంచెం ఆలస్యం అవుతుంది.

Sri P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా, మిగతాజిల్లాలు ఇంకా ఉన్నాయి. మిగతజిల్లాలను గురించి తొందరగా చేయాలని ప్రభుత్వానికి ఉద్దేశంఉందా ? లేదా ? అని అడుగుతున్నాను ?

THE HON. Sri K. CHANDRAMOULI :—ఈ ప్రశ్న దానికి సంబంధం లేదండీ.

Mr. SPEAKER :—పామ్రరు దండీ ఇది.

Sri T. PAPA RAO:—అధ్యక్షా, ఈ తాలూకా సరిహద్దుల revisionలో శ్రీకాకుళం జిల్లాలో పాత పట్టణం తాలూకా కొంతభాగం టెక్కలిలోను కొంత భాగం శ్రీకాకుళంలోను. చేరుస్తామన్నారు. అది ఏమైనా ఆలోచనలో ఉందా ?

Mr. SPEAKER :—వేరే ప్రశ్న వేయండి.

*Eradication of unemployment problem.*

112—

* 122 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) whether this Government received any amount of money from Hon. Prime Minister's National Relief Fund to eradicate unemployment problem;

(b) if so, the amount received; and

(c) how it is allocated in the State now ?

The HON. SRI D. SANJIVAYYA :—

(a) No, Sir.

(b) and (c) : Do not arise.

*Construction of two bridges over the Tokkodu drain and Jinnur Irrigation Channel.*

114—

*183 Q.—Sri A. SATYANARAYANAMURTY :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state whether the Government propose to construct two bridges over the Tokkodu drain and Jinnur Irrigation Channel in the Second Five-Year Plan?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

No such proposals are under consideration of the Government.

*Exemption of the Rent Reduction Act in Rentapalli of Sattenapalli taluk.*

115—

*185 Q.—Sri VAVILALA GOPALAKRISHNAYYA : Will the Hon. the Minister for Revenue be pleased to state whether Rentapalli of Sattenapalli taluk is exempted from the Rent Reduction Act and if so, why?

The Hon. Sri K. CHANDRAMOULI :—

No, Sir. The village was notified under the Rent Reduction Act in 1950; but the notification is not however in force on account of the permanent injunction granted by District Munsif's Court, Guntur on a suit filed by the land holder challenging the validity of the notification. The matter is still pending in courts.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—ఈమధ్య Rent Reduction Act అమలుచేసినటువంటి చాలావాటిని, ప్రభుత్వం కలెక్టర్ల ద్వారా exclude చేస్తున్నామని కబురుచేస్తున్నారు. అట్లాంటివి గరికపాడు ఒకటి, హాసనాబాదు ఒకటి, మంగళగిరిపాడు ఒకటి. ఇటువంటివి అన్నీ ఉన్నాయి. కలెక్టరులు సరాసరిగా జోక్యము కలిగించుకొనవచ్చునా అని నేను అడుగుతూ ఉన్నాను ?

The Hon. Sri K. CHANDRAMOULI :—ప్రశ్న వేసింది రెంటపల్లిని గురించి. అది కోర్టులో ఉన్నది. దానిని ఏమి చేయగలము ?

Sri V. VISWESWARA RAO :—అధ్యక్షా ! 1950 లో permanent injuction వల్ల ఇది ఆపివేయడం జరిగిందని మంత్రిగారు చెప్పారు. అయిదు సంవత్సరాలు అయిపోయింది. అయిదు సంవత్సరాలనుంచి కోర్టులో ఉండేటప్పుడు Rent reduction Act అమలు జరగకుండా పోతున్నది కాబట్టి వెంటనే చర్య తీసుకొని, ఒక amendment తీసుకొనిరావడానికి ఆలోచిస్తుందా ప్రభుత్వం?

THE HON SRI K. CHANDRAMOULI :—ఈ 5 సంవత్సరాల నుంచి District Munsif Court లో లేదండీ. మొదటి క్రింది కోర్టులో తీర్మానం అయింది. దానికి మళ్లీ appeal లో పెట్టుకొన్నారు. అది appeal లో ఉంది.

SRI P. SUNDARAYYA :— ప్రజలకు సంబంధించిన విషయాల మీద మన భూస్వాములు కోర్టులకు వెళ్లి లాభకరమైన దానిని అమలులోకి రాకుండా చేస్తున్నారు, కాబట్టి కోర్టు తీర్మానం final అయ్యేదాకా ఈ Act అమలులో ఉంటుంది అన్నటువంటి సవరణ తెచ్చేదానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI:—అది చేయడానికి సాధ్యం కాదు.

SRI V. VISWESWARA RAO:—అధ్యక్షా, నా ప్రశ్నకు మంత్రిగారు స్పష్టమైన సమాధానం ఇవ్వలేదని అభిప్రాయ పడుతున్నాను. అటువంటివి చాలా గ్రామాలలో గవర్నమెంటు ప్రకటించిన తర్వాతకూడ వీరు కోర్టుకు వెళ్లడం, అందువల్ల అది తాత్కాలికంగా ఆపడం, permanent injuction ఇవ్వడం జరుగుతుంది. కాబట్టి amendment చట్టాన్ని తీసుకొని వచ్చుటకు ప్రభుత్వం పూనుకొంటుందా ?

THE HON. Sri K. CHANDRAMOULI :—కోర్టులో ఉన్నంతవరకు కోర్టును మనముకూడా గుర్తించవలసిందే. మనం ఏమి చేస్తాం.

SRI PILLALAMARRI VENKATESWARLU:—ఇలాంటివి అన్ని త్వరగా dispose చేయడానికి అని ఏదైనా ఒక special కోర్టునో లేక ఒక special బెంచినో ఏమైనా appoint చేయడానికి ఆలోచిస్తుందా ప్రభుత్వం ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఈ ఒక్క కేసుకు special court వేయడానికి సాధ్యంకాదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—జమీందార్లకు రైతులకు ప్రభుత్వానికిమధ్య వచ్చేటటువంటి తగాదాలలో, ఒకచిన్న petition పెట్టించి, 5 సంవత్సరాలు, 10 సంవత్సరాలు, delay చేస్తున్నారు గనుక ఇలా కాకుండా ఏదైనా ఒక special court ఏర్పాటు చేసేటట్లయితే దానిలో quick disposal జరగడానికి వీలుఉంటుంది. గనుక ఈ proposal ఎందుకు ఆలోచించ కూడదు ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అది సాధ్యంఅయిందని నేను అనుకోను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఎందువల్లసాధ్యం కాదు ?

THE HON. SRI K. CHANDRAMOULI :—Special Court కు ఏమి అవసరం ఉందండీ ?

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఈ సందర్భంలో Rent Reduction Act ప్రకారం Revenue Department డబ్బు వసూలుచేసింది. అవతల మీరుచెప్పినట్లుగా వాండ్లు కోర్టుకుపోయి, డిక్రీతెచ్చుకొని, ఇది అమలుజరపడానికి వీలులేదని, అగ్రహారందార్లు Rent Reduction Act ప్రకారం గా ఇదివరకు రివిన్యూశాఖకు చెల్లించిన డబ్బుకూడ, ఆ అన్ని సంవత్సరముల డబ్బుకూడ తిరిగి చెల్లించమని చెప్పి వసూలుచేస్తున్నారు. ఈ విషయంలో ప్రభుత్వం శ్రద్ధతీసు కొంటుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—సరే. కోర్టులనుంచి decision వచ్చిన తర్వాత decision ప్రకారం చర్యతీసుకొంటాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, అసలు నా point అదికాదండి. revenue department వసూలుచేసింది rent reduction ప్రకారంగా. ఆ తర్వాత వాండ్లు కోర్టుకువెళ్ళిసి, injunction ఇచ్చివేసి ఆపి వేశారు. ఆపివేస్తే ఇదివరకు మాకు హక్కుఉన్నది గనుక Revenue Department కు చెల్లించిన సంవత్సరముల డబ్బునుకూడాను. ఆ పాతవీకూడ బకాయిక్రింద ఇస్తారా లేదాఅని చెప్పేసి వసూలుచేస్తున్నారు. అసలు Revenue Department treasury లో డబ్బుఉంది ఆ విషయం ఆలోచిస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—శ్రీ గోపాలకృష్ణయ్య గారు అర్థంచేసుకోలేదు. మాకు హక్కు ఉందని పెట్టుతున్నాం.

మా హక్కు ప్రకారం మేముచేశాము. లేదని వారుఅంటున్నారు. అదిఏదో తేలేవరకు ఆ matter ఏమిచెప్పాలి ? ఆ హక్కు ఉంది అంటున్నాము మేము.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, హక్కు ఉందని చెప్పేసి, ప్రభుత్వం ఏమో వసూలుచేస్తుంది. హక్కు లేదని చెప్పి, permanent injunction తీసుకొనివచ్చి మరి ఇనాందార్లు వసూలు చేస్తున్నారు. అలాంటి anomoly రాకుండా ప్రభుత్వం ఏమైనా ప్రయత్నంచేస్తుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇనాందార్లు వసూలు చేయలేదండి.

SRI RAJA V. V. KRISHNAM RAJU BAHADUR :—అధ్యక్షా, ఇపుడు చాలా ఇనాములు estates అని గవర్మెంటు నోటిఫై చేసినతర్వాత గత ఆరు సంవత్సరాలవరకును, గవర్మెంటుఅంతా వసూలుచేశారు. ఆ డబ్బుఏమో మన ఇనాం దార్లు కట్టుబడి కట్టాలని గవర్మెంటు వారు action తీసుకొన్నారు. కాబట్టి అది refund యివ్వమని కోరుతున్నారు. దానికేమైనా మార్గం ఆలోచిస్తారా అని అడుగుతున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI :—refund ఇవ్వవలసిఉంటే ఇస్తారండి.

*Radio sets for Harijan Colonies.*

117—

*123 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) the number of radio sets in the State for the Harijan colonies now; and

(b) the number working properly now?

THE HON. SRI D. SANJIVAYYA :—

(a) The answer is in the negative.

(b) Does not arise.

*Postponement of Municipal Elections.*

119—

*128 Q.—SRI S. VEMAYYA :— Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state—

2nd December 1955]

(a) whether it is a fact that the Government propose to postpone the Municipal Elections in the State; and

(b) if so, the reasons therefor?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(a) The municipal elections have been postponed in consequence of the enactment of the M.D.M. (Andhra Second Amendment), 1955.

(b) As the Honourable member is aware the date of re-constitution of the municipal councils has had to be postponed to the 1st July 1956 in order to enable Government suitably to revise their ward-division as the existing ward-division in several cases is unsatisfactory and inequitable.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇపుడు wards redistribution ఇవిఅన్ని చేయడం, తరువాత వోటర్ల లిస్టులు లేకపోవడంవల్ల మనం ఆలోచించి ఇది postpone చేశాం. మళ్లాతిరిగి postpone చేయడానికి ఈ కారణాలుఅన్ని అట్లాగే పెట్టుతున్నారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అట్లేపెట్టడం లేదు. తగినంత instructions ఇస్తారు. quick గానే establishment అంతా move అవుతుంది.

SRI A. VENKATRAMA RAJU :—వచ్చేసంవత్సర, ఏ నెలలో జరపడానికి నిశ్చయించారండి ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—April, May, June, 3 నెలలో అవుతుంది. 1st. June కి కొత్త councils అమలులోకి వస్తాయి.

SRI PILLALAMARRI VENKATESWARLU:—ఇప్పుడు కోర్టు redivide చేయడం తర్వాత ఓటర్సు List ఇక పోవడంవల్ల మనంఅంతా ఆలోచించి postpone వేశాము. మీరు తిరిగి postpone చెయ్యడానికి కారణాలన్ని అట్లాగే అడ్డుపెడుతారా ?

The Hon Sri A. B. NAGESWARA RAO :—అడ్డుపెట్టంలేదు. తగినంత instructions ఇస్తాన్నారు. Quick గానే establishment move అవుతోంది.

[2nd December 1955

SRI C. VENKATARAMA RAJU :—ఇప్పుడు వచ్చేసంవత్సరం ఏ నెలలో జరగడానికి నిశ్చయించారు?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఇప్పుడు April May, June 3 నెలలో ఉంటుంది. July లో కొత్త Council అమలులోకి వస్తాయి.

SRI P. SUNDARAYYA :—Ward redivision ఎంతవరకు వచ్చినారు ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—వివరాలు ఇంకా రాలేదు. వారికి definite గా Wire instructions పంపించాము. urgent circulars పంపించాము. అందుచేత మీకు వివరాలు కావలసివస్తే Next సభకు వివరాలు తెలియజేస్తాము.

SRI PRAGADA KOTIAH :—అధ్యక్షా, ఈ Wards divide చెయ్యడంలో ఎప్పుడు ఈ backward communities లో ఉన్నటువంటి వాళ్ళకు 2, 3 Wards గా చీల్చివాళ్ళ అసలు ప్రాతినిధ్యమే లేకుండా చేస్తున్నారు. అలా కాకుండా సాధ్యమైనంతవరకు ఈ backward communities కు ప్రాతినిధ్యం వచ్చేటట్లుగా చూడవలసిందిగా ప్రభుత్వానికి ఒక representation ఇచ్చాము. దానిమీద ఏమిచర్య తీసుకొంటున్నారు ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—గౌరవ సభ్యులు ఇచ్చిన అర్జీమీద Inspector General of Local Administration కు తగిన instructions ఇచ్చాము. వారుకూడా Commissioners కు ఆ వివరాలు తెలిపారు. ఇవన్నికూడా ఆలోచించబడుతున్నాయి.

SRI PILLALAMARRI VENKATESWARLU:—మనంకూడా జూలైవరకు time extend చేశాము. Ward re-division వెంటనే అయి పోయినట్లయితే ప్రత్యేక Municipal Council ఏర్పాటు చేయడంగురించి ఆలోచిస్తారా?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఈ కార్యక్రమం అంతా ఎప్పుడు పూర్తి అవుతుందో అప్పుడే ఎన్నికలు జరుగుతాయి.

2nd December 1955]

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—క్రొత్తగా శేపల్లె పంచాయితీని ఏమైనా Municipality లుగా Convert చేయాలని Decision తీసుకొంటున్నారు. దీనికికూడ Elections అని కలిపివేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—దానికి దీనికి సంబంధంలేదు. ఈ Notification అయిన తరువాత Objection ను Call for చెయ్యాలి. విచారించాలి. తరువాత దానిక్రింద కొంత Time పడుతుంది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Ward యొక్క Redivision అంతా ఎప్పటికో పూర్తి అవుతుందో చెప్పగలరా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అది నేను చెప్ప లేను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అసలు ప్రశ్నలు వస్తున్నదే కొద్దిగా వస్తున్నాయి. Ministers కూడా ఎవరూ ఉండుటంలేదు. Questions ఈ మాత్రంకూడా జరగపోతే ఉన్న Questions ఎట్లా జరుగుతాయి దానికి ఏమైన Arrangement చేస్తారా ?

MR. SPEAKER :—The questions postponed will be put for 5th or 6th.

SRI C. SUBBARAYUDU :—అధ్యక్షా, Public Service Commission Report అంతాకూడా సభ్యులకు అందచేయబడింది. దానిపైన చర్చకు అవకాశం ఇవ్వాలని, అందుకు Time ఏర్పాటు చేయాలని నేను అధ్యక్షులవారిని కోరుతున్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI :—

**He may raise this point on the 5th. There is no hurry about that. It has been placed on the table of the House. He may move it on the 5th.**

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, నేను ఇప్పటికి 3 మాసాలు అయినది! కనీసం 100 questions అయినా పంపించాను. ఒక్క question కు అయినా సమాధానంరాలేదు. అధ్యక్షులవారు త్వరలోనే ఈ ప్రశ్నలకు జవాబులు వచ్చునట్లు చేస్తారని ఆశిస్తున్నాను.

MR. SPEAKER :—జవాబులువచ్చిన వాటికి సమాధానాలు ఈయబడుతున్నాయి.

[Note. An * asterisk at the Commencement of a speech indicates revision by the Member]

## II GOVERNMENT BILLS.

## (1) THE ANDHRA IRRIGATION WORKS (LEVY OF COMPULSORY WATER-CESS)BILL, 1955. (*contd.*)

### *Clause* 3 (*contd.*)

MR. SPEAKER :—The Government have given notice of a fresh amendment today. The Hon. Minister for Land Revenue will move the amendment.

THE HON. SRI K. CHANDRAMOULI :—అధ్యక్షా, మొన్న Clause 3లో వచ్చినటువంటి సందేహాలవల్ల ఈ సవరణ తేబడ్డది.

Sir, I move the following amendment.

For the existing proviso, substitute the following :—

" Provided that such levy shall not be made—

(a) in the case of an irrigation work, the construction, expansion or alteration of which was completed before the commencement of this Act, until the expiry of three years from such commencement ; and

(b) in the case of an irrigation work the construction, expansion or alteration of which is completed, on or before the date of commencement of this Act, until the expiry of three years from the date of such completion."

ఇది చాలా స్పష్టంగా వున్నది అనుకొంటాను. అందువల్ల సభ్యులందరు ఈ సవరణను ఆమోదిస్తారని ఆశిస్తున్నాను.

MR. SPEAKER :—The question is :—

For the existing proviso, substitute the following :—

" Provided that such levy shall not be made—

(a) in the case of an irrigation work, the construction, expansion or alteration which was completed before the commencement of this Act, until the expiry of three years from such commencement ; and

(b) in the case of an irrigation work the construction, expansion or alteration of which is completed, on or after the date of commencement of this Act, until the expiry of three years from the date of such completion."

The amendment was carried.

Clause 3 as amended was carried.

*Clause* 4.

MR. SPEAKER :—There is an amendment in the name of Sri P. Sundarayya.

SRI P. SUNDARAYYA :—Sir, I am not moving the amendment, but I want to speak on that clause.

ఎంత పన్ను వేస్తారనే సంగతినిగురించి ఏమీ ఈ clause లో లేదు. లేకుంటే ఏ principles అనుసరించి పన్ను, water cess వేస్తారనేదికూడా ఈ clause లో ఏమిలేదు. మంత్రిగారు తమఉపన్యాసంలో ఎక్కడాకూడా చెప్పలేదు. ఏ సూత్రాన్ననుసరించి water cess నిర్బంధంగావేసే విషయం గురించికూడా ఏమీ లేదు. మీరుఅంతాకూడా క్రొత్త క్రొత్త బిల్లులు తెచ్చేటప్పుడు Taxation Inquiry Commission Report ఆధారంగా చేసుకొని తెస్తున్నవని అంటున్నారు. నిర్బంధంగా నీటిని తీసుకోకపోయినా నిర్బంధంగా పన్నువేయడం న్యాయం కాదనిచెప్పి ఈ Taxation Inquiry commission Report లోనే చాల స్పష్టంగా వ్రాయబడింది. వారు చెప్పేదిఅంతాకూడా వాళ్లు నీరు తీసుకోకపోయినా నిర్బంధంగా వసూలుచేయాలని అనుకొంటే కేవలం maintenance charges కోసం, ఎట్లాగో ప్రాజెక్టుకట్టడం తరువాత నీరు తీసుకున్న తీసుకోకపోయినా వీటికి మరమ్మత్తులు చేసేదానికొరకు కొంతడబ్బు ప్రతిసంవత్సరం ప్రభుత్వం ఖర్చుపెట్టాల్సి ఉంటుంది. దానికి కావలసిన minimum charges మాత్రం ఆయకట్టులో వాళ్లందరిదగ్గర నిర్బంధంగా వసూలుచేయ్యాలి. మిగిలినది అంతాకూడాను నీరు తీసుకున్నవాళ్ళదగ్గర నీటితీరువగా వసూలుచెయ్యాలి అని Taxation Inquiry Commission Report చాలా స్పష్టంగా చెప్పింది. అంతేగాకుండా Bombay ప్రభుత్వం maintanance charges క్రింద, నీరు తీసుకోక పోయినట్లయితే కొన్నిరకాలభూములకు 2½ రూపాయలకు మించి తీసుకొనగూడదు, సంవత్సరం పొడుగునా నీరు తీసుకున్న వాళ్లమీద 22½ రూపాయలువేయవలసి ఉంటుందనిచెప్పి ఆరకంగా వాళ్లు చేర్చారు. అందుచేత ప్రభుత్వం ఈ clause మార్చేందుకు సర్వాధికారాలు తీసుకొంటున్నప్పుడు ఏ సూత్రాననుసరించి చేస్తున్నది? ఈ సందర్భంలో ఒక పర్యాయం మంత్రివర్గాన్ని, తిరిగి ఆలోచించమని కోరుతున్నాను. ఎందుకంటే

Sri P. Sundarayya] [2nd December 1955

మంత్రివర్గం ఈ విషయాన్ని గురించి పన్నులు ఏదోరీతిగా డబ్బు వచ్చేదానికోసం మార్గాలు, ఏదో చట్టం వేస్తున్నారనే ధోరణియే గాని వాళ్లు ఏర్పాటు చేసినటువంటి వాళ్ళ రిపోర్టుకూడా ఆధారంగా చేసుకొని ఈ బిల్లు తెస్తున్నట్లు కనపడడంలేదు.

Taxation Enquiry Commission Report, volume III, page 252 లో ఈవిధంగా ఉన్నది. దానిని ఒకపర్యాయం చదివి మంత్రిగారికి వినిపిస్తాను.

"At present, there is a growing tendency on the part of the State Governments to make the water-rate compulsory. As the water-rate covers many other charges besides the minimum maintenance costs, a compulsory water-rate would become a burdensome tax, especially where the scope for profitable utilisation of irrigation because of various unfavourable factors is limited. Though in actual practice the division of water charges into a compulsory levy and a voluntary payment as proposed above, will vary according to the conditions obtaining in the project areas, in principle, the compulsory charge according to us should be a small fee relatable mainly to the minimum maintenance costs."

అనేది అందులో చాలా స్పష్టంగా ఉన్నది. అందుచేత నీరు తీసుకోక పోయినా, ఈ water cess ను నిర్బంధంగా వసూలుచేయాలనే సూత్రాన్ని మీరు తెస్తూఉన్నప్పుడు, ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతాలలో, ఇదివరకు Irrigation projects లేని ప్రాంతాలలో ఈ ప్రాజెక్టులు కట్టుతూఉన్నప్పుడు, ఆ ప్రాంతాలలో ఈ నీరు తీసుకోడానికి కొంత ఎక్కువ ఆలస్యమవుతుంది, దానికి కొంతకాలము కావలసిఉంటుంది. మేము 5 ఏళ్లు కావాలనంటె మీరు ఒప్పుకోలేదు. పోనీ 3 ఏళ్లైయినా ఒప్పుకొన్నందుకు గుడ్డిలో మెల్లఅని అనుకోవలసియుంటుంది. ఇదైనా అంతతృప్తికరంగాలేదు. ఎందుచేతనంటె, మూడేళ్లయినా నీరు తీసుకొన్న తరువాతకూడ వెంటనే వారికి ఆదాయమురాదు. అటువంటప్పుడు, నీరు తీసుకోక పోయినా నిర్బంధంగా నీటితీరువా వసూలుచేస్తామంటున్నారు. అయినప్పటికీ, ఇటువంటి పరిస్థితులలో చాలా తక్కువగా వేయవలసియుంటుంది. ఈ బిల్లులో పూర్తి నీటితీరువా వసూలుచేసేదానికి అధికారమున్నది. అందుచేత నిర్బంధంగా వసూలుచేసేటప్పుడు, అక్కడ పరిస్థితులు దృష్టిలోపెట్టుకొని చేయవలెనని కోరుతున్నాను. ఈ సందర్భంలో ఇంకొక విషయం ప్రభుత్వదృష్టికి తీసుకురాదలచాను, అది ఇందులో 255 వ page లో ఉన్నది. నీరు తీసుకొన్నతరువాతకూడ

వెనువెంటనే పూర్తి నీటి తీరువా వేయకుండా, నీరు తీసుకొన్న మొదటి సంవత్సరంలో సగము, రెండవ సంవత్సరంలో 2/3 వ భాగము, మూడవ సంవత్సరంలో 3/4 వ భాగము, ఆవిధముగా 4 ఏళ్ళకుగాని పూర్తి నీటితీరువా కొత్తగా సాగులోకి తెచ్చేటటువంటి భూములమీద వేయడం, ఇదే procedure అనేక దేశాలలో ఉన్నది. ముఖ్యంగా పంటలు శీఘ్రంగా పండకుండా ఉండేటటువంటి మెట్ట ప్రాంతాలలో, కొత్తగా సాగులోకి తెచ్చేటటువంటి వాటిమీద నీరు ఇచ్చిన మొదట సంవత్సరమునుంచే నీటి తీరువా పూర్తి వసూలు చేయడం అంటె అది సరియైనది కాదని కూడ వీళ్లు చెప్పారు, అందుచేత పన్నులు వేసేదానికి Taxation Enquiry Commission Report అనేది authority అయినప్పుడు, వారు దీంట్లో కొన్ని సూచనలు, మినహాయింపులు చేసినప్పుడు, వాటన్నింటిని త్రోసిపారేసి ఏలాటి మినహాయింపులు లేకుండా వెంటనే అన్నిటిమీద పన్నులు వేస్తామంటే, రైతాంగానికి చాలా భారంగా ఉంటుంది.

"There is even now in some countries, the practice of providing free irrigation in the first or second year after the opening of now canals or charging only a portion of the prescribed rate. The later system is prevalent in some of the projects in Australia where the principle of sliding scale assessments is applied to water charges. Thus, the rate is kept one fourth in the first year, one half in the second, three-quarters in the third and the full amount is recovered in the fourth year. Elsewhere as in Italy, a fixed reduction is made in water-rates on lands brought newly under irrigation for the first three years."

నీరుతీసుకోకపోయిన సంవత్సరం పన్ను పూర్తిగా, నిర్బంధంగా వసూలుచేయడమనేది న్యాయంకాదు. దీనిని అమలులో తెచ్చేదానికోసం ఎక్కువకాలం కావాలంటే, మీరు తగినంతకాలము ఇవ్వడంలేదు అనే మా complaint. అందులోను పూర్తి నీటి తీరువ వసూలు చేయడం న్యాయంకాదు. పూర్తి వసూలు చేయకుండా కొంత maintenance charges కు కావలసినంతవరకు వసూలు చేయవచ్చు. నిర్బంధంగా వసూలు చేయవలసి వచ్చినప్పుడు, అనేక దేశాలలో మొదటి సంవత్సరం, రెండవ సంవత్సరం, మూడవ సంవత్సరం నీరు తీసుకున్నా, పూర్తి నీటితీరువా తీసుకోవడంలేదు. పోనీ ఆ సూత్రము వర్తించకపోయినా, నీరుతీసుకోనటువంటి ప్రదేశాలలో ఈ పూర్తి నీటి తీరువను వెనువెంటనే వసూలు చేయకుండా, వారు నీరుతీసుకొనుటకు

Sri P. Sundarayya] [2nd December 1955

మొదలు పెట్టిన కొంతకాలమువరకు కొంచెము తక్కువగా మాత్రమే వసూలు చేసే టట్లుగా ప్రభుత్వము చూడవలసియుంటుంది అని చెప్పాము. ఆ సవరణ ఇస్తే సరిపోతుందనుకొన్నాము గాని ఆ సవరణవల్ల అనేక చిక్కులు వస్తున్నాయి. అందువల్ల ఆ సవరణ ప్రతిపాదించకుండా ఈ clause మీద general observations మాత్రం నేను చేయడం జరిగింది.

THE HON. SRI K. CHANDRAMOULI :—అధ్యక్షా, సుందరయ్య గారు ఈ నీటి తీరువ compulsory గా వేయడంగాని, maximum వేయడం గాని అంత మంచిది కాదేమో అనేటటువంటి అభిప్రాయాన్ని వెలబుచ్చారు. తీరువా రేటులోగాని, ఇతర విషయాలలోగాని, కొన్ని కొన్ని ప్రాంతాలను బట్టి, పరిస్థితులను బట్టి అవి అమలు జరుగతూ ఉంటాయి. మన రాష్ట్రము ఆర్థికంగా Canada వలె పెద్ద బలవంతమైన స్థితిలోలేదు. Canada వారు సౌభాగ్య సంపన్నులు. అంత సౌభాగ్యము మనకూ ఉంటే, పన్నులే వేయనక్కరలేదు అను కొనే వారిలో నేను ఒక్కడిని. కాని అటువంటి సౌభాగ్యము మనకులేదు. ఉన్న దాన్ని సక్రమముగా మనము వినియోగించుకోవాలని అనుకొంటున్నాము. దీనితో బాటు ఉన్నవి కొద్దే అయినా తొందరగా ఫలితాలు తీసుకువచ్చి దీర్ఘకాలంగా బాధపడుతున్న ప్రజలకు కొంత సౌకర్యము కలుగచేయవలెననే ఉద్దేశంతో, వడ్డీ గిట్టుబాటు కాకపోయినప్పటికి Central Government నుంచి ఇంకా ఇతర చోట్లనుంచి అప్పులు తీసుకువచ్చి, ఇంత ధనాన్ని ఖర్చుపెట్టిన దానికి తగినటువంటి ఫలితాలు లేకపోవడంవల్ల కొంతవరకు దీనిని ఒత్తిడిచేసి అయినాసరే ఫలితాలను తీసుకురావలెననే సదుద్దేశంతో చేస్తున్నామేగాని, మరె దురుద్దేశముతో చేయుడంలేదు. అందువల్ల ఆ ఉద్దేశాన్ని దృష్టిలో పెట్టుకొని రైతులకు ఉన్నటువంటి పరిస్థితులను దృష్టిలో పెట్టుకొనే సుందయ్యాగారు అయిదేళ్లు అన్నా, వారు తెచ్చినటువంటి సవరణ మూడేళ్లకు ఒప్పుకొనడంలో మాకు కూడ రైతులమీద ఉదారత ఉన్నదని తెలుసుకోవచ్చు. కేవలం ఒక ప్రక్కనే చూస్తు ఉన్నట్లయితే దీనివల్ల అభివృద్ధికి నిరోధకం కలుగుతుందని నేను మనవిచేశాను. మరొకసారి సుందరయ్యగారికి మనవి చేస్తున్నాను. ఉన్న పరిస్థితులను ఆలోచించి ఎప్పుడు ఏ పద్ధతులలో చేసుకొంటే బాగుంటుందో ఆవిధంగా చేసుకోవాలిగాని, ఏదోవిధంగా రైతులను please చేస్తా మని, లేనిపోని హామీలిచ్చి ఇబ్బందులు కలుగజేయడం మా అభిప్రాయముకాదు. కాబట్టి మనకు ఆర్థిక సౌష్టవం బాగా కలిగితే, స్వల్పకాలములోనే కలుగుతుందని నమ్మేవాళ్ళలో నేను ఒకడిని, అప్పుడు తిరిగి ఆలోచించి ఇది తగ్గించాలో, లేకుండా చేయ్యాలో అవన్నీకూడ ఆలోచించుకోవచ్చును. ఈ లోపల ఈ పన్ను ఎక్కువైనా

2nd December 1955] [Sri K. Chandramouli

ఎవరికైనా హెచ్చు బాధకరంగా ఉంటే, దాన్ని తీసివేయడానికి ప్రభుత్వము వెనుకంజ వేయమని మనవిచేస్తూ ఈ clause ను accept చేయవలెనని కోరుతున్నాను.

Clause 4 was put and carried.

CLAUSE 5.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఇది జిల్లా గెజెట్‌లో publish చేయవలెనని చెప్పుతున్నారు. దీంట్లో publish చేస్తూ మూడు నెలలు time అంటారు. గుంటూరు జిల్లా గెజెట్ కొన్ని నెలలు అసలు రానేరాదు. Provincial Gazette అయితే, కొంత regular గా వస్తుంది. జిల్లా గెజెట్ ఎప్పుడు publish అవుతుందో తెలియదు. మొన్న Irrigation Conference కు సంబంధించిన publication ఒక కాగితము ముక్క మాత్రం అచ్చువేసి file లో చేయబడుటకు వుయోగించారు అనాల్సింది. కనుక జిల్లా గెజెటులో publish చేయడంలో చాలా ప్రమాద పరిస్థితి ఉన్నది. ఇది ఎవరికి తెలియకుండా పోతుంది. ఎందువల్లనంటే గెజెటు ప్రతి నెల regular గా 1 వ తేదీ అనో 15 తేదీ అనో publish చేస్తాము అనేటటువంటి హామీ మాత్రంలేదు. ఒక చిన్న ఉదాహరణ చెప్పుతాను. అమరావతి వస్తువులు దొరికితే అని మూడు నెలల లోపల వేలము వేయవలసిందనే notification 5 నెలల తరువాత అచ్చు అయింది. అయితే ఈలోగా గవర్నమెంటు వేరే సందర్భంలో interfere అయి దాన్ని ఆపివేశారు. లేకపోతే అన్యాయంగా పొయ్యేదే! కనుక జిల్లా గెజెటు regularise అయినా చేయండి, లేకపోతే Provincial Gazette లో అయినా publish చేయండి.

THE HON. SRI K. CHANDRAMOULI :—సకాలములో జిల్లా గెజెటులో publish చేస్తాము.

Clause 5 was put and carried.

Clauses 6 to 10 were put and carried.

*CLAUSE 11.*

**MR. SPEAKER : Motion moved :—**

**'That clause 11 do stand part of the Bill.'**

**This clause will meet your objection, Mr. Sundarayya.**

MR. P. SUNDARAYYA: No Sir, it does not meet my objection.

MR. SPEAKER: Irrigation rules already in force apply to this Act also.

SRI P. SUNDARAYYA: That is exactly my objection, Sir, because under the present Irrigation Act, certain amount is levied when water is taken, then the full water-rate should not be levied.

MR. SPEAKER: Government have kept the discretion with them, of course.

THE HON. SRI K. CHANDRAMOULI: All those rules apply to this also, Sir.

MR. P. SUNDARAYYA: All those rules should not be applied to this Act.

MR. SPEAKER. That Act says "At their pleasure they shall impose." So, they will never exercise their power to the prejudice of ryots.

Clause 11 was carried.

Clause 12 was put and carried.

Clause 13 was put and carried.

Clause 2 was put and carried.

Clause 1 was put and carried.

The Preamble was put and carried.

THE HON. SRI K. CHANDRAMOULI:—Sir, I move: "That the Bill bepassed into law" ఈ బిల్లునుగురించి చాలా discussing జరిగిందిగానీ, discussion చాలా happy గాను, సామరస్యంగాను జరిగిపోయింది. అందువల్ల యీ బిల్లును చట్టము చేయటానికి ఆమోదించవలసిందిగా గౌరవసభ్యులను కోరుతున్నాను.

2nd December 1955]

MR. SPEAKER : Motion moved :—

"That the Andhra Irrigation Works (Levy of Compulsory Water-Cess) Bill, 1955 be passed into law."

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, ఈ బిల్లుకుగాను మూడవచర్చ జరిగేటప్పుడు నేను ఎక్కువగా మాట్లాడదలచుకోలేదు. ముఖ్యంగా అయిదుఏండ్ల గడువును గురించిన సవరణ, మూడుఏండ్లను గురించిన సవరణ వచ్చినప్పుడు, మంత్రిగారు మూడేండ్లు అనే సవరణ ఒప్పుకుంటే, మేము అయిదేండ్లు అనే సవరణ ఓటింగుకు పెట్టడమునకు కోరడము, దాన్ని ఉపసంహరించుకుంటాము అనే అభిప్రాయము వారికి ఎందువల్ల కలిగిందో నాకు అర్థముకావడములేదు. వారు మాట్లాడుతున్నప్పుడు గానివ్వండి, నేను ఉపన్యాసము చేసేటప్పుడు గానివ్వండి, వారు మూడేండ్లు అనేది అంగీకరిస్తే, అయిదేండ్లుఅనే సవరణ నేను ఉపసంహరించుకుంటానని నేను చెప్పలేదు. ఈ బిల్లువిషయములో betterment levy వేసే సందర్భములో select committce వారందరుకూడా, అయిదేండ్లలోపల దాన్ని వేయకూడదుఅని గట్టిగా నొక్కిచెప్పారు. ఆ గడువుకోసము మేము పట్టుపట్టాము. అదేరీతిగా సెలక్టు కమిటీలో betterment levy సందర్భములోగూడ సవరణలు యిచ్చాము. ప్రభుత్వం నిర్ణయం తీసుకున్న నీటితీరువ నిర్బంధముగా వసూలుచేయటానికి పూనుకున్నప్పటికినీ, ఏ ప్రాజెక్టులక్రిందను ఎక్కడకూడా మూడేండ్లలోపల నీరు ఉపయోగించుకోడానికి సాధ్యపడదు. అందుచే యీ గడువు అయిదుసంవత్సరాలు అయినను యివ్వడము అవసరమని, నేను సవరణతెచ్చాను. అయితే నేను మూడుసంవత్సరములు అని సవరణతెచ్చిన కారణము యేమిటంటే, ప్రభుత్వం నేనుతెచ్చిన "అయిదు సంవత్సరములు" అనే సవరణ ఒప్పుకోకపోతే, మరల రెండవసారిఅయినా "మూడుసంవత్సరములు" అనే సవరణకోసము press చేయటానికి వాక్కువుండటానికి వీలుగా, రెండవసవరణ పెట్టాను. గనుక నేనుతెచ్చిన "అయిదు సంవత్సరములు" అనే సవరణ ప్రభుత్వము అంగీకరిస్తారనుకుని, పెట్టాను. ఆ సవరణ పోయినతరువాత, అసలు మొదటబిల్లులో వున్నట్లు రెండేండ్లు అనేది, వుండనేవున్నది, గనుక, రెండుసంవత్సరాలకు బదులు "మూడుసంవత్సరాలు" అనేది అడగడము కొంచెము మెరుగుఅనే ఉద్దేశ్యముతోను అది ఆమోదిస్తే కొంతమటుకైనా సంతృప్తిపడవచ్చును అని నేను ఆ సవరణను పెట్టనేలేదు. అంతేకాకుండా యీ సవరణ లన్నింటికీ మంత్రిగారు సమాధానముచెబుతూ వారు ఏ సవరణలు అంగీకరించిందిగూడ చెప్పకుండా కూర్చునివున్నారు. అయిదుసంవత్సరాల సవరణ అంగీకరించలేదు అనిమాత్రము చెప్పారు కాని, వారు మూడేండ్లను అంగీక

Sri P. Snndarayya] [2nd December 1955

రించింది, లేకపోతే నాలుగేండ్లకు అంగీకరించింది, ఏ సంగతిగూడ చెప్పలేదు. ఏదీగూడా చెప్పకుండా కూర్చున్నారు. అందువల్ల యీ గడువువిషయములో మంత్రిగారి దృక్పథము యేమిటో తెలుసుకోటానికి మరల అడుగుతున్నాము. కాబట్టి యిందులో ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యము యేమిటి ? మూడేండ్లా ? నాలుగేండ్లా ? ప్రభుత్వం ఎంతగడువుకు అంగీకరిస్తున్నారు ? కాంగ్రెసుపార్టీ కార్యదర్శిగావున్న విజయభాస్కరరెడ్డిగారు యీ గడువు నాలుగేండ్లువుంటే బాగుంటుందేమోనని సూచించారు. కాంగ్రెసుపార్టీ కార్యదర్శి చెప్పారు కాబట్టి, పోనీ, అంతవరకైనా ప్రభుత్వం ఒప్పుకుంటుందేమోనని ఆశించాము. మంత్రిగారు ఆగడువుకుఅయినా ఒప్పుకుంటే, నేను తెచ్చిన “అయిదుసంవత్సరాలు” అనే సవరణను ఓటుకు పెట్టమని అడగకుండా నాలుగు సంవత్సరాలకు అంగీకరించేవాడినే. అది మంత్రిగారు అంగీకరించనప్పుడు, మేము మా “అయిదు సంవత్సరాలు” అనే సవరణను ఓటింగుకు పెట్టమని press చేయవలసి వచ్చింది. మూడుసంవత్సరముల గడువు అంగీకరించడం అంత గొప్పసంగతి కాదు. ఎందుకంటే, betterment levy విషయములో సెలెక్టుకమిటీవారు అంగీకరించారు. రైతులు నీరుతీసుకోటానికి వీలు లేకుండా వుండేటప్పుడుగూడ నిర్బంధముగా పన్ను వసూలుచేయదలచినప్పుడు, మూడుసంవత్సరాలకుగూడ అంగీకరించకుండా వుండడము అర్థరహితముగా వున్నది. Betterment levy విషయములో మూడుసంవత్సరాల గడువుకు అంగీకరించడము, మేముకోరితే అంగీకరించారు అనేదికాకుండా, మొత్తముమీద ఏదోవిధంగా అంగీకరించారు. అందుకు మేము సంతోషించాము. మేము ఏదోఒక రాజీ మార్గముగా ఒప్పుకున్నాము గాని, కమ్యూనిస్టు పార్టీవారు అక్కడ కమిటీఎదుట మొదట మాట యిచ్చి, యిక్కడ దాన్ని నిలుపుకోలేక పోయినారు, అనే అనవసరమైన అపవాదు మా పార్టీవారిమీద మంత్రిగారు వేయడము, అంత సబబుగాలేదు. ఏమైనప్పటికినీ యీబిల్లు శాసనసభలో ప్రభుత్వము ఆమోదించి pass చేస్తున్నారు. పన్నులు వేసేటప్పుడుమాత్రం ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతాలలో వున్నవారికి ఎక్కువగా పడుతుంది కాబట్టి, వారివిషయములో కొంచెము జాగ్రత్తగా ఆలోచించి, యీ నీటితీరువ అంతాగూడ నిర్బంధముగా కాకుండా, కనీసము కొన్ని వాయిదాలరూపములోనైనా తీసుకుంటే మంచిదని అంటున్నాను. విదేశాలలో ఏవిధంగా చేస్తున్నారో, ఆ విధంగా వసూలుచేయమని Taxation Enquiry Commission వారు సూచించినట్లు, చేయుమని అంటున్నాను. మంత్రిగారు కెనడాప్రస్తాపన తెచ్చారు గాని, నేను కెనడాసంగతి చెప్పనేలేదు. కాని Taxation Enquiry Commission వారు మాత్రము Canada ను గురించి చెప్పివుండవచ్చు. కాని నేను Australia ను గురించి మాత్రము చెప్పాను. Taxation Enquiry Commi-

ssion వారు ఒక్క Canada ను గురించే చెప్పలేదు. భారతదేశములో వున్న taxation పద్ధతులు, పరిస్థితులు అన్నిటినీ గురించి చెబుతూ, యీ రకంగా నిర్బంధముగా వసూలుచేసేపద్ధతి సరియైనది కాదుఅనిన్నీ ఒకవేళ ఆ విధంగా వసూలు చేయువలసివస్తే, అది maintenance charges కు మాత్రము సంబంధించినంత వరకూ వసూలు చేయమనిన్నీ, ఆ కమిషనువారు వ్రాశారు. ఇంతేకాకుండా బొంబాయిలో యిదివరకు అట్లాగే వసూలుచేస్తున్నారు. ఎకరానికి 2½ రూపాయిలు మించి maintenance charges క్రింద వారు వసూలు చేయడములేదు. ప్రభుత్వము ఏర్పాటుచేసిన Taxation Enquiry Commission వారు వ్రాసిన రిపోర్టులో వున్న సంగతి నేను చెప్పాను. కాని కెనడాసంగతి చెప్పటానికి, ఆ దేశముసంగతి మన దేశము విషయములో ఒక ఉదాహరణగా తీసుకొనివచ్చి చెప్పటానికి ఏవిధంగాను పోలికలేదు. కెనడా చాలా భాగ్యవంతమైన దేశము. మనదిగూడ అటువంటి భాగ్యవంతముగల దేశము అయితే, పన్నులు లేకుండా పూరకనే కూర్చోవచ్చు. కనుక కెనడాసంగతి చెప్పటానికి వీలులేదు. కాబట్టి యిప్పుడు యీబిల్లు ఏదో విధముగా ప్యాసుఅయింది గనుక, యిది అమలులోపెట్టే విషయములో ప్రభుత్వం కొంచెము జాగ్రతగా ఆలోచించి, యీ పన్నులు వసూలుచేసేటప్పుడు చిన్నచిన్న రైతులమీద ఎక్కువభారము పడకుండా ప్రభుత్వము చూస్తుందనిఆశిస్తూ, ఇంతటితో విరమిస్తున్నాను.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, ఈ బిల్లు యాక్టు కాబోతున్నది. కాని యిందులోవున్న ముఖ్యమైన విషయము సుందరయ్యగారు చంద్రమౌళిగారు చెప్పారు. కె. సి. కెనాల్ క్రిందవున్న రైతులు కొంతమంది మీద యీనాడు పన్ను కొత్తగా ప్రభుత్వం వేయబోతున్నారు అని యీబిల్లు చూడంగానే కనబడుతుంది, అనేక సంవత్సరాలనుంచి, అనేక సందర్భాలలో రైతాంగానికి నీరు యిస్తామని చెప్పినప్పటికీకూడ, నీరును తీసుకోక పోవటానికి కారణము యేమిటి? వీరు పండించటానికి యిష్టములేకనా? కాకపోతే అక్కడవున్న వారు ఆ భూమిని మాగాణిగా చేయటానికి సాధ్యపడకనా? దీన్ని గురించి ప్రభుత్వం పరిశీలించిందా? పరిశీలించినట్లయితే, దీనిని ప్రభుత్వం ఏవిధంగా అభివృద్ధి పరచింది? దీనికి సమాధానము కోరినప్పుడు మంత్రిగారు యింతవరకూ సమాధానము చెప్పలేదు. అనేక ప్రాంతాలలో ప్రభుత్వంవారు ప్రాజెక్టులు కట్టిస్తున్నారు. కట్టినప్పుడు అవి కొన్నిచోట్ల ప్రజలకు ఉపయోగ పడకుండా పోయినవని స్పష్టముగా మనకు తెలుసు. కృష్ణా జిల్లాలో మాధవరం అనే ప్రాంతంలో ప్రభుత్వం ఒక లక్ష ముప్పైవేల

Sri V. Visweswara Rao] [2nd December 1955

రూపాయలు ఖర్చు పెట్టి ఒక చెరువు త్రవ్వించారు. ఈనాడు ఆ చెరువు దగ్గరకుపోయి చూచినట్లయితే, అందులో ఒక్కచుక్క నీరుకూడ లేదు. ఆ విధమైన ప్లాను వేసి, ఒక లక్ష ముప్పై వేలు ఖర్చుచేసి ఎందుకు అటువంటి నీరు నిలవని చెరువు త్రవించవలసి వచ్చింది ? రైతులు సాగుచేయటానికి సాధ్యం కావడంలేదు. దీనికి కారణము ఏమిటో ప్రభుత్వం విచారించిందో లేదో, యీ సందర్భములో సభ్యులు గుర్తించాలి. అయినప్పటికినీ, ప్రభుత్వము compulsory levy అని రైతులనుంచి వసూలు చేసేటప్పుడు, రైతులకువున్న యిబ్బందులు, వారియొక్క అనుభవాల దృష్ట్యా అక్కడవున్న వారిని విచారించి, పరిస్థితులన్నీ ప్రభుత్వం సాకల్యముగా విచారించి, తగు చర్య తీసుకోకపోవడము చాలా శోచనీయముగా వున్నది. అంటే ఆ ప్రాంతములోని ప్రజల కష్టములు నేను ప్రభుత్వ దృష్టికి తీసుకొని రావలసిన అవసరము కన్పించింది గనుక చెప్పాను.

ఈ బిల్లును మనము చట్టముచేసి, పన్నులు విధించే ముందు కొంతవరకు ఆలోచించుకోవలసిన అవసరము ఉన్నది. ఈబిల్లువల్ల రైతులు నీరు తీసుకున్నా, తీసుకోకపోయినా పన్ను వేస్తాము, అందువల్ల నీరు తీసుకోండి అని చెప్పడము జరుగుతున్నది. ఈ పద్ధతి పూర్వము లేవనింగు సమయములో జరిగే పద్ధతిలాగా ఉన్నది. ఒక్కొక్క రైతు ప్రభుత్వమునకు కొంత ధాన్యము ఇవ్వవలసి ఉన్నది. ఆరైతు ధాన్యం అమ్మి వేసుకున్నాను, రసీదు లేదు అని చెప్పినాకూడా, తప్పదు; ఇచ్చి తీరాలంటారు. అప్పుడు బజారులో ఎక్కువ ధరపెట్టి కొని చచ్చినట్లు గవర్నమెంటు అడిగిన కోటా ప్రకారంగా ఇచ్చిన సామ్మన్య రైతులుకూడా ఉన్నారు. ఆవిధముగానే ఇక్కడ ప్రభుత్వంవారు నీరు తీసుకోకపోయినా పన్ను వేస్తాము అంటున్నారు. తీసుకుంటే మంచిదే తప్పకుండా ఇవ్వవలసిన అవసరం ఉన్నది. రైతుకు భూమిని సాగుచేసుకోవడానికి తగిన అవకాశములు ఇవ్వకుండా వారికి సదుపాయాలు కలుగజేయకుండా మేము మాత్రము పన్నులు వేస్తాము అనే స్థితికి తయారవడము జరుగుతోంది. ఇందులో 4 వ సెక్షనులో చూస్తే అనేక రూపాల్లో మాత్రము వేస్తామని చెప్పారేగాని, ఎంత వేయబోతున్నారో ఏ రూపంలో వేస్తారో అని ప్రత్యేకంగా మంత్రిగారిని అడిగినప్పుడుకూడా సమాధానము చెప్పలేదు. ఈ విషయంలో Taxation Enquiry Commission Report నుంచి కూడా సుందరయ్యగారు వారికి చదివి చెప్పారు. మనదేశము సౌభాగ్యవంతమైనది కాదు. అందువల్ల మనము ప్రజా స్వామికముమీద పన్నులు వేయకుండా మనము పనులు నెరవేర్చుకోలేమని చెప్పారు. కాని మన భారత దేశములోను బొంబాయి పట్టణములోను ఇతర రాష్ట్రాలలో జరిగే పద్ధతులు కొన్నిఉన్నాయి. వాటిని మీరు ఇక్కడ

కూడా అమలు జరుపండి. వేసేపన్ను ఒక్కసారే కాకుండా మొట్టమొదట సంవత్సరమునకు ¼ వ వంతు అని రెండవ సంవత్సరము ⅓ వ వంతు అని, అంచెల వారీగా మీరు పెంచండి అని చెప్పినప్పటికికూడా, ఆలోచించక పోవడము సరియైనది కాదు. మంత్రిగారు హామీ ఇవ్వలేము అని చెప్పి, ఏదో tough గా ఉంటే ఆలోచిస్తాము అని చెబుతున్నారు. కాని harsh అనేదానికి చాలా విశాలమైనటువంటి అర్థము ఉన్నది. Harsh అనేటటువంటిది మనము ఏ భాషలో వాడుకోవాలో అర్థములేదు. ఇది ఏ రూపంలో చూసినప్పటికికూడా సరియైన పదము కాదు. దీనికి ఈ రూపంలో ఒక స్పష్టమైన అర్థము ఇవ్వాల్సిన అవసరము ఉన్నది. ఆరకంగా మేము నిర్ణయించే టటువంటి పన్ను అంతా కూడా తప్పకుండా వేస్తాము అని rules frame చేస్తే ఆ rules అమలు జరపడము అనేది జరుగుతూ ఉంటుంది. ప్రతి సందర్భములోను harsh గా ఉన్నదని మంత్రిగారి దగ్గరకు విన్నవించుకొనుటకు రావాలంటే, ఎన్ని ఖర్చులు అవుతాయో ఆలోచించుకోవలసిన అవసరము ఉన్నది. Hard cases మంత్రిగారి దగ్గరకు తీసుకొని రావలయునంటే, ఈరోజున శిస్తు కొంత ఎక్కువ అయ్యే ప్రమాదముకూడా లేకపోలేదు.

కైకలూరు తాలూకాలో ఈమధ్య ఒక సంఘటనకూడా జరిగింది. రెండవ పంటకు నీరు ఇవ్వమని ప్రభుత్వాన్ని అనేక సందర్భములో కోరినాము. వెంటనే మేము రెండవ పంట వేయుటకు సిద్ధపడుతామని కోరాము. కాని ఆలశ్యముగా డిశంబరులోనో, జనవరిలోనో నీరు ఇస్తామని ప్రకటించారు. కొంతమంది విత్తనాలుగాని, నారుగాని తెచ్చుకోలేక ఊడవకుండా అట్లాగే ఉండిపోయారు. కాని రెవెన్యూ డిపార్టుమెంటువారు మాత్రం "నీరు ఇచ్చినా మీరు ఊడవలేదు కాబట్టి, మీమీద మేము పన్ను వేస్తున్నాము, కావాలంటే మీరు అప్పీలు చేసుకోండి" అన్నారు.

MR. SPEAKER :—We are not discussing the old Irrigation Cess Act now.

Sri V. VISWESWARA RAO :—Harsh గా ఉంటే, మంత్రిగారికి చెబితే చూస్తామని చెబుతున్నారు కాబట్టి చెబుతున్నాను. Harsh గాఉంటే మంత్రిగారివద్దకు రావడము చాలా కష్టమైన విషయము. ఈ విధంగా మేము పనులు చేస్తాము అని చెబితేబాగుండేదని చెప్పడానికి ఉదాహరణగా రేపనింగు రోజుల పరిపాలనలో ఉన్నటువంటి చట్టాలు ఏ విధంగా ఉన్నాయో, rules ఏ విధంగా అమలుజరుగుతున్నాయో మంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను. అందువల్ల harsh గా

Sri V. Visweswara Rao] [2nd December 1955

ఉంటే మేము ఆలోచిస్తాము అనేది కాకుండా కనీసం ఈ పన్నులు వసూలు చేసేప్పుడు రైతుల సులువు బలువులను గమనించవలసినది. కాని ఈనాడు చట్టము తెచ్చి ప్రభుత్వము హెచ్చు పన్ను వసూలు చేస్తున్నదని చెప్పి చెబుతున్నారు. దానిని మనము ఆలోచించాలి. ఈ రూపంలో, ఈ వసూలుచేసేపద్ధతిలో harsh అనేది లేకుండా మేము ఆలోచిస్తాము అనేది కాకుండా rules frame చేసి చట్టాన్ని అమలుజరిపేప్పుడు సరియైన పద్ధతిలో రైతులకు సౌకర్యము కలిగేటట్లుగా, కష్టాలకు గురిఅయ్యేటట్లుగా కాకుండా చూడమని నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

Sri RAJA V. V. KRISHNAMA RAJU BAHADUR :-అధ్యక్షా, ఈ "బెటర్‌మెంటు లెవి" బిల్లు మూడవ పర్యాయము చర్చ సందర్భములో శ్రీ సుందరయ్యగారు కొన్ని విషయములు చెప్పినారు. మరికొందరు సోదర సభ్యులుయొక్క భావాలు నాకు అర్థముకాక వారు మాట్లాడిన వాంశములు గురించి సభవారికి నా అభిప్రాయము తెలియజేయడము ఉచితమని తమద్వారా మనవిచేస్తూయున్నాను. నీటి తీరువాయిగాని, బెటరమెంటుటాక్సుగాని, ఏ భూమికిఅయినా విధించేముందు ఏ ప్రాంతములో ఏ రకమునైన భూములుయున్నవి, సాయల్ కన్సరవేషన్ ద్వారా పరీక్షచేయించి భూమియొక్క పరిస్థితులు తెలుసుకోవడము అవసరము. అనేకప్రాంతాలలో అనేకరకముల భూములుయుంటూఉంటాయి. ఒక వేళ అన్నిభూములకు ఒకేరకము పన్నువేస్తే కొన్ని ప్రాంతములలో రైతులకు నష్టమువస్తుందనే ఉద్దేశముతో యిప్పుడు ప్రస్తుతము చర్చజరుగుతూయున్నది. బ్లాక్ కాటన్ సాయిల్‌లో 5, 6 తరహాలభూములుయున్నవి. అదేమోస్తరుగా రెడ్‌సాయిల్‌లో వున్నవి. మరినీ "సెలైన్ లాండ్సు" ఉంటాయి. "ఫెర్‌టైల్ లాండ్సు" ఉంటాయి. అందులో ప్రికేరియస్ సోర్సెన్‌గల చెరువు ప్రాంతాలు, సీజనల్‌రివర్సు అనగా రివర్ ఫెడ్ భూములు, ప్రాజెక్టు ఏరియాక్రిందయుంటే భూములు యిందులోకలవు. దీనినిబట్టి quality of the land, yield per acre, water facilities and nearness to the market యివి చూచి పన్ను కట్టవలసిన పరిస్థితియున్నదని ప్రభుత్వమువారికి మనవి చేస్తూయున్నాను. సక్రమమైన పంథాలో పన్నునిర్వచనపై కారణాలుబట్టి విధించినచో న్యాయము జరుగుతుందని చెప్పుచున్నాను. కనుక యీ విషయములో మాత్రము ప్రభుత్వము జాగ్రత్తగా, సాకల్యముగా తెలుసుకొని ఏ ప్రాంతానికి ఏ విధముగా చేయాలనే

విషయము పూర్తిగా చూడవలసినదిగా కోరుతున్నాను. అందుచేత నా ముందు మాట్లాడిన సోదరసభ్యుల ఉపన్యాసముయొక్క అభిప్రాయాలనే నేను విపులముగా తెలియజేయుటకై నేను యింతవరకూ మాట్లాడవలసివచ్చినది. యీ అవకాశము యిచ్చినందులకు అధ్యక్షులవారిని అభినందించుతూ యింతటితో విరమించుచున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈ బిల్లులో ప్రధానముగా ఈ ఆయకట్టు నిర్ణయించేసేటప్పుడు commandable area అనేది చాలా ప్రధానముగా కనిపిస్తున్నది. Commandable area అన్నప్పుడు ఒక ప్రాజెక్టు నిర్మాణాన్ని ప్రారంభించేప్పుడు చాలా ఉత్సాహంగా ఈ ప్రాంతానికంతా వస్తాయనే ఉద్దేశ్యముతోనే దీనిని వేస్తారు. కాని చివరకు కార్యాచరణకు వచ్చేప్పటికి కొంత ప్రాంతముమాత్రమే సాగవుతుంది, కొంత ప్రాంతము సాగు కాకుండా ఉంటుంది. అవి ఎన్నాళ్ళకో గాని తగిన సౌకర్యాలన్నీ కలుగజేసుకొని, కాలువలు విస్తృతము చేసుకొనడానికి కావలసిన పరిణామాలన్నీ చూసుకుంటేనే గాని సాగులేదు. అందువల్ల commandable area అనేపుడు అందులో clearగా వ్రాసినది ఏమిటంటే ఇవ్వాళిటిరోజున సాగుచేస్తున్నటువంటి ప్రాంతములేకుండా ఏదో commandable ప్రాంతము అనుకొంటాము. దానికంతటికినీ ఇది వర్తిస్తుందని అన్నారు. నిన్న సవరణకు మంత్రిగారు సమాధానము చెబుతూ commandable area కంటే irrigable area మాత్రమే పెట్టినట్లయితే అసలు ఈ బిల్లు అవసరము లేకుండాపోతుంది అన్నారు. నిజమే కొందరు లెఖ్ఖలలో లేకుండా దొంగతనంగా చేస్తున్నారు. అది లెఖ్ఖలోకి రాకుండా నేపోతుంది. Irrigable అన్నట్లయితే, మేము ఏర్పాటుచేసిన commandable area మొత్తము కలిసి నట్లయితే బాగుంటుంది అన్నారు. commandable area అని వీరు వ్రాసింది అంతాకూడా చాలా చెఱువులక్రింద, చాలా కాలముక్రింది కొత్త ప్రాజెక్టులక్రింద ఉన్నది. ఉదాహరణకు కండ్లేరు ప్రాజెక్టు తీసుకోండి. కండ్లేరుప్రాజెక్టు Irrigable area అంతాకూడా దాదాపు సాగుకాదేమోఅన్న అనుమానంకూడా వచ్చింది. గుంటూరుజిల్లా irrigation conference లో కూర్చొని అడిగితే, అది ఎంతవరకు వచ్చిందో మాకు తెలియకుండా ఉన్నది. ఏదిఅయిందో, ఏదికాలేదో enquiry చేసి చెబుతామని కలెక్టరుగారు చెప్పారు. Commandable area అని నిర్ణయించి నటువంటి average 5 వేలు, 10 వేలు ఉన్న దానిక్రింద, సాగవుతున్నది. ఎంత ఉన్నదంటే, 1200, 1300 ఎకరాలుకన్నా ఎక్కువలేదు. అట్లాగే బలిగుబండ చెరువునుగురించి మనవిచేశాను. 1500 ఎకరాలు సాగవుతుంది అని అంచనా అవుతున్నది. 450 ఎకరాలకుమాత్రం అట్లాగే కొన్ని canals తీసుకొన్న

ప్పటికికూడా ఆ పరిస్థితిలోనే ఉన్నాయి. కనుక మొట్టమొదట వేలు అనుకొన్నటు వంటి అంచనాలకు ఎన్ని క్యూసెక్కుల నీరు వస్తున్నది ? ఈ ప్రకారంగా వేస్తే ఆ ఏరియా అంతా సాగు అవుతుందికదా, అని వేసుకొని ఉంటారు. ఆ ప్రకారంగా వేసుకొని అందరిమీద వేసినట్లయితే చాలానష్టము అవుతుంది, ఆనాడుకూడా నీళ్లు పారని area అంతాకూడా ఎంతో ఆనాడు ఇంజనీర్లు వూహించుకొని, ఆ area అంతాకూడా లెక్కకట్టుకొని, commandable area నిర్ణయించారు. అందువల్ల ఏప్రాంతములోఅయితే నీరు తీసుకుంటున్నవారు ఉన్నారో, ఆ ప్రాంతమువారిని తీసుకొని యింతవరకు ఖచ్చితంగా మేము తెచ్చాము, ఇది commandable area అనేటప్పుడు మళ్ళా దీర్ఘంగా ఆలోచించాలని మంత్రిగారిని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

SRI C. SUBBARAYUDU :—అధ్యక్షా, ఈ బిల్లు సందర్భములో compulsory levy చేసేప్పుడు ప్రధానంగా water source assured అయితే తప్ప ఇది చాలా ప్రమాదానికి దారితీస్తుంది. ఇప్పుడు ముఖ్యముగా ఈ K. C. Canal ఆయకట్టు లెక్కతీసుకుంటే, ఆ service అంతాకూడా లెక్కలోకి తీసుకున్నట్లయితే అక్కడ ఆయకట్టు develop కాకుండా ఉండడానికి ముఖ్యమైన కారణము 1900 సంవత్సరములో పెద్దపెద్ద యింజనీర్లుకూడా examine చేసినప్పుడు అది మొదట 3 వేల క్యూసెక్కులనీరు అంతాకూడా కొలువకు పెట్టినప్పటికి కూడా ఆనాడు ఉన్నటువంటి ఆయకట్టుకు సరిపోయే దానికంటే చాలా తక్కువ నీరు వస్తున్నట్లుగా రికార్డులలో బాగా స్పష్టముగా ఉన్నది.

ఆయకట్టు ఏవిధంగా develop అవుతుంది ? అవకాశం ఉండదు. ఆ sources ను ఎప్పటికప్పుడు మరమ్మతుచేసి కావలసిన నీరు supply చేస్తేతప్ప కేవలం వావిలాల గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు commandable area కు ఆయకట్టుకు చాలా తేడావున్నది. తుంగభద్ర ప్రాజెక్టును తీసుకుంటే ఆంధ్రదేశం మొత్తంమీద 8 లక్షల ఎకరాలు commandable area క్రిందకు వస్తుంది. అందులో 30% నుంచి 70% area ఆయకట్టుబట్టి నిర్ణయంచేస్తుంటారు. దానికి supply చేస్తారు కాని command చేసేదానిగా నిర్ణయంచేయరు. నందికొండలో 50% ఆయకట్టు పెట్టారు. Levels 100 ఎకరాలకు permit చేసినప్పటికీ నీరు ఇచ్చేది

2nd December 1955] [Sri C. Subbarayudu

50%కే అనేది స్పష్టంగా ఉన్నది. Commandable area కు పన్ను వర్తిస్తుంది అంటే అన్నిటికీ నీరు యిచ్చినట్లయితే, canals ఏర్పాటు చేసినట్లయితే, వాటిపై పన్ను వేయవచ్చును. దీనిని రైతులకు ముందుగా తెలుపవలసి ఉంటుంది. ఈ విషయాలన్నీ ప్రభుత్వం ఆలోచించి చేయవలసి వుంటుంది. కొన్నిచోట్ల మూడు సంవత్సరాలైనా ఆయకట్టుక్రింద తీసుకురావడానికి అవకాశాలు ఉండవు. ఎగుడుదిగుడుగా వుండడంచేత మట్టినితీసి, level చేసుకోవలసి వుంటుంది. తుంగభద్ర low level canal క్రింద ఆయకట్టు develop చేయడానికి ఇదే ప్రతిబంధకంగా ఉన్నది. రెండు మూడు సంవత్సరాలు రైతుకు పంటపండదు. కావలసిన bulldozers ఉంటేనే రెండుమూడు సంవత్సరాలు లోపుగా అవకాశం ఉంటుంది. Localisation చేసిన ప్రాజెక్టు ప్రారంభించిన వెనువెంటనే ఫలానా రైతుభూమి wet అని, ఫలానాది dry అని, తెలియపరిస్తేనే ఆ రైతుకుకూడా సాగుకు లాయికీగా చేసుకోడానికి వీలు ఉంటుంది. లేకుంటే, canal పూర్తిగా త్రవ్వినతరువాత localisation చేస్తే రెండు సంవత్సరాల్లో రైతు level చేసుకుని సాగులోనికి తీసుకురావాలంటే ఏ రైతుకు సాధ్యంకాదు. ఒక్కొక్కచోట నాలుగైదువందలు అవుతుంది. ఈ విషయాలన్నీ ఆలోచించి రైతులకు భారంగాఉండేటట్లు కాకుండా rules చేయాలని కోరుతున్నాను.

SRI B. RATNASABHAPATHY :—అధ్యక్షా, ఈ బిల్లులోని ఒక ముఖ్యవిషయం గురించి నేను మొదట మాట్లాడినాను. Bill pass కాబోతుంది కనుక మంత్రిగారికి ఒక మనవిచేసుకోవాలని కోరుతున్నాను. ఈ బిల్లు commandable area లో direct గా benefi' అయ్యే భూములన్నింటికి అన్వయిస్తుంది. సంవత్సరమంతా regular గా benefit, పొందని పొలాన్నిగురించి మరల ఆలోచించాలని మనవిచేస్తున్నాను. Investigation stage లో Engineers commandable area అంతా లెక్కలోనికి తీసుకొంటున్న విషయం అందరకు తెలుసును. Investigation చేసినపుడు ఈ ప్రాజెక్టువల్ల భూములన్నింటికీ నీరు పారుదల అవుతుందా, లేదా అనేది ఒక్క P.W.D. Engineers వల్ల మాత్రమే కాదు, దానికి Special Collector reports సిఫార్సులు ఉన్నాయి.

MR. SPEAKER :—The Collector will decide it.

SRI B. RATNASABHAPATHY :—P. W. D. ఇంజనీర్లు నిర్ణయం చేయడంవల్ల కొన్ని లోపాలు వస్తున్నాయని చెప్పారు. అందువల్ల investigation చేసేటపుడు P.W.D. Engineers, Surveyors Revenue Department వారు ఉమ్మడిగాచేస్తే అందులోవచ్చే difficulties ను overcome

Sri B. Ratnasabhapathy] [2nd December 1955

చేయడానికి చాలావరకు అవకాశం ఉంటుంది. పూర్తిగా benefit కాని భూములను exempt చేసే అవకాశం కల్పించాలని కోరుతున్నాను.

SRI N. VENKAIAH :—అధ్యక్షా, ఈ బిల్లును ప్రభుత్వంవారు తీసుకుని వచ్చి తమఅభిప్రాయం ప్రకారం pass చేసుకునే అవకాశాలు ఉన్నప్పటికీ, 14 మంది సభ్యులుకలిగిన ఒక చిన్నపార్టీ యొక్క సవరణ ఎందుకు ఆమోదించాలనే భావంకాని అప్పటికప్పుడు కాంగ్రెసుపార్టీవారు సూచించినంత మాత్రంచేత ఎందుకు దృష్టిలో పెట్టుకోవాలనేభావం కాని లేకుండా ఔదార్యంతో మూడు సంవత్సరాల కాలపరిమితిని అంగీకరించి ఈ బిల్లును pass చేయడానికి తోడ్పడినందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. జనాభా తక్కువగాఉన్న పరిస్థితులలో నూతన మాగాణిసాగుతు తగిన విధంగా అభివృద్ధిచెందాలంటే చాలాకష్టం. సాగుఅయిన భూమిని సాగు చేయడంలో 100 ఎకరాలకు ఎంతశ్రమపడవలసివస్తుందో, ఎందరు కూలీలు కావలిసి వస్తారో, ఎంత పెట్టుబడి కావలిసినస్తుందో, అంతశ్రమ, అంతమంది కూలీలు, అంత పెట్టుబడి 5, 10 ఎకరాలకే క్రొత్త ప్రాంతాలలో పెట్టవలసిఉంటుంది. మూడు సంవత్సరాలుకూడా జనాభా, పెట్టుబడి, బాగాఉంటేనే కాని ఎంతోకృషి చేస్తేనే కాని నూతన మాగాణిసాగులోనికిరాదు. తుంగభద్ర area వంటి ప్రదేశాలలో మూడు సంవత్సరాలుచాలదు. పైవారు రావడానికివారు సమ్మతించకపోవచ్చును. అలాంటప్పుడు సాగు చాలా కష్టంగా ఉంటుంది. ఆ ప్రాంతీయులకు. నేను విజ్ఞప్తి చేసేది ఏమిటంటే పైవారి డబ్బు, శ్రమ మీరు సహకారంగా తీసుకుని త్వరలో—మూడు సంవత్సరాలులో పుగానే—సాగుచేయడానికి ప్రయత్నం చేయాలని కోరుతున్నాను. గవర్నమెంటు రూల్సు తయారుచేసినపుడు ఔదార్యయుతంగా చేయక పోతే రైతులు. చాలాకష్టాలపాలు కావలిసివస్తుందని మనవి చేస్తున్నాను. ఈ ప్రాంతాన్ని సాగుచేయడానికి తగిన అవకాశం కల్పించడానికి ధనసహాయం, కూలీల సహాయం, ఇతర విధాల bulldozers వగైరా సౌకర్యాలు కల్పించినపుడు ఇది త్వరలో సాగుకురావడానికి వీలుఉంటుంది. ఈ ప్రాంతీయుల అనుభవాలను పురస్కరించుకుని ముందు ముందు సాగుఅయ్యే ప్రాంతాలకు మరొక సవరణ తీసుకురావడానికి ప్రభుత్వాన్ని కోరుతూ ఔదార్యంగా ఈ బిల్లును సవరించి pass చేసినందుకు ప్రభుత్వంవారిని అభినందిస్తూ విరమిస్తున్నాను.

SRI B. SANKARAIAH :—అధ్యక్షా, ఇదివరకు చర్చలోని కొన్ని విషయాలనుగూర్చి మంత్రిగారు జవాబుచెప్పినపుడు clarify చేయాలని అడిగాము. కాని వారు సరిగా clarify చేయలేదు. అమలుజరిపేటప్పుడైనా ఆ విషయాలను దృష్టిలో పెట్టుకోకపోతే కలెక్టరుగారు notice ఇవ్వడం మళ్ళీ appeals

రావడం పెద్ద గందరగోళం ఏర్పడే అవకాశంఉన్నది. All canals, channels, tanks, wells, reservoirs, ponds, spring ponds అన్నీ కూడదానిలోకలిపి ఉన్నాయి. గవర్నమెంటు ఎంతో డబ్బు ఖర్చుచేసినదనేకాని మేము హామి ఇచ్చే టటువంటి ప్రదేశాలలో ఇస్తామనిలేదు. గూడూరుదగ్గర పంచి లేరు ప్రాజెక్టు అని ఒకటిఉన్నది. నీటి విషయమై గూడూరు, చెన్నూరులవద్ద పెద్ద కొట్లాటజరిగింది. ఒక ప్రాజెక్టు కట్టినపుడు దానిక్రింద ఎంతభూమి సాగుఅవుతున్నదో నిర్ణయించిన తరువాత ఆ భూమికి చాలకుండా ఉండడం అనేక ప్రదేశాలలో ప్రభుత్వానికి తెలుసును. ఆ ప్రదేశంఅంతా ఆ విధంగా నిర్ణయించాము కొబట్టి నీళ్లు చాలకుండాపోయి riotings వస్తున్నాయి. సాగుకాని ప్రాంతాలలో ఎప్పుడో fix చేసి నాము కొబట్టి పూర్తిగా శిస్తువసూలు చేస్తాము అనే అవకాశంఉన్నది. దీనిప్రకారం కలెక్టర్లు చర్యతీసుకుంటారు. ఆత్మకూరు తాలూకాలో పెన్నానదినుంచి నీళ్లు వస్తున్నాయి. ఒకొ్కక్క సంవత్సరం విపరీతమైన ఖర్చుపెట్టి కాలువలుతీసి నీరు పారించుకుంటుంటారు. సకాలంలో వచ్చిన సంవత్సరం ఎక్కువఖర్చు అయినా ఫలితం ఉంటుందని కాలువలుతీస్తారు. ఎప్పటికప్పుడు ఇసుక వేసుకొని పూడిపోతుంది.

అందుచేత నీరు guaranteed గా supply చేస్తే నిర్లక్ష్యంచేసి ఉపయోగించుకొనే రైతులు అరుదుగా వుంటారు. విధిగా అటువంటి భూములమీద చర్య కొంతవరకు సక్రమంగా తీసుకోవలసినదే. ఆవిధంగా నైనా జాగ్రత్తగా ఆలోచించి రైతులు యింకేవిధమైన నష్టాల పాలుకాకుండా appeal లేకుండా ఉండడానికి ఆలోచించి తెచ్చిందికాదు. దీనిని అమలులో పెట్టినపుడైనా సరే రైతాంగానికి Revenue Board కు appeal: తీసివేయడానికి అనువుగా సాధ్యమైనంతవరకు ఆ rules మార్చడానికి తగిన చర్యలు తీసుకోవాలని కోరుతూ విరమిస్తున్నాను.

* Sri A. VENKATARAMA RAJU :—అధ్యక్షా, ఈబిల్లు మంత్రి గారు తీసుకొని వచ్చినటువంటి సవరణతోటి 1959 సంవత్సరంనుంచి అసలు వీటిమీద పన్ను అమలులోకి రావడం అనేటటువంటిది జరుగుతుందని అనుకొంటాను. ఐతే యీ పరిస్థితిలో యివ్వాళ మనం pass చేస్తున్నటువంటి bill తీసుకువచ్చినపుడు దేశంలో వున్నటువంటి ధరవరలు దృష్టిలో పెట్టుకుని చూస్తే ధరలు తగ్గుముఖంలోను పన్నులు హెచ్చు ముఖంలోను వున్నందువల్ల రైతాంగంయొక్క సాధక బాధకాలు పరిశీలించవలసిన అవసరం వున్నది. రెండోది ఈబిల్లు pass అయినది కనుక అమలు జరుపాలి అనేటటువంటి దృష్టిలో కాకుండా అసలు దీనిని అమలు జరిపేటప్పుడు పన్నులు వేసేటప్పటికి, వాటిని అమలుపరచేనాటికి పరిస్థితులలోగల మార్పుకూడా

దృష్టిలో పెట్టుకుని అమలు జరపాలి. కాని ఏదో pass అయినది కాబట్టి అని గాని లేక majority తో pass చేస్తున్నారు కాబట్టి యీ Act అమలు జరపడం విధి అనే దృష్టితో పరిశీలించేటటువంటి రోజులు మాత్రం కావని గుర్తిస్తూ ఆ రకమైన జాగ్రత్తలు మంత్రిగారు తీసుకోవలసినది అనికూడా కోరుతున్నాను. తెండ్లోటి క్రిష్ణంరాజు బహదూరుగారు చెప్పినట్లు భూముల స్వభావాన్ని దృష్టిలో పెట్టుకొని అమలులోకి తీసికోవలసివున్నది. అలాగే saline landsవున్నాయి. Saline lands గా వున్న బంజరు భూములకు నీరు పారించితే సరిగా 4, 5 సంవత్సరాలకు గాని పరిపూర్ణం అయిన పంటలోకి రాదు. ఈ సూచనలు దృష్టిలో పెట్టుకొని 3 సంవత్సరాల పంట మాత్రం అన్వయించడం కాకుండా ఆయా భూముల స్వభావాన్నిబట్టి project వల్ల భూమిలో వచ్చేటటువంటి మార్పు ఏమిటో ఎప్పుడు దానిని అమలు జరుపవలసినదో అనేటటువంటిదికూడా rules తయారు చేసేటప్పుడు మంత్రిగారు గుర్తులో పెట్టుకోవలసిన అవసరం వున్నది. నాలుగు తరహాలుగా అమలు జరుపవలసినదన్న Taxation Enquiry Committee సూచనను ప్రతి పక్షనాయకులు చూపిస్తే మంత్రిగారు సూక్ష్మంగా simplify చేసి సమాధానం చెప్పారు. ఫలసాయం ఒకేసారిరాదు. క్రమేణావస్తుంది అనేటటువంటిది దృష్టిలో పెట్టుకొని ఆలోచించినపుడు practical side పరిశీలించి 3, 4, 5 తరహాలులో వేయాలిగాని 3 సంవత్సరాల మొత్తంమీద పన్ను వసూలు చేసే పద్ధతి సరైనది కాదని అనుభవముమీదకూడా తెలుస్తున్నది. సుందరయ్యగారిచ్చిన సూచన తీసుకోవాలిగాని Taxation Enquiry Committee యిచ్చిన సమాధానం సంతృప్తికరంగాలేదు. తరువాత Delta areas కు చెందినంతవరకు యివి ayacut లో చేరినటువంటి భూములు అని ఒక్కుమ్మడి ఆదేశిస్తున్నారు. Irrigation Department commandable area నిర్ణయిస్తారు. నిర్ణయించిన తరువాత పన్నులను Revenue Department వసూలు జరుపుతారు. Delta area లో అనేక scheme లు కూడా అమలు జరుపలేదు. Commandable area లో నిర్ణయించబడిన తరువాత 3 సంవత్సరాలలోగా సాగుచేయకపోయినట్టయితే యీ పన్ను పడుతుంది. Commandable area లో Irrigation Department చేసిన నిర్ణయాలలో వైరుధ్యాలు అనుభవంలో వున్నాయి. కనుక యీ చట్టాన్ని అమలు పరచడంలో యివన్ని దృష్టిలో పెట్టుకోవలెనని కోరుతూ శలవు తీసుకుంటున్నాను.

SRI P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా, బిల్లును గురించి చర్చ, అందరూకూడా మాట్లాడడం, అందరికీ ఉద్దేశంమీద అన్ని పార్టీల ఉద్దేశంతో సుందరయ్యగారు పెట్టినటువంటి 3 సంవత్సరాల సవరణ ఏకగ్రీవంగా మంత్రిగారు

విశాల హృదయంతో విశాల దృష్టితో accept చేశారు. 3 సంవత్సరాలు ఒప్పకున్నారు. దీనిని గురించి యిప్పుడు third reading జరుగుతున్నది. ఈ third reading stage లో యిష్టంవచ్చినట్లు discussion చేయాలంటే టైము వుండదనుకుంటాను.

MR. SPEAKER :—Point of order raise చేస్తున్నారా?

SRI P. NARASIMHAPPA RAO :—లేదండీ. Point of order కాదండి.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, దీనిని అమలుజరపడంలో చాలా సాధకబాధకాలున్నాయంటున్నారు. ఇక్కడ clause 6 చూసినట్లయితే 3 సంవత్సరాల అనంతరం కలెక్టరుకు ఏ ఫసలీనుంచి levy చేయవచ్చునో స్పష్టంగా నిర్ణయం చేయవచ్చు. సరిగా మూడుసంవత్సరాల తరువాత levy చేయకూడదని ఎక్కడాలేదు. అందువల్ల notify చేసిన అనంతరం రైతు representation చేస్తే బహుశః యీ చట్టం అమలులోకి వచ్చేటటువంటి యిబ్బందులు ఉండవు. ప్రభుత్వచట్టంలో యిలాంటి సాధక బాధకాలున్నట్టు ఏమీ కనిపించడంలేదు. పోతే irrigable అనేమాట గురించి చెప్పినారు. నిజంగా అది soil ను బట్టి ఉంటుంది. Krishna delta చూస్తే commandable area క్రింద 2000 ఎకరాలుంటే సేద్యం 3000 ఎకరాలుంటుంది. రాయలసీమలో యివ్వాళ చూస్తే commandable area క్రింద 4000 ఎకరాలుంటే సేద్యంక్రింద 1000 ఎకరాలుండవచ్చును. ఇలాంటి పరిస్థితులలో ప్రత్యేకంగా కలెక్టరు తననిర్ణయంను అమలుపరచడం అవసరమైనది. ఇందుకు స్పష్టంగా కలెక్టరుకు ఆదేశం యిచ్చినట్లయితే రైతులకు అట్టి సాధకబాధకాలుండవని అభిప్రాయపడుతున్నాను. మొత్తం మీద యీ bill ను అమలు జరపడంలో రైతుల సహకారంకూడా పూర్తిగా ఉంటుందని ఆశిస్తున్నాను.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, నిన్న యీ బిల్లు amendment move చేసే సందర్భంలో completion విషయంలో అయిపోయిన తరువాత మంత్రిగారు తమాషాగా మాట్లాడినట్టు తీసికొని complete కానిదే ఎట్లా తీసుకుంటామయ్యా అని చెప్పారు. రైతులకు సాధకబాధకాలు చాలావున్నాయి. రాళ్ళపాడు project విషయంలో completion నిర్వచనం ఖచ్చితంగా నీళ్లు తీసుకోడానికి ఎటువంటి చిన్న ఆటంకాలున్నా లేకుండా ఉన్నాయిఅనే అర్థంతో కనీసం rules చూసేటప్పుడైనా అవగాహనకావాలి. ఉదాహరణకు అడంగల్సులో

Sri G. Yellamanda Reddi] [2nd December 1955

చెరువుకు నీరుయిచ్చినట్లుంటుంది. ఐరి వేయలేదు ఎందుకని అంటే, penalty లు వేస్తారు. అందుచేత సక్రమంగా black and white లో definite గా ఉండాలి. చట్టంలో 2, 3 అక్షరాలు ఎక్కువైనా యిబ్బందిలేదు. అందుచేత completion అనేదాని నిర్వచనం సక్రమంగా ambiguity లేకుండా చేయాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

SRI G. JAGANNADHA RAJU:—అధ్యక్షా, ఇంతవరకు ప్రతిపక్షము వారు ప్రత్యేకము కొన్నిసందేహాలను వెలిబుచ్చారు. సందేహాలకు తావులేదని మనవి చెయ్యడానికి మీ ఎదుటకు వచ్చాను. అందులో ప్రథమతః commandable area అంటే ఇంజనీరింగు డిపార్టుమెంటు ఏర్పాటుచేస్తే రైతులు ప్రభుత్వంవద్దకు వెళ్ళి చెప్పుకునే అవకాశం ఉంటుందా అన్న సందేహము ఉన్నది. 3 వ క్లాజులో

"Notwithstanding anything contained in any law for the time being in force, it shall be lawful for the Government, to levy every fasli, water-cess on all lands under the irrigable command of any irrigation work constructed, expanded or altered by the Government, whether before or after the commencement of this Act, although the lands are not actually irrigated under that work.

Provided that such levy shall not be made until the expiry of two years from the date of completion of the construction, expansion or alteration of the irrigation work."...

అని స్పష్టముగా ఉంది. ఇదికొత్త రైతులకు తెలియకుండా అది జరగడానికి వీలులేదు. ఇందులో provision కనబడుతుంది. 5 వ క్లాజులో ఈ విధంగా ఉన్నది.

"Before levying water-cess under this Act, a notice shall be published by the District Collector in the District Gazette and in such other manner as may be prescribed, specifying the lands under the irrigable command of the work, and liable for the payment of water-cess under this Act, together with rate or rates of water-cess payable on the lands and the fasli year from which such levy shall be made..."

(2) Separate notices to the same effect shall also be served in the prescribed manner on all persons known or believed to be the owners of, or interested in the land specified in the notice, so far as such service may be practicable."

అందుచేత కలెక్టరుగారి notice pudlish అయిన తరువాత inquiry officer objections విన్న తరువాత మళ్ళీ కలెక్టరువద్దకు వస్తుంది. Irrigable command క్రిందఉన్న area ఏమిటో స్పష్టీకరించడానికి అభ్యంతరాలు విన్నతరువాత కలెక్టరు ఆర్డరువేస్తారు. అదేవిధముగా rate of water cess payable on each of the said lands and the fasli year from which such water cess shall be leviable అనే దానినిగూర్చి Collector orders జారీ చేయును. ఈ విషయము d. (6) లో స్పష్టీకరించబడి ఉన్నది.

అందుచేత work complete అయిన తరువాత మూడుసంవత్సరాలు అని ఉన్నప్పటికి elections విన్న తరువాత నీరురాలేదని కలక్టరుగారికి తోచితే, త్వరితముగా భూమిసాగులోనికి రాలేదని కలెక్టరుకు తోచినట్లయితే ఏ సంవత్సరం నుంచి కలెక్టరు చెయ్యాడమో కలెక్టరుకు discretion ఇచ్చినట్లుఉంది. కనుక ఏవిధమైన సందేహము ఉండవలసిన అవసరంలేదు. యధాతధముగా ఈ 3rd Reading లో Bill ను pass చెయ్యవలెనని కోరుతున్నాను. ఈ అవకాశము యిచ్చినందులకు అధ్యక్షులవారికి వందనములు అర్పిస్తున్నాను.

THE HON. Sri K. CHANDRAMOULI :—అధ్యక్షా, ఈ బిల్లును గురించి కొన్ని సందేహాలు గౌరవనీయులైన సభ్యులు సూచించారు. ఆ సందేహాలలో కొన్ని కేవలం పంధాలమీద ఆధారపడ్డట్టు theoretical గా కలిగిన సందేహాలు కొన్ని శ్రీ సుబ్బారాయుడుగారికి శ్రీ విశ్వేశ్వరరావుకు ఉన్నవి. సందేహాలు కలగడం మంచిదికాదని నేను అనను. సందేహనివృత్తికి మార్గాలను అన్వేషించడం ప్రభుత్వబాధ్యత అయితే నేను రెండు మూడు ముఖ్యవిషయాలను గురించి మనవిచేస్తాను. అభివృద్ధి పన్నువిధింపుకు ప్రాజక్టు పూర్తిఅయిన తరువాత మూడు సంవత్సరాలకాలం మనము ఇచ్చాము. మనము ప్రాజక్టులమీద చాలా ఖర్చు చేసినాము. ఈ చట్టం అమలులోనికి వచ్చుటకు మనకు మూడు సంవత్సరాల కాలము ఉన్నది. గౌరనీయులైన సభ్యులందరు గ్రామాలకుపోయి రైతులు ఈ ప్రాజక్టుల ద్వారా లభ్యమయ్యే నీటిని త్వరగా ఉపయోగించుకొనేటట్లు ప్రోత్సాహపరచి ఈ చట్టము అమలులోని penal clauses రాకుండా చేసేపరిస్థితులు తెస్తే ప్రభుత్వం

Sri K. Chandramouli] [2nd December 1955

కన్న ఎవరూ సంతోషించేవారు లేరు. దానికి రైతులందరు తోడ్పడవలెను. అలా అయితేమన సందేహాలన్నీ చాలావరకు తీరుతవి. ఇప్పుడు ఈ బిల్లు అమలులోకి రాకుండాను రైతులకు వత్తిడి బలవంతము లేకుండాను మనము చూచుకొనవచ్చును. ఆ పరిస్థితులలో కొంత వరకు చిక్కులు తొలగిపోతవి.

చవిటిభూములు బాగు చెయ్యడానికి చాలాకాలం పడుతుంది. నేను వ్యవసాయశాస్త్రం చదువుకున్నాను కాని ఆ శాస్త్రము మరచిపోయినాను. నాకు అనుభవంకూడా తక్కువే అయినా ఒక్కవిషయం నాకు యిప్పటికి తెలుసును. చవిటి భూమిలోకి మంచినీళ్లుపెడితే కొన్నాళ్లకు ఆఉప్పు అంతాపోతుంది అప్పుడు ఆవుప్పు నీటిని బైటకుతోడివేస్తే భూమిలోని వుప్పుదనం తగ్గుతుంది. ఇప్పుడు నవీనశాస్త్రం ప్రకారం రెండు సంవత్సరాలు అట్లాచేస్తే తరువాత భూమిలో ఉప్పుఅంతా పోయి వ్యవసాయానికి పనికివస్తుంది. కొంతఉప్పు ఇంకా క్రిందఉండవచ్చును. ఒక సంవత్సరంపైకి రావడం ఇంకా సంవత్సరంక్రిందకు పోవడం జరుగుతుంది. విశ్వేశ్వరరావు గారు దివి తాలూకా అనుభవంతో ఈ విషయమై చెప్పివుండవచ్చు. ఏమైనప్పటికీ చెబుతున్నారు బహుశః దానివల్ల పంటకు వీలుపడదు. రెండవపంటకు మాత్రము తక్కువ అవకాశం ఉంటుంది. రెండు మూడు సంవత్సరాలు చక్కగా నీరుపెడితే భూమి బాగుపడి పంటలు ఎక్కువగా పండడానికి అవకాశమేకాకుండా, రెండవ పంటకుకూడా అవకాశం ఉంటుంది. ముందు ముందు ఎక్కువ లాభసాటిగాకూడ ఉండవచ్చును. అయితే ఇటువంటి చవిటిభూములపై పెట్టుబడి పెట్టడం చాలా కష్టం అంటున్నారు. నీరుకు పెట్టుబడి అవసరంలేదు. అవృష్టిలోచూస్తే చవిటిభూములు అంత నష్టకరముకాదు. రైతులను ప్రోత్సహించి మంచి నీటిని భూములకు పెట్టు నట్లుచేస్తే భూములకు శ్రేయస్కరము. ఈ విధంగా చేయడానికి డబ్బుపెట్టుబడి అవసరంలేదు.

కొంతమంది కొత్తవిషయాలు మాట్లాడుడారు. డబ్బుఖర్చు పెట్టకుండా ప్రభుత్వవ్యయం చెయ్యకుండా చెరువులు spring channels మొదలైనవాటి మీద పన్ను వసూలు చేయదలచుకున్నారని అన్నారు. వీటిని గురించి నేను పబ్లికు స్టేటుమెంటు చెయ్యను కాని ఒకవిషయం మాత్రము చెబుతాను. ఇటువంటి జలాధారముల క్రింద తప్పక సాగుచేయాలనే నిర్బంధంలేదని గౌరవసభ్యులకు మనవి చేస్తున్నాను.

Commandable area గురించి కొంత సందేహముఉన్నది. దానిని గురించి మనవిచేస్తాను. Commandable area ను నిర్ణయంచేసేటప్పుడు P. W. D. వారు వర్షాలు సరిగా వుంటవని, నదులలో నీరు ఉంటుందని ఊహించి estimate

తయారు చేస్తారు. దానినిబట్టి ఇంత నీరువస్తుందని నిర్ణయిస్తారు. దానిలో కొంత percentage తగ్గిస్తారు. కొత్తభూములు నీరు పీల్చడం soil నుబట్టి ఉంటుంది. ఇసుక, రేగడి, 20 డ్రా.భూములగురించి వ్యవసాయశాస్త్రము చదువుకున్నవారితో ఆలోచించి నిర్ణయముచేస్తారు. తరువాత కలెక్టరుగారు commandable area నిర్ణయంచేస్తారు. తరువాత permanent ayacut నిర్ణయించే విషయంలో ఎన్నో సంవత్సరాల సగటు సాగులెక్కలు తీసుకుని కొంత తగ్గింపుచేసి కుదించి ఆయకట్టును శాశ్వతంగా నిర్ణయంచేస్తారు. రెండవ విషయము విశ్వేశ్వరరావుగారు చెప్పారు. Precaucious-precarious wet ను గురించి శ్రీ విశ్వేశ్వరరావుగారు చెప్పారు. వారు క్రిష్ణాజిల్లా మాగాణి ప్రాంతంవారు. నేనుకూడ మాగాణిప్రాంతంవాడనే. నీరు ఇస్తామన్నప్పుడు రైతులలో ఉత్సాహం అధికమవుతుందని అందరకు తెలిసినదే. మా ప్రాంతాలలో ఆయకట్టుక్రింద 100 ఎకరాలుంటే 300, 400 ఎకరాలు సాగుచేసి గవర్నమెంటును ఒత్తిడిచేసి P.W.D. వారిని ఇబ్బందిపరచి ఒత్తిడిచేసి భూములకు నీరు కావలెనని, ఇంకా ఎక్కువ సదుపాయాలు చేయండిఅని రైతులు కోరడం మనకు తెలిసినటువంటి విషయమే.

ఇటు విషయాలు అన్ని ఉన్నాయి. అయితే చట్టాన్ని అమలు జరిపేటప్పుడు కొన్ని చిక్కులు వస్తూ ఉంటాయి. ఈ చిక్కులను, రాకుండా చేయుటకు ప్రయత్న చేయాలి. ఆఫీసర్లు ఎవరైనా బుద్ధి పూర్వకంగా bad motive తో చేస్తూఉంటే, అటువంటిది అరికట్టడానికి మనం ప్రయత్నం చేయాలి. ఈ చట్టానికి సంబంధించి ఉత్తరోత్తర కొన్ని rules చేయబోతాము. వాటిని ఈ సభముందు పెడతాము. గౌరసభ్యులకు ఏమైనా సందేహాలుంటే వాటిని వ్రాసి యివ్వండి. వాటిని ఆలోచించి కావలసిన సవరణలను rules లో incorporate చేయడానికి ప్రయత్నిస్తాము. అప్పటికి ఇంకా సందేహాలు ఉంటే ఈ ఆక్టులో ఎప్పుడు బట్టితే అప్పుడు సవరణలు చేయడాని శాసనసభవారికి ఎప్పుడూ అధికారం ఉంది. ఈ వేళ మేము ఉన్నాం కాబట్టి, ఈ చట్టం పెట్టాం కాబట్టి, దానిని ఒప్పుకొన్నాం కాబట్టి దానిని సవరించకూడదనేటటువంటి పిడివాదం లేదు. న్యాయమైనటువంటి, విషయాలలో సూచనలు ఏపక్షమునుంచివచ్చినాసరేవాటిని ఆలోచించి సక్రమంగాసరిదిద్ది అందరియొక్క శ్రేయస్సును ఆకాంక్షించే రైతులయొక్క శ్రేయస్సును కోరేవాండ్లము కాబట్టి పరిపాలన చేస్తామని చెబుతున్నాను. అందరుకూడా రైతులకు ఇబ్బంది లేకుండా, చేస్తే ఆ విషయాలలోను తోడ్పడవలెనని చెప్పి గౌరవనీయులైన సభ్యులందరిని కోరుతున్నాను. ఇప్పటినుంచి, ముఖ్యంగా, ఈమూడు సంవత్సరాల లోపల నీళ్లు రైతులు తీసుకొనడానికి ప్రోత్సహించవలెనని మరొకసారి కోరుతూ ఈ బిల్లును చట్టము చేయవలెనని ప్రార్థిస్తున్నాను.

SRI C. SUBBARAYUDU :—ఇంకొక మంత్రి గారు సెలవిస్తూ regis-tered ayacut కానటువంటి భూములకుకూడ నీరు పెట్టుకొంటున్నారు. అందు వల్ల అటువంటి చోటకూడ ఇది వసూలుచేయడానికి commandable area ను పెట్టడంలో అది ఉపయోగపడుతుందన్నారు.

MR. SPEAKER : Penalty will be levied if unauthorised use of water is made.

SRI C. SUBBARAYUDU :—I want to explain the difference between commandable area and the ayacut.

MR. SPEAKER . —మరొక ఉపన్యాసం చేయడానికి వీలులేదండి.

SRI C. SUBBARAYUDU :— మరొక ఉపన్యాసం చేయడం కాదండి.

MR. SPEAKER :—మెట్టప్రాంతమునుంచి రావడంచేత యీ చిక్కు వచ్చింది.

SRI C. SUBBARAYUDU :—అదికాదండి. ఇప్పుడు registered ఆయకట్టు, అంటే, కృష్ణా delta తీసుకోండి. Register ఆయకట్టుక్రింద అయిదారులక్షలు ఉండవచ్చును.

MR. SPEAKER : There is nothing like registered ayacut under this Act. In order to give incentive to people to make use of water, compulsory levy will be made on the lands in the commandable area. We have nothing to do with ayacut.

THE HON. SRI K. CHANDRAMOULI :—గట్టిగా దానిని నేను రూల్సులో తీసుకొని వస్తున్నానని చెప్పి చెప్పానండి. అది irrigable area అంటే అది ఏమిటి ? Permanent ayacut ఎంతవరకు ? అవిఅన్ని రూల్సులో తెచ్చినప్పుడు విచారించవచ్చును.

MR. SPEAKER : The question is :

"That the Andhra Irrigation Works (Levy of Compulsory Water-Cess) Act, 1955, be passed into law."

The motion was carried and the Bill was passed into law.

## (2) THE MADRAS DISTRICT BOARDS (AMENDMENT) Andhra Amendment Bill, 1955.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈ జీల్లా బోర్డుల చరిత్ర చాలా హాస్యాస్పదంగా తయారు అయింది. ఆంధ్ర రాష్ట్రం వస్తుందనే పేరుతోటి మద్రాసు ప్రభుత్వంలో ఉండగా, అప్పుడు దీనిని ఒక సంవత్సరంపాటు, పొడిగిస్తామన్నారు. దానిమీద తీవ్రమైన వాదోపవాదాలు జరిగినవి. చివరకు అర్ధ సంవత్సరం మాత్రం పొడిగించారు. మరి రాబోయే విశాలాంధ్ర రాష్ట్రం మళ్లీ కొన్నాళ్లు పొడుగిస్తుంది. వీటి గతి ఏమి అవుతుంది అంటే, రాజగోపాలచారిగారు ఆలోచించి, నాకు ఏమి అభ్యంతరంలేదు, ఈ వేళ రాష్ట్రం రాబోతున్న సమయంలో ఎలక్షను పెట్టడం కష్టము కనుక నేను ఆరు నెలలు మాత్రమే పొడిగిస్తానని చెప్పి, మీ రాష్ట్రములో మీరు ఎన్నికలు పెట్టుకోండి అని చెప్పారు. ఇప్పుడు వారి రాష్ట్రములో వారు జరుపుకొనడంకూడా జరిగింది. తరువాత మళ్లీ మన రాష్ట్రంలోకి వచ్చాము. మన రాష్ట్రములోకి వచ్చే టప్పటికల్లా, ఒక బిల్లు వచ్చేసింది. అప్పుడు ప్రభుత్వానికి ఒక పెద్ద అనుమానం వచ్చింది. ఏమంటే ఈ adult franchise ఉండడమా, లేదా, అది తీసివేస్తే సరిపోతుందేమో అనే అభిప్రాయంతోటి అప్పుడు ఒక బిల్లు, తెచ్చారు. అప్పుడు శ్రీ తిమ్మారెడ్డిగారు మంత్రిగా ఉన్నారు. వారు తీసుకొనివచ్చారు. దాంట్లో చెప్పింది ఏమిటంటే adult franchise ఉపయోగం లేదేమోఅని అభిప్రాయ పడవలసి వచ్చింది, గనుక ఈ బిల్లును మరొక విధంగా ఆలోచించాలి, ప్రస్తుతం దీనిని కొన్నాళ్ళపాటు postpone చేస్తున్నాము అని చెప్పారు.

"It is not possible to arrange for the reconstitution of the District Boards on the basis of universal adult suffrage", అని statement of objects and reasons లో ఉన్నది.

వారు యేమన్నా సెలవుఇచ్చారు. ఇది మొత్తంమీద కొన్నాళ్ళపాటు నెట్టారు. మళ్ళా చర్చలకువచ్చే సమయంలోనే ప్రభుత్వం పడిపోవడం, ఎలక్షనులు జరగడం, గవర్నరుగారు రాష్ట్రపతియొక్క ఆశీర్వచనములతో ముందుకు సాగడం సరిపోయింది. ఇపుడు తీరాచూస్తే ఈ బిల్లు మళ్ళీ తీసుకొనివచ్చారు. ఈ బిల్లులో ఏరూపంలో ఉంది అని ఆలోచిస్తామంటే వారు యీ దిగువచెప్పిన మూడు రకాలుగా ఆలోచించుకొన్నారట.

"(1) the District Boards be constituted by indirect elections from electoral colleges consisting of Presidents and Members of Panchayats ;

Sri Vavilala Gopalakrishnayya] [2nd December 1955

(2) the district boards be reconstituted by appointing the members of Legislative Assembly of respective districts as members of the district boards,

(3) direct elections be held on the basis of adult franchise." అని ఉన్నది.

ఈ మూడింట్లో మేము అభిప్రాయపడుతూ ఉన్నామని కాని, దీంట్లో direct elections జరిగితే చాలడబ్బు ఖర్చుఅవుతుందని అనుకొంటు ఉన్నామని చెప్పారు. పంచాయితీబోర్డులు ఇంకా ఏమి తయారుకాలేదన్నారు. మూడవ విషయంమాత్రం ఇంకా ఏమి తెచ్చుకోలేదన్నారు. ఇది ఇట్లు వుంటుండగా, మనమంత్రి నాగేశ్వరరావుగారు ఏపార్టీకి చెందారో ఆ ప్రజాపార్టీవారు ఈమధ్యనే సమావేశమైనారు. దానికి వారుకూడ హాజరుఅయ్యారు. వారు ఈవిధంగా తీర్మానంచేశారు.

"The district boards are superfluous either for co-ordination or for administrative division of responsibility. And therefore the Committee calls upon the Government to implement the decision already arrived at, to have no intermediary bodies between Panchayats and the Government, and therefore to abolish the district boards."

అని జిల్లాబోర్డులను రద్దుచేసేటటువంటి సూచనలు ఏమైనా వారు తీసుకొని వచ్చారు. జిల్లాబోర్డులను రద్దుచేయడం అనేది సరియైనదా అని ఆలోచిస్తే కాదని చెప్పి నేను మనవిచేయవలసి వస్తుంది. ఈవేళ ఉన్నటువంటి పరిపాలనా విధానం ఎట్లావుందో, దానిమీద Sri V. Venkatrao గారు ఒక special theorics తయారుచేశారు. ఆయన పెద్దపుస్తకం వ్రాశారు. దాంట్లో ఉన్నటువంటి ఇబ్బందులన్ని వ్రాసి చివరకు ఒకమాట చెప్పారు. ఆఖరుకు conclusion లో వారు చెప్పినమాట చదివితే జిల్లాబోర్డులు ఉండవలెనా అక్కడ లేదా అనేది తేలిపోతుంది. జిల్లాబోర్డులు ఉండితీరాలి అనేటటువంటి అభిప్రాయాన్నే వారు వెలిబుచ్చారు.

"But we think that if democracy is to survive as a living thing, it can only be by the vital functioning of strong local authorities, for they are the main sources for the perennial supply of trained men and women for the Provincial and Central Legislatures and Ministries. Without strong local Government, there can be no sound democratic Government for the progress of the Nation."

2nd December 1955] [Sri Valilala Gopalakrishnayya

అని చెప్పారు. అట్లాంటిది లేకపోతే, లాభంలేదన్నారు. ఐతే మంత్రిగారు అన్నది 1953 వ సంవత్సరంలోది. అందువల్ల తోసివేయవచ్చునని వారు ఆలోచిస్తున్నారు. బహుశః ఆ ప్రభుత్వాన్ని అడిగి ఉంటారనుకొంటాను. లేకుంటే మంచిదే. దానికి నేను ఇంకొక మనవిచేస్తున్నాను. ఈనాడు ప్రధానంగా ఉన్న పరిణామం అంతా కూడాను మనం ప్లానింగుమీద ఆధారపడి ఉన్నాం అని అనుకొంటున్నాము.

వారియొక్క Evaluation reportలో ప్లానింగు ఎట్లానడపడమనేది చెబుతూ పంచాయితీలను గురించికూడ వ్రాశారు. నేను ఆ సంగతి తరువాత చెబుతాను. Second year లో Plan ను గురించి చేయవలసిన కార్యక్రమము అంతా Evaluation report లో వారు వ్రాసినది చదువుకున్నాను. ఈ Evaluation report April 1955 Second year working అనే పుస్తకంలో 7 వ పేజీలో వేయబడినది కూడ నేను చదువుకున్నాను. "What the villagers up to the district board అని district board అవసరాన్ని వారు ఉదహరించారు. తరువాత అమృతకౌర్ గారి అధ్యక్షతక్రింద జరిగిన సమావేశంలో ఒక విధంగా చెప్పిఉన్నది. Planning work జరగాలనేట్లయితే State Government కును పంచాయతీలకును మధ్య విధిగా జిల్లాబోర్డులు ఉండితీరాలని.

"What the villagers cannot achieve for themselves by their own action can be achieved as far as possible through the action of the higher local bodies up to district boards."

అన్నారు. నెల, 15 రోజుల క్రింద ఒక నిర్ణయం హిందూ పేపరులో పడింది. అది బహుశా మీరుచూచి ఉంటారు. అంతేగాకుండా పంచాయతీ బోర్డులను గురించి కాంగ్రెసు Committee ఒక నిర్ణయం చేసింది. కట్జుగారు దానికి అధ్యక్షుడు. మంత్రులుకూడా దానిని సంబంధించిన సమావేశానికి వెళ్లారు. చివరకు మంత్రుల సమావేశం జరిగింది. ఆమంత్రుల సమావేశంలో రాష్ట్రపరిపాలన పంచాయతీలకు మధ్యగా జిల్లా బోర్డులు అన్నది ఒకటి ఉండి తీరాలి అనేటటువంటి అవసరం ఉంది. ఆ Elections ఏవిధంగా జరగడం అనే దాంట్లో రెండు అభిప్రాయాలు ఉన్నాయి. అందులో H. D. మాలవ్యగారు direct elections జరగాలని చెప్పారు. ఇతర మంత్రులంతా కూడా indirect elections పంచాయతీల ద్వారా తీసుకురావాలని చెప్పారు. అందువల్ల, జిల్లాబోర్డులు ఉండడమాకూడదా? అనేదానిమీద ప్రజాపార్టీ వారు చెప్పినదానిని అంగీకరించడానికి వీలులేదని, ఇక్కడ మంత్రిగారు ప్రజాపార్టీ నిర్వచనపై తనకు బాధ్యతలేదని ఐక్యకాంగ్రెస్ ఫ్రెంటు నిర్ణయాన్నే అనుసరిస్తానని అన్నారు. ఆపరాలుల్ పాలె దయచేసి ఆ అభిప్రాయంవారు లేదనేట్లయితే చాలా

Sri Vavilala Gopalakrishnayya] [2nd December 1955

సంతోషం. ఆ అభిప్రాయం అసలు లోపలనే పెట్టుకోకుండా ఉండమని కోరుతున్నాను. అటుతరువాత ఇవ్వాళ ఉన్నటువంటి పరిణామములో పంచాయతీ బోర్డు మేమే ఏర్పరుస్తామన్నారు. నిజమే. Indian Constitution లో directive principle లో పంచాయతీలు ఉన్నాయి. మీరు ఏర్పరచే పంచాయతీబోర్డులు బొంబాయి గవర్నమెంటు తయారుచేసినటువంటి గ్రామపంచాయతీ విధానంమీద మీరు తయారు చెయబోతున్నారాఅంటే అట్లాంటిదేమీలేదు అని అంటున్నారు. జిల్లాబోర్డులు తీసివేయాలనే అభిప్రాయం లేకపోగా

"In order to implement the directive pinciples of Article 42 of the Constitution, the Government have decided to establish village panchayats for each and every village of the State within a period of three years." అని చెప్పారు.

మీరు పెట్టబోయేటటువంటి పంచాయితీ బోర్డులకు ఒక ప్రాతిపదిక ఉండగలందులకై, జిల్లా బోర్డులు ఉండితీరాలి. వాళ్లకు వేసేటటువంటి అధికార్లందరిని కూడా తయారుచేయడానికి ఉద్దేశించి జిల్లా బోర్డు ఉండాలని చెప్పి జిల్లా బోర్డుకు ఎక్కువ powers ఏమైనావారు ఇస్తున్నారనేది ఉదాహరణకు తీసుకురావడానికి నేను బొంబై పంచాయితీ బోర్డులు ఉదహరించాను. ఇవ్వాళ ఉన్నటువంటి పరిణామాలలో పంచాయతీ బోర్డులు, జిల్లా బోర్డులు తీసివేయడం అన్నది చాలా అన్యాయం. మళ్లీ కొన్నాళ్లపాటు ఇది తేలదు గనుక Special officers ను వేస్తాము అన్నారు. ఇప్పటికీ తేలలేదు గనుక postpone చేస్తునే ఉన్నాం అన్నారు. ఇది ఎప్పటికి తేలుతుందో తెలియదు. తేలినప్పుడల్లా postpone చెయ్యడమేనా, లేక మరొక మార్గం ఏమైనా ఉన్నదా అని అడుగుతున్నాను. Legislative Assembly Members District Boards పునర్నిర్మాణం చెయాలని చెపుతూఉన్నారు. అంతేగాదు. Direct Elections పెట్టాలని Provincial Congress Committee తీర్మానం చేసినది. దానిమీద ఏమీ తెచ్చుకోకుండా ఉన్నారు. Direct Elections అయితే డబ్బు ఎక్కువఖర్చు అవుతుంది గనుక postpone చేస్తారేమో మాకు అర్థంకావడం లేదు. ఎందుకంటే Democracy ఎప్పుడు ఖరీదుఅయిందో ఇంగ్లీషుపార్లమెంటు monarchy కిని బలపరిచినవారికి అమెరికన్ Democracy ని బలపంచెవారికి చిన్న వివాదం వచ్చింది. మీరు Democracyలో Monarchyని పెట్టుకొన్నారు. అదేమి లాభంలేదు. దానికి చాలాఖర్చు అవుతున్నది అన్నారు. రెండో అతను మీ Democracy పైన President election Directగా పెట్టుకొన్నారు; అందువలన మీ President election కు అయ్యే డబ్బు 3 సంవత్సరాల కొకసారి లెక్కచూచు

కొంటే దాంట్లో 10 వ వంతుకూడా మా రాజాగారికి కిరీటాన్ని అమలు జరపడానికి అయ్యేఖర్చుకే చాలదని అన్నారు. కాని అందువల్ల రాజాగారిని అక్కడ పెట్టుకుంటూరా పెట్టుకోరు. అందువల్ల democracy ఎప్పుడుకూడా ఖరీదైనవస్తువు. అది ఎక్కువమంది దగ్గరికిపోవడం జరుగుతుంది. ప్రజలందరుకూడా ఓటు చెయ్యడం జరుగుతుంది అందువల్ల ఇవ్వాళ Assembly elections ఖరీదు అని మానుకోంటాము. Parliament elections ఖరీదుఅని చెప్పి మానుకోంటాము. అందువల్ల democracy ఎప్పుడు costly యే గనుక అది జరిగితీరాల్సిన అవసరం ఉంది గనుక దానికి ఖర్చు ఎంత అవుతుంది అనే అంచనాలతో సంబంధం లేకుండా Election జరపాల్సిన అవసరం ఉందని చెప్తున్నాను. రెండవది దీన్ని అమలు జరపాలనేట్లయితే జిల్లాబోర్డులకని మరేది సాధ్యంకాదు. తరువాత పంచాయితీబోర్డు మెంబర్లను దీనిలోనికి తీసుకొస్తామనిచెప్పి పంచాయతీబోర్డు indirect elections ఏందుకు తీసుకురావాలి ? పంచాయతీబోర్డుకు ఉన్నటువంటి హక్కులనుకూడా మీరు తీసివేయబోతున్నారు. ఈ రోజున ఇంకో బిల్లు రాబోతున్నది. దానికొచ్చే ఆదాయాన్ని తగ్గించబోతున్నారు. మీరు పంచాయితీబోర్డు ప్రెసిడెంటుకు ఇదివరకు ఉన్న direct elections తీసివేసి ఇప్పుడు indirect elections తీసుకురావాలని ఆలోచనచేస్తున్నారు. ఇటువంటి పరిస్థితులలో పంచాయితీబోర్డుల విషయం ఏమౌతుందా అనేది ఆలోచించకుండా జిల్లాబోర్డులకు direct elections పెట్టకుండా postpone చేయుట చాలా అన్యాయమైన విషయం. కాబట్టి జిల్లా బోర్డులకు వెంటనే election పెట్టాలని కోరుతూ ఈ బిల్లును ప్రతిఘటిస్తున్నాను.

MR. SPEAKER :— ఈ విషయమై ఇప్పటికి చర్చ షుమారు 2½ గంటలు, 3 గంటలువరకు జరిగింది. ఇంక 1½ గంటలోపల ఈ తీర్మానాన్నిగూర్చి చర్చ పూర్తికావలసిఉన్నది. కాబట్టి సభ్యులకు ఒక్కొక్కరికి 5 నిమిషాలకన్న ఎక్కువ ఉండజాలదు.

SRI B. RAMA REDDI :—అధ్యక్షా, జిల్లాబోర్డు ఎన్నికలు పరోక్షటపు ఎన్నికలద్వారా జరపడంఅనేది సరియైనదిలేదని నేను అభిప్రాయపడుతున్నాను. దీనికి కారణం ఏమిటిఅని చెప్పేదానికి ముందు పంచాయతీబోర్డు ఎన్నికలలో సాధారణంగా జరిగేపద్ధతినిచూస్తే అక్కడ ఎక్కువ విస్తారమైన ప్రదేశంకాదు. కాబట్టి అక్కడ అధికార ప్రాబల్యం ఉన్నవారే ఎన్నుకోబడుతూ ఉంటారు. అటువంటి సందర్భం పంచాయతీబోర్డుమెంబర్లకూడి జిల్లాబోర్డు సభ్యులను ఎన్నుకోవాలంటే సంఖ్య కొద్దిగా ఉంటుంది. కాబట్టి అటువంటిదానిలో ఖర్చుచేసుకొని జిల్లాబోర్డుమెంబర్లుగా ఎన్నిక కావడానికి ధనికవర్గానికి సాధారణంగా సాధ్యమౌ

తుంది. అందువల్ల ప్రజాప్రతినిధులు అనిపించుకోదగినవారు ధనికవర్గానికి చెందని వారు ఈ జిల్లాబోర్డు సభ్యులుగా ఎన్నికకావడానికి అవకాశం ఉండదని. నా అభిప్రాయం కాబట్టి ప్రజాస్వామ్యపద్ధతిని జిల్లాబోర్డు ఎన్నికలు జరిపించాలి అనుకొన్నప్పుడు ప్రజలకు ఓటింగ్‌కు అధికారం ఇచ్చినప్పుడు ప్రజాప్రతినిధులను ప్రజాబాహుళ్యంచేత ఎన్నుకుంటే సరియైన పద్ధతిగాని ఈ పరోక్షపు ఎన్నికలు పద్ధతి దాదాపు ఈ వయోజన ఓటింగ్ ఉన్న వారిద్వారా కాకుండా ఒకవిధంగా కొంచెము కించిత పరచడం న్యాయమైనదికాదని నాఅభిప్రాయం. కించిత University వగైరాలకు పరోక్షపు ఎన్నికలు జరుగుతూ ఉంటాయి. University కి ఎన్నికలుజరిగే సందర్భంలో ఆ ఎన్నికలు కేవలం విద్యావ్యాపకము ఉన్న పెద్దల వల్ల జరిగేదికాబట్టి వారిలో ఈ అధికారప్రాబల్యము ఒత్తిడి అనేది అంతగా కనబడదు. అంతేగాకుండా ఈ జిల్లాబోర్డు ఎన్నికలగురించి అనేకమంది అనేక అభిప్రాయాలు చెపుతున్నారు. కొంతమంది సభ్యులు పరోక్షపు ఎన్నికలు కూడదనేది ప్రజాభిప్రాయం అన్నారు. జిల్లాబోర్డులను రద్దుచేయాలనేదికూడా ప్రజాభిప్రాయంఅన్నారు. ఈ విషయం ప్రజాభిప్రాయపు నిర్వచనాన్నిగురించి నాకు సందేహం ఆశ్చర్యం కలుగుతుంది. ప్రతి సభ్యుడు చెప్పేటప్పుడు తాను చెప్పినదే ప్రజాభిప్రాయమని చెబుతున్నారు. దానికి ప్రత్యక్ష విరుద్ధంగా మరొకసభ్యుడు చెపుతూ ఇదిప్రజాభిప్రాయం అంటున్నాడు. సభ్యులు ఈవిధంగా అనేకరకాలుగా చెప్పడంవల్ల ప్రజలు తమయొక్క స్వంత అభిప్రాయము చెప్పడానికి ఏమైనా మిగిల్చినారో అనే అనుమానం వెలిబుచ్చుతున్నారు. ఏ సభ్యులుకూడా ప్రజలను అడిగి చెప్పినటువంటి అభిప్రాయాలుకాదు. తానుప్రజలతరపున ఎన్నికైన కారణమున ప్రజలు ఇదే చెబుతున్నారని ఇదే ప్రజాభిప్రాయమని ఇక్కడసభలో చెబుతున్నారు. తన అభిప్రాయమే ప్రజాభిప్రాయంగామార్చి చెబుతున్నారు. ఇది ఒక విచిత్రమైన విషయంగా ఉన్నది. కాబట్టి జిల్లాబోర్డులను పరోక్షపు ఎన్నికలు ద్వారా జరిపే దానికి బదులు వయోజన ఓటింగ్ హక్కు ప్రజలకుఉన్నది కాబట్టి వయోజన ఓటింగుద్వారానే జిల్లాబోర్డులు జరపాలని నా అభిప్రాయం. అవికూడా లేకుండా ఈ జిల్లాబోర్డు పరిపాలన అధికార్ల చేతులలో ఉంచటం ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు విరుద్ధంగా ఉన్నది. ఇంతకుముందు గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు ప్రభుత్వం జిల్లాబోర్డు ఎన్నికలవల్ల డబ్బుఖర్చు అవుతుందని ఆలోచించినట్లయితే, ఖర్చు ఎప్పటికీ తప్పదు. డబ్బుఖర్చు, డబ్బునష్టం అని మద్యపాన నిషేధం పవిత్రమైన దానిని మనం మానుకోలేదు. కనుక ప్రభుత్వం ఒక విశిష్టతకలిగిన పనిని తలపెట్టినపుడు ధనవ్యయం అనేది అంతసబబైనదని నా అభిప్రాయం.

2nd December 1955] [Sri B. Rama Reddi

ఇక, ఎంతత్వరగా మనము జిల్లాబోర్డులను నిర్మించగలిగితే, అంతత్వరగా ప్రజల మన్నలను పొందగలుగుతాము అని నేను చెప్పుచున్నాను. ఇది ప్రజాభిప్రాయమని నేనుచెప్పే హక్కు లేదనుకోండి. అంతేకాకుండా ఈ జిల్లాబోర్డుల అధికారాలు దుర్వ్యయపచారు. ఆ అధికారాలను సక్రమంగా వినియోగపరచలేదు అనే అభిప్రాయముతో పైన సెక్రటరీలు మరికొంతమంది ఇతరులను ఏర్పాటుచేసి వారి యొక్క అధికారాలను సంకుచిత పరచారు అన్నపుడు మన నాయకులకే, మన సహోదరులకే ఒకఅధికారము చేతికిచ్చి, వారిని అనుమానిస్తున్నట్లు వారిని వేరుపరచినట్లు అవుతుంది కాని మరేమికాదు. ఈనాడు మంత్రులు ఉన్నారు. శాసన సభ్యులు ఉన్నారు. వీరందరు ఏదోఒక విధంగా ఏదోఒక పొరబాటు చేసేవారుగానేఉండి ఉంటారు. అందుకని మంత్రివర్యులకు ఇచ్చినటువంటి అధికారాలను సంకుచిత పరుస్తారు. అదేవిధముగా ఒక magistrate ఇచ్చిన judgement లో ఏదోఒక లోపముంటే, అంతమాత్రాన అతని అధికారాన్ని తగ్గిస్తారా? లేదు అది చక్కపరచవలసి యుంటుంది మాత్రమే. కనుక ఎవరో ఏదో చేసినారనే భావముతో ఉన్నటువంటి అధికారాన్ని సంకుచితపరచడం భావ్యంకాదు. అంతే కాకుండా జిల్లాబోర్డుల అధికారాలు చాలా సంకుచితపరచినారు. ప్రథమంగా విద్యావిధానంలో ద్వంద్వపరిపాలనా, మరి అనేక విధాలుగా వేరుచేశారు. District Board పరిపాలనలో ఏమి బాగా చేయలేదని Engineering department ను వేరేచేశారు. ఇదంతాచూస్తే, పూర్వము జిల్లాబోర్డుల అధ్యక్షుల పరిపాలనలోనే రోడ్లు చాలా బాగుండినవని నేను అభిప్రాయపడుతున్నాను. అంతేగాకుండా ప్రజాస్వామ్య పద్ధతిలో పై అధికారాలకు పంపించడానికి, ఈ జిల్లాబోర్డులు ఒక శిక్షణకేంద్రముగా ఉండగలవు. ఇక్కడ శిక్షణ, అనుభవము పొందినతరువాత, మంత్రివర్యులు గాను, శాసనసభ్యులుగాను పోవడానికి చాలా అనుకూలంగా ఉంటుందని, కనుక ఈ జిల్లాబోర్డులను ఒక శిక్షణకేంద్రంగా పెట్టవలెనని ఒకప్పుడు పెద్దలు చెప్పినారు కదా! అటువంటప్పుడు ఈ శిక్షణకేంద్రాలను సర్వాధికార సమన్వితంగానే ఉంచితేనే బాగుంటుంది. కనుక ఈ జిల్లాబోర్డుల అధికాలు సంకుచితపరచి, వారిని అడపాదడపా అవమానపరుస్తూ, వారికి శ్రద్ధాసక్తులు లేకుండా చేసేదానికంటే, జిల్లాబోర్డులను రూపములు లేకుండా తీసివేసి పంచాయితీ బోర్డులకు సర్వాధికారములు యివ్వడం మంచిది. ఒకవేళ జిల్లాబోర్డులను పెట్టదలచుకొంటే, వాటికి సర్వాధికారాలు ఇచ్చి, ఈ పరోక్షపు ఎన్నికలు గాకుండా, సక్రమమైన పద్ధతులలో పరిపాలనా నిర్వహణ చేసేవారిని ప్రజాబాహుళ్యము ఎన్నుకొనేటట్లుచేసి, వీటిని నిజమైన శిక్షణ కేంద్రములుగాచేస్తే బాగుంటుందని ప్రభుత్వమునకు సూచిస్తూ ఈ అవకాశ మిచ్చినందులకు అధ్యక్షులవారికి నావందనము లర్పిస్తున్నాను.

[2nd December 1955

SRI RAJA SAGI SURYANARAYANA RAJU :—ఉపాధ్యక్షా, ఈ జిల్లాబోర్డులు ఒకసంవత్సరము మరల వాయిదావేయడంకోసం మన మంత్రివర్గం ప్రతిపాదించిన బిల్లును నేను బలపరుస్తూ కొన్నిసలహాలు చేయదలచుకొన్నాను. గోపాలక్రిష్ణయ్యగారు మాట్లాడుతూ democracy లో elections అంటేనే ఎక్కువఖర్చు అవుతుంది గనుక మనము ఖర్చుకు భయపడకూడదని చెప్పారు. నిజంగా అది అందరు అంగీకరించవలసినదే. కాని అమెరికాతో ఉపమానంతెచ్చి, రష్యాతోటి ఉపమానంతెచ్చి, ఇంగ్లాండుతోటి ఉపమానంతెచ్చి, ఇప్పుడు మనము కూడా ప్రజాభిప్రాయమేననీ, ఆ విధంగానే ప్రవర్తిస్తామనే దాంట్లో అర్థమేమిలేదు. ఎందుచేతనంటే, వారు ఎన్నో కోటానుకోట్లు నిలువతోటి ఉన్నవారు. మనమంటె, ఇతర దేశములమీద ఆధారపడి, కోట్లకొలది అప్పులతోవుంటూ, మన దేశాభివృద్ధి చేసుకోవడంకోసం ప్రథమావస్థలో ఉన్నవాళ్ళము. అందుచేత ఆ ఉపమానం సరియైనదికాదని మనవిచేస్తున్నాను. ఇప్పుడు మనం ఖర్చులు పెట్టుకోవలసిన అవసరం లేనప్పటికిని, ఖర్చుపెట్టవలసిందనే అభిప్రాయము చాలా ప్రమాద పరిస్థితిలోకి దేశాన్ని తీసుకువస్తుందని మనవిచేస్తున్నాను. తరువాత రామిరెడ్డిగారు చెప్పిన కొన్ని విషయాలలో నేను ఏకీభవిస్తాను. కొన్ని విషయాలతో ఏకీభవించలేను. ఎందుచేతనంటె, ఈ జిల్లాబోర్డులకు వెంటనే పరోక్షంగా ఎన్నికలు పనికిరావు అని అంటున్నారు. కాని యిప్పుడు మనకు ధనలోపము వున్నందువలన పరోక్షపు టెన్నికలే చాలా అవసరమని అనుకొంటున్నాను. ఇక్కడ పరోక్షపు టెన్నికలంటేగూడ ప్రజాస్వామ్యంకాదు అనుకోనక్కరలేదు. పంచాయితీ బోర్డులుకూడ, ప్రజలచేత ఎన్నుకోబడినటువంటివే పంచాయితీబోర్డు సభ్యులచేత జిల్లాబోర్డు ఎన్నికలు జరిపితే, డబ్బుయిచ్చి వోట్లు పుచ్చుకొంటారు, ఎక్కువ ధనవంతులకే అవకాశం వుంటుంది అని అంటారు. దానితో నేను ఏకీభవించను. ఎందుచేతనంటె, ఆ విధంగా చూచినట్లయితే, పంచాయితీ ఎన్నికలలోగూడ ప్రజలుడబ్బు పుచ్చుకొని, లంచాలు పుచ్చుకొని ఎన్నుకోనేందుకు అవకాశమున్నదని చెప్పవచ్చు. అది చాలా అన్యాయము. కనుక ఆవిధంగా అనుకోకూడదు. ఎందుచేతనంటే, కొద్దిరోజులకైన మంచి స్థిరత్వమైనటువంటి ప్రజలు మంచివారిని ఎన్నుకోవడానికి అవకాశమువస్తుంది. ప్రస్తుతము జిల్లాబోర్డులు, మూడు సంవత్సరములనుంచి అప్పులతో ఉంటున్నాయి. ఇంకాయీ అప్పులు తీరకుండా ఉన్నాయి. అందుచేత వాటికి కొంతఖర్చుతగ్గించి వాటిని మంచిస్థితిలోకి తీసుకురావలసిన అవసరం చాలాఉన్నది. కనుక ఎన్నికల గురించి కొంతమంది సభ్యులు ఆవిధంగా విమర్శించడం అన్యాయమని మనవిచేస్తున్నాను. నేనుకూడా ముఖ్యంగా ఎన్నికలు కావాలని అన్నవాడినే, మాపార్టీ

2nd December 1955] [Sri Raja Sagi Suryanarayana Raju

మీటింగులో కూడ, ఈ ఎన్నికలు జరిగేవరకు, శాసనసభ్యులే వ్యవహరిస్తే బాగుంటుందని చెప్పాను. ఎందుచేతనంటే, ఎలెక్షను కాని పంచాయితీలలో nomination పెట్టి, nomination members ద్వారా elect చేస్తామంటే, దానికి అయిష్టపడి, మామూలు పంచాయితీ బోర్డులు తయారయ్యేవరకు ఈ సంవత్సరం M. L. A. లే పరిపాలించవలసిందని నేనుకూడ ఓటుచేసినవాడినే private గా. అంతే కాకుండా, ఇప్పుడు వచ్చే అక్టోబరులో విశాలాంధ్ర వచ్చేస్తుంది గనుక ఈలోపల elections, మరల elections అంటే చాలా అలజడి జరుగుతుంది. ఈ అలజడి కలిగినప్పుడే ఒకరికొకరికి విరోధాలు ఎక్కువ అయిపోవడం జరుగుతుంది. తక్కువ మెజారిటీలో ఉన్న సభ్యులు, మరల elections వస్తే ఎక్కువవుతుంది తమపార్టీ వారు రావచ్చుననే ఆశతో ఆవిధంగా చెప్పుచుండవచ్చును. కాని ఒకతూరి ప్రాయశ్చిత్తము అయినప్పటికి, వారికి కొంచెముగూడ ఆలోచనలేకుండా తిరిగి ఎన్నికలు పెడితే వస్తామని ఎన్నికలు పెట్టాలని అనడంలో ఏమాత్రం అర్థంలేదు. అందుచేత తామందరు దీన్ని ఆలోచించి, ప్రస్తుతం ఈ సంవత్సరం special officer లేకపోతే Advisory Board అని, నలుగురైదుగురు ప్రముఖులైన పెద్దలను ఏర్పాటుచేసి వారుపాలిస్తే బాగుంటుందని మనవిచేస్తూ సెలవు తీసుకుంటున్నాను.

SRI G. JAGANNADHA RAJU :—ఉపాధ్యక్షా, District Board Act లో ఒక provision ఉన్నది. దాని ప్రకారం, District Board members అందరు elect అయినతరువాత, 21 రోజులు కలెక్టరు in-charge లో ఉండవలసిందనిన్ని, ప్రసిడెంటు election కోసం నోటీసు పంపించవలసిందనిన్ని, ఎవరు president గా elect అయితే, వారికి ఆ charge అప్పజెప్పవలసిందనిన్ని, ఉన్నది. మొట్టమొదట District Boards కొత్తగా వచ్చినప్పుడు, మేము District Board Presidents గా ఉండేటప్పుడు, మేము Treasury Benches లో ఉండేవాళ్ళము. ఇప్పుడు Treasury Benches లో ఉన్నవాళ్లు అప్పుడు opposition లో ఉండేవాళ్లు. అప్పుడు ఈ 21 రోజులు time ఇవ్వాలనే provision వచ్చినప్పుడు, ఇది చాలా అసందిగ్ధమని, ఇన్నిరోజులు జిల్లాబోర్డులు official hands లో ఉండవలెనా అని బల్లలు గుద్దుతూ, కుర్చీలు గుద్దుతూ కేకలు వేసి నానా అల్లరిచేశారు మమ్ములను.

THE HON. Sri A. B. NAGESWARA RAO :—మీరు Justice Party కి చెందినవారాఅండీ ?

SRI G. JAGANNADHA RAJU :—With pride I am saying that I belonged to the Justice Party. ఇప్పటి పరిస్థితులను చూస్తే మేము లజ్జపడవలసినటువంటి అవసరంలేదు నేటికి 4 సంవత్సరముల నుంచి, non-official hands లో ఉండవలసింది official hands లో పెట్టి ఊరుకొనడమనేది నిజంగా లజ్జపడవలసినటువంటి విషయము. నేను last time నా Budget speech లోనే ఈ అంశాన్ని స్పష్టంగా చెప్పాను. మీరు వెంటనే conclusionకు రాలేదు. Direct elections పెట్టవలెనా indirect elections పెట్టవలెనా అని నిర్ణయానికి రావడంలో time తీసుకొంటారు. డిసెంబరు 10 వ తేదీకి మీరు సిద్ధంగాలేము అని చెప్పాను. అందుచేత, మీకింకా 5 సంవత్సరములు time ఉన్నది. ఇప్పుడు విశాలాంధ్రవస్తే మరి రెండుసంవత్సరములు కలిసివస్తుందని అనుకొంటున్నాను. అంతేగాక అందరు మీపార్టీవారే ఉన్నారు. కొబట్టి ఇప్పటినుంచికూడ ప్రయత్నంచేసి, ఆలోచించి, ఏదో ఒక conclusion కు రావచ్చును. ఇప్పుడు మీరు ఏమిచేసినా, యింకా 5 సంవత్సరములు ఉంటారు కొబట్టి, మరల మీయిష్టంవచ్చినప్పుడు ఒకబిల్లు తీసుకువచ్చి మరల election పెట్టవచ్చును. మీకు absolute power ఉన్నది. గనుక బాగా ఆలోచించి చేయవలసిందని కోరుతున్నాను.

మరొక విషయము వున్నది. నేను ఆ అంశమును గురించి చాలా కాలము అంటే, యీ జిల్లా బోర్డుల కాలపరిమితిని గురించి నాకు జ్ఞాపకము లేక నిద్రపోయాను. తరువాత యింకా just two months time వున్నది అనగానే నాకు యి జిల్లా బోర్డుల time దగ్గరకు వచ్చిందని జ్ఞాపకము వచ్చింది. అప్పుడు నేను ఆ హంశమును గురించి వెంటనే పార్టీమీటింగులో పెట్టి, discuss చేయాలని చెప్పినట్లుగా నాకు జ్ఞాపకము, అయితే అప్పుడువున్న పార్టీలో ginger party గూడ ఒకటి వున్నది. అందులో అందరూగూడ unanimous గా లేరు. ఇక్కడ M.L.A. గా వుంటున్న సూర్యనారాయణరాజుగారుకూడ అందులో వున్నారు.

SRI RAJA SAGI SURYANARAYANA RAJU :—Point of information, Sir, జగన్నాధరాజుగారు పూర్వము Justice Party లో వున్నప్పుడు కొన్ని విధాలుగా జిల్లా బోర్డు వ్యవహారాలు జరిపించానని చెబుతున్నారు. ఆ కారణముచేతనే గదా యీనాడు ఆ Justice Party లేకుండా పోయింది ? ఆనాడు Justice Party లో వున్నవారు కాంగ్రెసుకు వ్యతిరేకముగా బల్లలు ఎక్కి కాంగ్రెసును అలరిలేపబట్టిగదా, ఆ పార్టీ యీనాడు తుడుచుకొని పోయింది ?

2nd December 1955]

SRI G. JAGANNADHA RAJU:—అది వేరే వ్యవహారము. Justice Party యిప్పుడు లేకపోవటానికి అనేక కారణము లుండవచ్చు. మా అంతట మేమే విరమించుకొని వుండవచ్చును. కాబట్టి ఆ వ్యవహారము ఆవిధంగా జరిగింది. ఇప్పుడు అప్పటి పార్టీ వ్యవహారాలను గురించి ఎక్కువగా మాట్లాడడము మంచిది కాదు. అప్పటి Justice Party లో బొబ్బిలి రాజాగారు, కృష్ణంరాజు బహదూర్ వారు, యిప్పుడు మాట్లాడే సాగి సూర్యనారాయణరాజుగారు, వీరు అందరు అప్పుడునూ మా పార్టీలో వున్నవారే. అప్పుడు మా పార్టీలో మొట్ట మొదట యీ question పెట్టారు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఏప్పుడో వున్న పార్టీల విషయము, పాతకాలపు సంగతులు అన్నీ యిప్పుడు యీ సభలో జగన్నాధరాజుగారు మాట్లాడుతున్నారు. అవి అన్నీ జరిగిపోయి సుమారు ఇరవై సంవత్సరాలకు పైగా అయివుంటుంది సరే. ఇప్పుడు సాగి సూర్యనారాయణ రాజుగారు వున్నది ఏపార్టీ అని ? అది తెలియలేదు మాకు.

SRI G. JAGANNADHA RAJU :—ఇప్పుడు వీరువున్నది కాంగ్రెసు పార్టీ.

THE HON. SRI N. SANJEEVA REDDI :—అయితే, అది ఎప్పుడు సృష్టి అయినదో అదికూడ చెప్పండి. మా పార్టీలో జరిగే సంగతులు చెప్పేది ఎందుకు ? మీ పార్టీలో ఏమి జరుగుతున్నది ? మీరు ఎప్పుడు మారినారు ? మరల ఎప్పుడు elect అయినారు ? మరల యిప్పుడు ఏపార్టీలోకి మారినారు ?

SRI G. JAGANNADHA RAJU :—చెబుతాను గాని అది యిప్పుడు question కాదు. అది యిప్పుడు ఎట్లా వచ్చిందో, దాన్ని గురించి అడగడం, నేను చెప్పడం సబబుకాదు. కాని, మాలో మేము అప్పుడూ ఒకేవిధంగా మాట్లాడు కుంటూ ఉన్నాము, యిప్పుడూ అదేవిధంగా మాట్లాడు కుంటున్నాము. మొన్నను అదేవిధంగా మాట్లాడుకున్నాము. అందుకా భేధముఏమీలేదు. కాని పార్టీ విషయాలలో మాత్రం అంతా ఒకే మాదిరిగా జరగాలని మా అభిప్రాయము.

వాసుదేవన్ కమిటీవారు మాస్టర్లకు జీతాలు, కంట్రాక్టర్లకు డబ్బు యివ్వటానికి జిల్లా బోర్డులకు డబ్బులేదు అని వ్రాశారని మంత్రిగారు సెలవిచ్చారు. ఒకానొకప్పుడు ఏదో ఒక పనికిగాను ఖర్చుచేయమని ప్రభుత్వం ఒక వెయ్యి

Sri G. Jagannadha Raju] [2nd December 1955

రూపాయలు యిస్తే, అది ఆవిధంగా ఖర్చుపెట్టక, మరొకపనికి ఖర్చుచేశారు. ఈవిధంగా జరిగితే దీని అర్థము యేమిటి ? ఇంగ్లీషులో చెప్పేటట్లు అయితే "utter insolvency" అని అంటారు. గనుక జిల్లా బోర్డులోని ఆర్థిక పరిస్థితి యీ విధంగా వుంటున్నప్పుడు ప్రభుత్వంవారు వెంటనే steps తీసుకుని. జిల్లాబోర్డుల ఆర్థిక పరిస్థితిని బాగు చేయాలి అని అంటాను. ఏదో కొంతమంది కాంగ్రెసు పక్షమువారు, కొంతమంది opposition వైపువారు, యీవిధమైన బిల్లు తెస్తే, యిందులో ఏదో motive వున్నదనిన్నీ, అందుకే యీ జిల్లా బోర్డులకు ఎన్నికలు జరపకుండా కాల పరిమితి పొడిగించటానికి చూస్తున్నారు, అని చెప్పారు. కాని యిందులో motive వున్నది అని నేను మాత్రం చెప్పను. ఇందులో ఏమి motive వుంటుంది ? నిజంగా యిప్పుడు ఎన్నికలు జరిపితే, ఎట్లానైనా కాంగ్రెసు పార్టీయే గెలుస్తుంది. కాంగ్రెసు పార్టీయే అధికారములోకి వస్తుంది. కాబట్టి యిప్పుడు District Boards కు elections జరిపితే కాంగ్రెసు పార్టీవారే గెలుస్తారు. కాబట్టి నేనుకూడ యిందులో ఏదో motive వుంది అని చెప్పను గాని, ఒక్క విషయము మాత్రము చెప్పదలచాను. ఈవిధంగా జిల్లా బోర్డుల కాల పరిమాణము పొడిగిస్తూ పోవటానికి కారణము ప్రభుత్వంయొక్క incapacity యేనని అంటాను. అంటే చేతకాని తనం అని. ఇప్పటికి మూడు సంవత్సరాలుగా యీ జిల్లా బోర్డులకు ఎన్నికలు జరపకుండా time పొడిగిస్తూ వస్తున్నారు. మరల యింకొక సంవత్సరము పొడిగించటానికి యిప్పుడు యీబిల్లును తీసుకుని రాకపోతే, యీ విధంగా చేయడము అంటే యిందులో వున్న అర్థం ఏమిటి ? ఈమూడు సంవత్సరాలనుంచి నాగేశ్వరరావుగారు లేరే. ఇప్పుడు వారు యీబిల్లును తెచ్చారంటే, వారికి motives attribute చేయడంలో అర్థములేదు. ఇంకెవరెవరో వున్నారుగాని ప్రభుత్వంలో నాగేశ్వరరావుగారులేరు. ఎవరెవరో కాంగ్రెసువారు, అతిరధులు, మహారధులు, యోధానయోధులు cabinet లో వుంటూవచ్చారు. కాబట్టి యిప్పుడు cabinet లో వున్నవారందరు కలిసియోచించి జిల్లా బోర్డులకు వెంటనే ఎన్నికలు జరపటానికి ఒక సమగ్రమైన బిల్లును తీసుకొనిరావటము చాలా అవసరం అని అంటాను. ఒకవేళ యిప్పుడు cabinetలో వున్న మంత్రులకు అటువంటి బిల్లును తీసుకుని రావటానికి శక్తిలేకపోతే, దాన్ని పరిశీలించి చెప్పటానికి ఎవరైనా ఒక కమిటీని వేయండి. అందులో కాంగ్రెసు పార్టీ ప్రభుత్వపక్షమువారే majority సభ్యులుగా వుండేటట్లుగానే వేయండి. దీనికి అభ్యంతరము యేమీ లేదు. ఆవిధంగా చేస్తే బాగుంటుందని నా అభిప్రాయము. ఇంతే నేను చెప్పదలచింది. కాబట్టి ఆవిధంగా చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

2nd December 1955]

SRI M. NAGI REDDI :—అధ్యక్షా, జిల్లాబోర్డులు ఎన్నికలు ఎప్పటికప్పుడు ఏదో ఒక కారణము చూపించి ప్రభుత్వం పొడిగించడమనేది మనము చూస్తున్నాము. ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో వుండగానే పొడిగించడము మొదలు పెట్టారు. అక్కడినుంచి మనము విడిపోయినతరువాత ఆ రాష్ట్రములో జిల్లాబోర్డు ఎన్నికలు జరిపారు. జిల్లాలోని ప్రజాప్రతినిధులు అధికారములోనికి రావడం జరిగింది. అయితే యిక్కడ మన రాష్ట్రములోని జిల్లాబోర్డులకు ఎన్నికలు జరపకుండా ఎప్పటికప్పుడు ఏదో ఒకవైపున Betteiment levy వేయాలంటూనో, మరొకవైపున ప్రభుత్వానికి డబ్బులేదంటూనో చెబుతూ యీ జిల్లాబోర్డుల కాలపరిమితి పొడిగిస్తూ వస్తున్నారు. లేకపోతే మద్రాసు రాష్ట్రములో ఎన్నికలు జరిపారు గనుక వారి అనుభవాలు ఏ విధంగావున్నవో పరిశీలించుకొని అప్పుడు ఆలోస్తామని చెప్పడమో, లేకపోతే మద్రాసు రాష్ట్రము బోర్డుల పరిపాలనానుభవాలనుబట్టి యిప్పుడు మనము ఎన్నికలు జరిపేస్థితిలో లేమని చెప్పటము జరుగుతున్నది ఇక్కడ శాసనసభలో జిల్లాబోర్డుల పరిపాలన విషయము వచ్చినప్పుడల్లా జిల్లాబోర్డుల కాలపరిమితి పొడిగించమని అడగగా, ప్రస్తుతానికి లేదుగదా, ఒక సంవత్సరము పొడిగించాముగదా. కాలపరిమితిదగ్గరకు వచ్చినప్పుడు చూచుకుందాము అని చెప్పారు. క్రిందటి శాసనసభా సమావేశములో మరల యీ విషయము ప్రభుత్వాన్ని అడిగితే పంచాయితీబోర్డు ప్రతినిధులతో ఏర్పాటుచేస్తామని, బిల్లు తెస్తామని ఒక సంవత్సరము పొడిగించారు. తరువాత, ఆ విధానము సరిగాలేదు ఆలోచించి ఎన్నికలు జరపాలి అని ప్రభుత్వము ఉద్దేశిస్తున్నది అని ఒక సంవత్సరము పొడిగించారు. తరువాత శాసనసభ్యులనే బోర్డులకు మెంబర్లుగాచేసి, ఏర్పాటుచేస్తామని అన్నారు. తరువాత అది మళ్ళీ సరికాదు అని చెప్పి, చివరకు ప్రస్తుతము మరొక సంవత్సరమువగకూ Special oi.icers తోనే జిల్లాబోర్డుల పరిపాలన జరుపుతామని యీనాడు బిల్లును ఒకదానిని తయారుచేసి తీసుకొనివచ్చారు. ఈ విషయములో ప్రభుత్వ విధానము ఎట్లావున్నదంటే, ఒక ఉదహరణ నాకు జ్ఞాపకము వస్తున్నది. మా తాలూకాలో ఒక పంచాయితీబోర్డు ప్రసిడెంటు ఉన్నాడు. గ్రామములో రోడ్డు వేయవలసివచ్చింది. ఆయన మనస్సులోమాత్రం రోడ్డు గ్రామములో వేయాలనికాదు, తన యింటిముందర వేసుకోవాలని ఉద్దేశ్యముతో, మహమ్మదుల బజారుకు వెళ్ళి మీ బజారులో రోడ్డువేయాలని అంటే, హరిజనులు అడ్డము వస్తున్నారు అని చెప్పి, మరల హరిజనులవద్దకువెళ్లి, మీ బజారులోరోడ్డు వేయాలనిఅంటే మహమ్మదీయులు ఆటంకంపరుస్తున్నారు అని చెప్పి, చివరకు ఎక్కడాకూడా రోడ్డువేయించకుండా, తన యింటిముందరమాత్రం రోడ్డు వేయించుకున్నాడు. అదేవిధంగా ప్రభుత్వానికి జిల్లాబోర్డులకు ఎన్నికలు జరపడము యిష్టములేక ఆ విషయము

2nd December 1955] [Sri M. Nagi Reddi

divert చేయాలని వుద్దేశించి, ఒక పర్యాయము పంచాయితీబోర్డు ప్రతినిధులతో ఏర్పాటుచేస్తామని చెప్పారు. ఆ సంగతివిని రాష్ట్రపంచాయితీ మహాసభ పెట్టి, దానిలో ఒక పెద్దరభస లేపారు. వాళ్లు ఏమనుకున్నారంటే, ఏదో జిల్లాబోర్డుల పరిపాలనఅంత మన చేతులలోనికి వస్తుంది. బోర్డుహక్కుఅంతా మనలోనే వుంటుంది అనుకుని, జిల్లాబోర్డులను పరిపాలించే హక్కుఅంతా పంచాయితీబోర్డు వారికే వుండాలిఅని తీర్మానాలు చేశారు. ప్రభుత్వం ఆ విషయము పరిశీలించి, యిదికాదు పద్ధతి, యీ రోజున పంచాయితీ ప్రతినిధులు జిల్లాబోర్డు పరిపాలనాధికారము మాకు వుండాలని అన్నారు, రేపు అసెంబ్లీసభ్యులు అనబోతారు, రేపు లేదు ఎల్లుండి, పార్లమెంటు విషయంలోగూడా యిదేవిధంగా హక్కు కావాలంటారు. అని గ్రహించి, యిది సరియైన ప్రజాస్వామిక పద్ధతికాదని ఆలోచించారట. దానితో వారిలో వారికి భిన్నాభిప్రాయాలువచ్చి యిది, అది రెండూకాదు ప్రస్తుతానికి యీ Special officers తోనే మరో సంవత్సరం పొడిగిస్తే బాగుంటుందని యీ బిల్లుతెచ్చారు. శాసనసభ్యులతో ఏర్పాటుచేస్తామని ప్రభుత్వము అన్నప్పుడు. మా కేదో వస్తుంది. మేము జిల్లాబోర్డు వ్యవహారాలన్ని కబళించుకోవాలనిచూస్తే మా మీద పెద్ద దుమారం లేవదీశారని ప్రభుత్వపక్ష సభ్యులు అన్నారు. ఈ విధంగా ప్రభుత్వపక్షమువారిలో వచ్చింది. మరి ఏ పరిస్థితులలో ఏమివచ్చిందో గాని, యీ బోర్డుల పరిపాలన చివరికి ఒక సంవత్సరంపాటు Special officers తోనే జరపాలని ప్రభుత్వం నిర్ణయించి, బిల్లుతెచ్చారు. గనక ప్రభుత్వముయొక్క పరిపాలన యీ విధంగా అవక తవకల ఆలోచనలతో జరుగుతున్నదని స్పష్టముగా తేలుతున్నది.

అయితే సూర్యనారాయణరాజుగారు ఒక సందర్భములో మాట్లాడుతూ ఎన్నికలు జరిగితే వారికే విజయం జరుగుతుందని అన్నారు, సరే. వారికి అటువంటి ధైర్యము వుంటే, వారే గెలుస్తారని, వారి పార్టీ సభ్యులే గెలుస్తారని అనుకుంటే ఎన్నికలను మేము బిల్లు తీసుకునిరమ్మని చెబుతూవుంటే, సంతోషించడ మెందుకు ? దానికి డబ్బులేదని కారణము చెబుతారు. డబ్బు అంటే యీ సంవత్సరము డిశంబరువరకే వున్నప్పుడు, ప్రభుత్వానికి డిశంబరు తరువాత ఎట్లాగు జరుగుతుంది అనే ఆలోచనలేదా ? ఇప్పటికి మూడు నాలుగు సంవత్సరాలనుంచి ఎన్నికలు జరపాలి అనే సంగతి ప్రభుత్వానికి తెలియదా ? లేకపోతే, ప్రభుత్వము రాష్ట్రములో ఎన్ని ఖర్చులు పెట్టడంలేదు. అందులో యిది ఒక ఖర్చు. ఎన్నికల సమస్య వచ్చేటప్పటికి, డబ్బులేని సమస్య తీసుకొనివస్తారు. ఇది డబ్బులేని సమస్య కానేకాదు. ఈ పరిపాలన ఏదో ఒక రకంగా జరపాలనే వుద్దేశ్యమేగాని, ఎన్ని

2nd December 1955] [Sri M. Nagi Reddi

కులు 1956 డిశంబరులో కాదుగదా, 1957 వ డిశంబరులోగూడా జరిగే పరిస్థితి గూడా లేకుండా ప్రభుత్వం చేస్తున్నది. ఇందులో యింకొకటి కనబడదు. ఇప్పుడు ప్రభుత్వము ఏర్పాటుచేసిన Special officers పరిపాలన ఏవిధంగా జరుగుతున్నదో గూడ కొంత చెప్పదలచాను. రోడ్ల విషయంలోగాని, హాస్పటల్సు విషయంలోగాని చెప్పదలిస్తే, అది అన్నీ ఏదో దిక్కులేని వ్యవహారముగా వుంటున్నవి. ఏదైనా represent చేద్దామని అనుకుంటే, అక్కడ వినేవారు లేరు. ఈ కష్టమంతా ఎందుకు? ఎన్నికలు జరపకూడదా? జరిగితే, కాంగ్రెసే వస్తుందో, యింకొక పార్టీ వస్తుందో, జరిగిదేగదా తెలియగలదు. కాంగ్రెసు పక్షమువారే ఎక్కువమంది రావచ్చు, లేదా యింకొకరు రావచ్చు, ఎవరు అధికారములోనికి వచ్చినా, వారందరు ప్రజాప్రతినిధులేగదా! అప్పుడు ప్రజలు తమయొక్క సమస్యలు అన్నీ జరిపించుకోటానికి ప్రతినిధులను నిలవదీసి అడిగే అధికారము ప్రజాస్వామిక పద్ధతి రీత్యా, వుంటుందిగదా. ఆ ప్రతినిధులు కాంగ్రెసు పక్షంవారు కానివ్వండి, కమూనిస్టు పక్షమువారు కానివ్వండి లేదా సోషలిస్టు పార్టీవారు కానివ్వండి, లేకపోతే యింకెవరైనా కానివ్వండి, వారిలో ఎవరైనా యీనాడు వున్న పరిస్థితులను represent చేయటానికి కలెక్టరు special officer గా వున్నప్పుడు వారివద్దకు వెళ్లితే, ఆయనకు అనేక పనులు వుండినందున వెళ్లినవారు చెప్పేది ఏమనటానికి టైములేక P. A. వుంటాడు అక్కడికిపోయి చెప్పమంటాడు. చెప్పితే వినేవారు ఒకరు అర్డర్లు ప్యాస్‌చేసేవారు యింకొకరు. ఏదైనా అడిగితే, డబ్బు లేదంటారు. పనులు చేస్తారా అంటే, అది ఏమీ కనబడదు. దిక్కు వుండదు సరికదా, చివరకు వారికియిచ్చే డబ్బు అంతా వారి establishment ఖర్చుల క్రింద సరిపోతున్నట్లుగా వున్నది. ఒక ఉదాహరణ చెప్పాలంటే, మా తాలూకాలో వున్న దాచేపల్లిలో ఒక హాస్పిటల్ కట్టారు. అది కట్టి యిప్పటికి 8 సంవత్సరాలు అయింది. అందులో యింతవరకు హాస్పిటల్ పెట్టలేదు సరికదా, దానిమీద కప్పుగూడ పడిపోతున్నది. దానికి కారణము ఏమిటి అని అడిగితే ఆ కట్టడము సరిగాలేదు అందుకని అందులో హాస్పిటల్ పెట్టము అని చెబుతారు. హాస్పిటల్ యిప్పటివరకూ ఒక సత్రములో వుంటున్నది. అందులోనే ఒక ప్రక్కన డాక్టరు కాపురము వుంటున్నాడు. సత్రము యీ విధంగా వుపయోగించడమువల్ల రోగులు ఎవరైనావస్తే, అందులో దిగటానికి వీలు లేకుండా పోతున్నది. హాస్పిటల్ కొరకు ఆ బిల్డింగు సరిగా కట్టించి పూర్తి చేయించరు, సత్రము ఖాళీ చేయరు. అడిగితే ఎవరు సమాధానము చెప్పరు. దీనికి గూడ దిక్కుమొక్కులేని పరిస్థితులు వుంటున్నవి. జిల్లా బోర్డు పరిపాలనలో ప్రజా ప్రతినిధులు వుంటే ఆ హాస్పిటల్ వ్యవహారాలు ఆవిధంగా జరుపుతారా అని

Sri M. Nagi Reddi] [2nd December 1955

అంటున్నాను. కాంగ్రెసుపక్షము వారైనా సరే, ప్రజాప్రతినిధులు వుంచేకూడా హాస్పిటల్ ఆవిధంగా యిన్ని సంవత్సరాలనుంచి సత్రములో వుంచవలసిన పరిస్థితియే వుండదని నా నమ్మకము.

ఇక రోడ్లవిషయములో చూస్తే ఎన్నో అవకతవకలు జరుగుతున్నాయి. రోడ్లు ఎంత అధ్వాన్నముగా ఉండాలంటే అంత అధ్వాన్నముగా ఉన్నాయని, ప్రభుత్వ పక్షమునుంచివచ్చిన సభ్యులుకూడా చెబుతున్నవిషయమే. అందువల్ల ఎన్నికలను మరల రూపొందించడము అనేది ఏవిధముగా సమర్థనీయముకాదు. దీనివిషయములో యిప్పటికైనా తేల్చుకొని, ఫలానతేదికి ఎన్నికలు జరుపుతామని ఒకనిర్ణయమునకైనా ప్రభుత్వం వచ్చిందా, అదీలేదు. మరల ఒక గందరగోళములో పెట్టడానికి, ఏదో రకంగా మరల దాటవేయడానికి చూస్తున్నదని స్పష్టముగా కనిపిస్తున్నది. పంచాయితీల ప్రతినిధులు అంటున్నారు. నిజమే. ఇప్పుడు బహుశః ఒకఫిర్కాకు ఒక సభ్యుడుచొప్పున జిల్లాబోర్డుల మెంబర్లు వుంటారు. ఒక్కొక్కఫిర్కాకు దాదాపు 10, 12 పంచాయితీలు ఉంటవి. 10, 12, పంచాయితీలలోను, ఒక్కొక్క పంచాయితీ average 6 గురు చొప్పున సభ్యులను వేసుకున్నట్లయితే మొత్తము 70 మంది ఉంటారు. ఈ 70 మందితోటి జిల్లాబోర్డుల ప్రతినిధులను ఎన్నుకోవడమా ? దాదాపు ఫిర్కాలో 30, 40 వేలమంది జనాభావుంటే వాళ్ళందరికీ ప్రతినిధులుగా ఈ 70, 80 మంది ఎన్నుకోవడమా ? ఈ 70, 80 మందికూడా మళ్ళా రేపు రానున్నటువంటి బిల్లులో ఇదివరకు జరిగినటువంటి పంచాయితీల ఎన్నికలు చూసుకున్నప్పటికి, మరల ఇప్పుడు ప్రభుత్వచెబుతున్న పంచాయితీల ఎన్నికల విధానము చూసుకున్నప్పటికికూటా ఈ చేతులు ఎత్తడముద్వారా ఎన్నికైనటువంటి సభ్యులద్వారా, ఎన్నికైన పంచాయితీ ప్రతినిధులతోటి జిల్లాబోర్డుల ప్రతినిధులను ఎన్నుకొని పంపకం అన్నట్లయతే ఇది ఎంత సంకుచితమైనపద్ధతో, ఇదేమి ప్రజాస్వామికపద్ధతో ప్రభుత్వ పక్షసభ్యులుకూడా ఆలోచించాల్సిన అవసరము ఉన్నది. ప్రజలు పంచాయితీ ప్రతినిధులను ఎన్నుకోనేది ఎందుకు ? తమయొక్క గ్రామములోఉన్న సమస్యలను తీర్చడానికి, పంచాయతీలను సక్రమంగా నడపడానికి ఎన్నుకున్నారు. మా గ్రామ పరిస్థితులను పరిశీలించండి అనిచెప్పి గ్రామములలోని ప్రజలు పంచాయతీ ప్రతినిధులను ఎన్నుకొంటున్నారు. ఇలాంటి పరిస్థితులలో వాళ్లు ఎన్నుకొన్న ప్రతినిధులతోటి జిల్లాబోర్డులను నిర్మించాలని ప్రభుత్వం ఆలోచించడం సమర్థనీయముకాదు. అలాగైనట్లయితే ఎన్నికలే తక్కువఅయ్యేదిగా ? పంచాయతీబోర్డు ప్రతినిధులనుంచి జిల్లాబోర్డుల ప్రతినిధులవంటి, జిల్లాబోర్డు ప్రతినిధుల నుండి అసెంబ్లీ ప్రతినిధుల నుండి పార్లమెంటు ప్రతినిధులనండి. సూర్యనారాయణ రాజుగారు చెప్పినట్లు, అప్పుడు ఎన్నికలకు మాకు

ఖర్చే ఉండదు. గ్రామాలలోనే సరిపోతుంది. పైకిపోయిన కొద్దివారే అందరినీ ఎన్నుకుంటారు. అప్పుడు ఎన్నికలు అవసరమే లేకుండా పోతుంది. అంగువల్ల ఇదిఏమీ సమర్థనీయముకాదు. ఎన్నికలకు ఇవాళ 40 లక్షలు అవుతుంది అంటున్నారు. ఇప్పటికి జిల్లాబోర్డులను స్పెషలుఆఫీసర్ల చేతులలోపెట్టి 4 సంవత్సరములు అయింది. మనకు 11 జిల్లాలు ఉన్నాయి. 11 జిల్లాలకు పదకొండు, 3 1/2 లక్షలు అవుతాయి. ఇవ్వాలిటిరోజున మనకు ఎన్నిఖర్చులు కావడము లేదు. ప్రభుత్వము ఏమైనా ఆగుతుందా? ఇవాళ P. W. D. తదితర depaitments లో అనేకవిధములైనటువంటి దుబారాఖర్చులు జరుగుతోంటే వాటిని ఆపకుండా, అవి ఆపడానికి చాలాకాలము పడుతుంది కాబట్టి, ఇప్పుడు ఆపలేముఅంటూ, ఎన్నికలకు మాత్రము డబ్బులేదు అంటున్నారు. ప్రజాస్వామికంగా ఈరోజున మనకు రావలసిన హక్కులనుబట్టి ఈవేళ ఎన్నికలను ప్రత్యక్షంగా తెమ్మంటున్నాము అంటే మేము అధికారంలోకి రాగలమనే ఉద్దేశ్యంతో అని ఎప్పటికీకాదు. A. P. C. C. కూడా అట్లాగే తీర్మానంచేసింది. కాంగ్రెసు అధికారంలోకి రాగలదనే తీర్మానము చేసిందా? అట్లాగయితే అందులో ఒకగ్రూపు M. L. A. లకు రావాలని ఎందుకు తీర్మానముచేసింది. వాళ్లు M. L. A. లుగాఉండి అధికారంలో ఉండాలని తీర్మానము చేసిందా? అందువల్ల యివాళ ఇది సమస్యకానేకాదు. ఇవాళ ఎన్నికలు జరిగితీరాలని ప్రజలందరూ స్పష్టముగా కోరుతున్నారు. అందువల్ల దానిని తీసుకురావలసిన అవసరము ఉన్నది కాని, ఈ రకంగా చేయడము ఎంత మాత్రమూ సబబుకాదు. అందువల్ల M. L. A. లను జిల్లాబోర్డులకు ప్రతినిధులుగా పెట్టడము అనేటటువంటి సమస్యను మరల ఎత్తకుండా, ప్రభుత్వం ఆలోచించి వెంటనే జిల్లాబోర్డులకు ప్రత్యక్షపద్ధతిద్వారా ఎన్నికలుజరిపి, ప్రజాస్వామికాన్ని కాపాడాలని చెప్పుతున్నాను. మరల ఈ special officers పదవిని పొడిగించక జిల్లాబోర్డులకు ప్రజాప్రతినిధులే ఉండాలని విజ్ఞప్తిచేస్తూ, అధ్యక్షులవారికి కృతజ్ఞత తెలుపుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri D. SREERAMAMURTHI :— అధ్యక్షా, జిల్లాబోర్డులలో అనేక అక్రమాలు జరుగుతున్నాయి. ప్రభుత్వమువారు వాటికి ఎన్నికలు జరిపేందుకు డబ్బులేదనే సాకుతో వాటిని పొడిగించుతూ, స్పెషలుఆఫీసర్ల పదవీకాలము హెచ్చిస్తున్నారు. పల్లెలలో విద్యావిధానములో జరుగు అన్యాయాలను స్పెషలు ఆఫీసర్లకు చెప్పుకొనుటకు వీలులేకుండా ఉండెను. తాలూకాలలోఉన్న డిప్యూటీ ఇనస్పెక్టర్లలో లంచగొండితనము ప్రబలిపోయెను. ఉపాధ్యాయులు స్వగ్రామము

లోనే ఉండుటవలన వారు రాజకీయాలలో కలుగజేసుకొని, పల్లెప్రజలను రోడ్డులకు త్రిప్పి వారిఆస్తులను కాజేస్తూ, వారికర్తవ్యమును తృణీకరిస్తూ పల్లెవిద్యార్థులకు తీరని అన్యాయము కలుగజేస్తున్నారు. వారు సరిగా పిల్లలకు చదువుచెప్పని కారణముచేత పెద్దపరీక్షలలో 30 మందికి పరీక్షకు వెళ్ళితే 3 గురు చొప్పున ఉత్తీర్ణులగుచున్నారు. అందుచేత ప్రభుత్వమువారు ఈ ఎన్నికలను వాయిదావేయక వెంటనే ప్రత్యక్షఎన్నికలు జరిపించవలసిందిగా కోరుతున్నాను.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, ఈ జిల్లాబోర్డులను వాయిదా వేయడమనేది ఇది మొట్టమొదటి సారికాదు. ఇప్పటికి మూడుసార్లు ఇటువంటి బిల్లును ప్రవేశపెట్టడము దానిమీద చర్చజరగడము జరిగింది. బహుశః అప్పుడు శ్రీరాజాసాగి సూర్యనారాయణ రాజుగారు ఈ బోర్డులను వాయిదావేయకూడదు వెంటనే ఎన్నికలు జరపాలని, ఉపన్యాసము ఇచ్చిఉండవచ్చును. బహుశా వారు అప్పుడు కాంగ్రెసులో లేరనుకొంటాను. ఇంతవరకు మాట్లాడినవారు కాంగ్రెసుసభ్యులు గాని, ఇతరపార్టీ సభ్యులు అందరూకూడా వీటిని వాయిదా వేయడానికి అంగీకరించినవారు ఎవరూకూడా లేరని చెప్పడానికి నేను ఇక్కడ సాహసిస్తున్నాను. కొంతమంది కాంగ్రెసు శాసనసభ్యులు యీ బిల్లుమీద మాట్లాడుతూ విధిలేక దీనిని బలపరుస్తున్నామని చెప్పడానికి సాహశించారంటే, ఏ విధముగా కాంగ్రెసు శాసనసభాపార్టీ దీనినిఎలా అమలుజరుపచూస్తున్నదో తెలుస్తున్నది. ఒకప్రక్క కాంగ్రెసుకమిటీ సభ్యులలోకూడా సమావేశము అయింది. Provincial కాంగ్రెసుకమిటీ శాసనసభ్యులతోకూడా సమావేశము అయ్యారు అనుకొంటాను. అందులో ఏకగ్రీవంగా ఎన్నికలు జరపాలని తీర్మానము చేయడముకూడా జరిగింది. ఆనాడు కాంగ్రెసు ఆ తీర్మానము చేసిందిఅంటే 3, 4 సంవత్సరములుగా మూలబడివున్న జిల్లాబోర్డులను తిరిగి పునర్నిర్మాణము చేయడానికి కాంగ్రెసు గవర్నమెంటు పూనుకున్నారనిచెప్పి ప్రజాస్వామికము సంతోషించింది. కాని ఈనాడు తిరిగి మళ్ళీ శాసనసభముందు ఒకవాయిదా వేయమని ఆ సమస్యను తీసుకువచ్చినారంటే, అసలు దీనితో ఎన్నికలు తిరిగి జరపాలనే ఉద్దేశ్యము.ఏమైనా కనబడుతున్నదా అంటే అదిమాత్రం శూన్యంగా కనబడుతున్నది. మరల ఒకసంవత్సరము వాయిదా వేయమంటున్నారంటే, ఒకసంవత్సరము వచ్చేటప్పటికి మరల పంచాయతీఎన్నికలు వస్తున్నాయి. మనము వాయిదాకాని మునిసిపలుఎన్నికలు ఉన్నాయి. వచ్చే అక్టోబరు నాటికి విశాలాంధ్ర రాష్ట్రము రాబోతున్నది. ఆనాడువచ్చే మంత్రివర్గంపైనా ఎన్నికలు జరపాలా అక్కరలేదా అనేబాధ్యత ఉంటుంది. ఈమంత్రివర్గానికి అప్పుడు బాధ్యతఉండదు. నిన్న మసిపూసి మారేడుకాయఅని అన్నారు.

2nd December 1955] [Sri V. Visweswara Rao

అల్లాగే ఒకసంవత్సరము మనకళ్లముందు చూపించి ఎప్పటికప్పుడు ఏదో నాలుగు మాటలుచెప్పి కాలయాపన చేయడానికి ఉద్దేశింపబడిన బిల్లులాగా కనబడుతున్నది కాని, ఇప్పుడు అసలు జిల్లాబోర్డులు తిరిగి పునర్నించాలనే ఉద్దేశ్యము కాంగ్రెసు పార్టీకిగాని, ఇక్కడ ఉన్నటువంటివారికి ఉన్నట్లుగా నాకు తోచడములేదు. ఈనాడువున్న జిల్లాబోర్డుల ప్రెసిడెంట్సు అందరూ జిల్లాకలక్టర్లే. వారు జిల్లా బోర్డులయొక్క బాధ్యత వహిస్తున్నారు. వారు ఈనాడు ప్లానింగుకమిటీ ప్రెసిడెంట్సుగా ఉంటున్నారు. బ్లాక్ డెవలప్‌మెంటు సర్వీసువుంటే దానికి ప్రెసిడెంటుగా ఉంటున్నారు. రోడ్డు ట్రాఫిక్ బోర్డుఉంటే దానికి ప్రెసిడెంట్లుగాను ఇంకా ఎన్నింటికో ప్రెసిడెంట్లుగా ఉంటున్నారు. ఆయనకు ఎక్కువ తీరిక అనేది వుండదు. వారితో జిల్లాబోర్డుల సమస్యమీద మాట్లాడాలంటే చాలాకష్ట సాధ్యమైన విషయము. ఆయనకు ఒక P. A. ఉంటాడు. ఈయన ఎవరుఅంటే ఇతర జిల్లాబోర్డులసంగతి తెలియదుకాని కృష్ణా జిల్లాబోర్డులో ఇదివరకు ప్రెసిడెంటు పరిపాలనలో వారు కార్యదర్శిగా ఉన్నవారు. కనీసం డిప్యూటీ కలెక్టరు హోదాకూడా వారికి ఉండదు. ప్రెసిడెంట్సుకు ఆయన పరిపాలనలో సహాయముచేస్తూ ఉండేవారు. ఇప్పుడుకూడా ఆయనే కలెక్టరుకు P.A.గా పని చేస్తున్నారు.

ఈయనకు జిల్లాబోర్డు పరిపాలనలో చాలా అనుభవం ఉంటుంది. ప్రతీ స్కూలు teacher మీద పెత్తనం చేయడంలో చాలా అనుభవం ఉంటుంది. వారు ఇదివరకునుంచి అణగి మణిగి ఉంటున్నవారే, teachers తమ కష్టాలు చెప్పు కోడానికి పోయినా P. A. గౌరవించడం లేదంటే చాలా దారుణంగా ఉన్నది. ఇటువంటివారితో జిల్లాబోర్డులను continue చేయాలంటే సరియైన అనేది ఆలోచించ వలసియున్నది. మనం పరిపాలిస్తాము, వీరందరు పరిపాలించబడుతారు అని సంతృప్తి చెందాలితప్ప మరొకటికాదు. మా జిల్లాలోవచ్చిన ఒక సమస్య చెబుతాను. Text Books Committee విషయంలో చాలా గందరగోళం బయలుదేరింది. కృష్ణా జిల్లాలో 100 High Schools ఉన్నాయి. వీటిలో average తీసుకుంటే స్కూలుకు 300 మంది విద్యార్థులకు తక్కువ ఉండరు. Text books అనేవి లేకుండా 5 వ ఫారంవరకు మూడు నెలలు గడిచింది. దానికి బాధ్యులు ఎవరు? జిల్లాబోర్డు ప్రసిడెంటు, కలెక్టరు, P. A. వారెవరిది లోపంలేదా? ఉన్నది. మంత్రిగారికి తెలుసు విద్యాశాఖా మంత్రిగారైన గోపాలరెడ్డిగారు శాసనసభలో అంగీకరించకపోయినా పరోక్షంగానైనా అంగీకరించారు. High School కు ఎందుకువెళ్లారు? పుస్తకాలను నిర్ణయించడంలో Rules లేవా? Text Books

Sri V. Visweswara Rao] [2nd December 1955

Committee లో Headmasters members గా ఉన్నారు. జిల్లాకలెక్టరు P. A. దానికి బాధ్యతవహించాలి. ఈ విధంగాఉన్న ధూల్స్‌ను దిక్కరించవలసిన అవసరంఏమిటి ? మూడునెలలపాటు పిల్లలకు పుస్తకాలు లేకుండావుంటే మన పరిపాలన గురించి ప్రజలు ఏమిఅనుకుంటున్నారో ఆలోచించాలి. ఇటువంటి పరిపాలన జరుగుతుంటే పరవాలేదు. వీటిని మరొక సంవత్సరం వాయిదా వేయాలంటే ఎలా ఉంటుందో ఆలోచించండి. Text Books Committee లో పెద్ద కుంభకోణం జరిగిందని జిల్లాఅంతా చెప్పుకుంటున్నారు. దానికి జిల్లాబోర్డు కారణం. దీనిని సవరించవలసిన అవసరం ఉన్నది. దానిని ఇదే రకంగా కొనసాగించడం సరికాదని మనవిచేస్తున్నాను. మరొకవిషయం. డబ్బులేదని మాటి మాటికి చెబుతున్నారు. జిల్లాబోర్డు ఎన్నికలకు 40 లక్షలు అవుతుంది; మనది deficit budget. ఈ 40 లక్షలుచేరిస్తే ఇంకా పెద్ద deficit అవుతుంది అంటున్నారు. ఇదేరీతిగా దేశసౌభాగ్యంకొరకు ఎలెక్షన్లుకూడా వాయిదా వేయాలని చెప్పవచ్చును. 40 లక్షలు ఖర్చుఅవుతుందని దడుస్తున్నమా, ప్రజాస్వామి కాన్ని అమలుచేయడానికి దడుస్తున్నామా అనేది ప్రశ్న. ప్రజాస్వామికాన్ని అమలు చేయడానికి కొంతడబ్బు ఖర్చుకాకతప్పదు. గవర్నర్లు, ఆఫీసర్లు స్థానే ప్రజాప్రతినిధులను ఎన్నుకుని వారిద్వారా పరిపాలన సాగించాలని మనం 60 సంవత్సరాలుగా ఆందోళన చేస్తున్నాము. బ్రిటిషు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా మనం అందరం పోరాటం సాగించాము. ప్రజలు ఎన్నుకున్న ప్రతినిధులే రాజ్యం పాలించాలని పోరాటం సాగించాము. ప్రజాప్రతినిధులను ఎన్నుకోవాలంటే ఖర్చుకాదని అనుకున్నామా ? లేదు. తప్పకుండా ఖర్చుఅవుతుందని తెలుసును. నిన్నగాక మొన్న 40 లక్షలు ఖర్చుచేసి ఎలెక్షన్లు జరుపుకున్నాము. ప్రజాస్వామ్యం కావాలనే దృష్టితో డబ్బుఖర్చుఅయినా ఎలెక్షన్లు జరుపుకున్నాము. ప్రజాస్వామ్యాన్ని అమలుచేసే విషయంలో డబ్బు ఖర్చుఅవుతుందని ఎలెక్షన్లు కూడదనడం సరికాదని మనవిచేస్తున్నాను. G. O. ద్వారా పంచాయితీబోర్డులకుకూడా ఎలక్షన్లు వాయిదావేశారు. మార్చివరకు వాయిదావేశారని కొద్దికొద్దిగా తెలుస్తోంది. వాటికి G. Os ఉన్నాయో లేదో నాకు తెలియదు. పంచాయితీ బోర్డులకుకూడా ఎన్నికలు జరుపవలసిన అవసరం ఉన్నది. ఆంధ్రదేశంలో 4 వేల గ్రామాలలో పంచాయితీబోర్డులు ఏర్పడినాయి; ఇంకా 8 వేల గ్రామాలలో ఏర్పడవలసియున్నది. జిల్లాబోర్డులకు. పంచాయితీలకు కలిపి ఎన్నికలు ఏర్పాటు చేసినట్లయితే 40 లక్షల రూపాయిలతోనే రెండూ పూర్తిఅవుతాయి. పరోక్ష ఎన్నికలు కాకుండా ప్రత్యక్ష ఎన్నికలే జరుపవచ్చును. 40 లక్షల రూపాయిలు

అక్కరలేకుండా 20 లక్షల రూపాయిలఖర్చుతోనే ఈ ఎన్నికలను పూర్తిచేసుకోన వచ్చునని నేను అభిప్రాయపడుచున్నాను. ఈ విషయాన్ని ఆలోచించవలసిందిగా ప్రభుత్వంవారిని కోరుతున్నాను. కొంతమంది మిత్రులు మాట్లాడుతూ కమ్యూనిస్టులు పదే పదే ఎన్నికలుకావాలి అంటున్నారు. మళ్ళీ ఎన్నికలు జరిపితే కమ్యూనిస్టులు వస్తారని ఆలోచిస్తున్నారా అని అన్నారు. నాగిరెడ్డిగారు అంతా వివరంగా చెప్పారు. మేము ఏ విధంగాను ఆశించడంలేదు. కమ్యూనిస్టులు వస్తారా అనేది కాదు ప్రశ్న. ప్రజాస్వామి కాని అమలుజరపడం అనేది ప్రశ్న. అన్నిపార్టీల వారు ఎలెక్షన్లు జరపాలనే అంటున్నారు. ప్రజాపార్టీవారుమాత్రం ఈ జిల్లా బోర్డులను రద్దుచేసి వాటి అధికారాలను శాసనసభ్యులకు, పంచాయితీబోర్డులకు ఒప్పగించాలని శాసనసభ్యులకమిటీని వేయాలని చెప్పడం జరిగింది. దేశంలో అధిక సంఖ్యాకులైన ప్రజలు ఎలెక్షన్లు కావాలని కోరుతుంటే ఒక సంవత్సరంవాయిదా వేయాలనడం అధికారం తమ చేతుల్లో పెట్టుకోవాలనుకోడంతప్ప మరొకటిలేదు. ఒక సంవత్సరం ఎన్నికలులేకుండా చేసేప్రయత్నంతప్ప మరొకటికాదు. ఎన్నికలు వెంటనే జరపాలని కోరుతున్నాను.

MR. SPEAKER :—The House will now rise for lunch and meet again at 3-00 p. m.

## AFTER LUNCH 3-00 p. m.

SRI E. AYYAPPU REDDI:—అధ్యక్షా, మహాశయా, ఈబిల్లును నేను బలపరుస్తూవున్నాను. ప్రతి పక్ష సభ్యులు సిద్ధాంత రీత్యా అంటే ప్రజాస్వామిక సిద్ధాంత రీత్యా యీ బిల్లును ఖండించారు. కాని సిద్ధాంతాలనేవి కేవలం ఆచరణ యోగ్యం కానపుడు ఆచరణలో పెట్టలేని విషయాలు వాస్తవికతను గుర్తించుకొని కొంత అనుగుణంగా పెట్టవలసిన అవసరం వున్నపుడు Democracy కి ఏదో పెద్ద ఉపద్రవం దీనిద్వారా వస్తుందని, కేవలం అర్థిక శాస్త్రి Professor మాదిరి ఉపన్యాసం యివ్వడం భావ్యంకాదని నేను అనుకుంటున్నాను. ఇప్పుడు ఆంధ్ర దేశంలో వున్న పరిస్థితులనుబట్టి మరి యీ 11 జిల్లాలలో adult franchise పైన జిల్లా బోర్డు ఎన్నికలు జరపడం భావ్యమా అనే విషయాన్ని గ్రహించవలసిన అవసరం ఉన్నది. ఇప్పటికి ఒక సంవత్సరంకూడా కాలేదు పూర్తిగా, general ఎన్నికలు జరిగి. మరి ఒక సంవత్సరంలోనే general ఎన్నికలను మించినటువంటి జిల్లా బోర్డుల ఎన్నికల కోలాహలము దేశంపైని తీసుకొని రావడం బాగుంటుందా లేదా ఆలోచించవలసిన అగత్యం వున్నది. 1956 డిసెంబరు ఆఖరుకు పార్లమెంటు ఎన్నికలు రానున్న సమయాన ఒకేసారి దేశం అంతటా ఎన్నికలు జరిపి ఎన్నికల సంచలనములో

Sri E. Ayyapu Reddi] [2nd December 1955

ప్రభుత్వం ప్రజలను విసిగించడం సరైనదవునా కాదా అనేది యోచనచేయాలి. కమ్యూనిస్టుపార్టీ అయినా కాంగ్రెసు పార్టీఅయినా ఏ పార్టీఅయినా యీ ఎన్నికలు ప్రతి సంవత్సరం జరపడం భావ్యంగా ఉండదు. ప్రజలు విసుగెత్తుతారు. కమ్యూనిస్టు పార్టీలో ఒక ప్రముఖనాయకుని యిటీవల దర్శించి వారియొక్క భావాలను తెలుసుకునే అవకాశం చిక్కింది. 1957 లో విశాలాంధ్ర వచ్చినపుడు general elections జరపడానికి మీరు సిద్ధంగావున్నారా అంటే వారు గత election లలో అప్పులు పడి ఆర్థికంగా చాలా దెబ్బతిన్నాం. ప్రతి ఒక్క జిల్లా కమిటీకి కొన్ని వేల రూపాయలు అప్పు తటస్థించింది. అప్పు భారం తీర్చుకొని మళ్లీ ఎన్నికలకు సిద్ధం అయ్యేదానికి కొంత కాలం పడుతుంది, 1958 లో గాని మా పార్టీ సర్వ సిద్ధంగా. . .

SRI P. SUNDARAYYA .—ఇంకా నెల రోజులలో ఎన్నికలు పెట్టినా మేము తయారుగా వున్నాం.

SRI E. AYYAPU REDDI :—తయారుగా వుండవచ్చును. యుద్ధానికి ఎప్పుడైనా కానీ ఎవరైనా కానీ తయారుగానే వుండవచ్చును. సర్వ సంపూర్ణంగా సమగ్రంగా తయారు కావడం వేరే వుంటుంది. ప్రతి సంవత్సరం సంవత్సరానికొకసారి యీ ఎన్నికల కోలాహలం, యీ మైకులు, మైక్రోఫోనులు యీ ప్రజలు పార్టీల కార్యక్రమాలు తప్పయితరత్రా యితర కార్యక్రమాలు ఉండకపోవడంఅనేది దేశానికి క్షేమకరంకాదని నా అభిప్రాయం. ఇక ముఖ్యంగా యీజిల్లా బోర్డులలో వున్నటువంటి లోటు ఏమిటంటే జిల్లా బోర్డులు ఏవిధమైన అధ్వాన్న పరిస్థితులలో వున్నాయి అంటే, Special Officer లు ఏపని చేయటానికైనా డబ్బులేని స్థితిలో వున్నారు. ఏ కారణంచేతనైతే యీ bill తీసుకువచ్చామో ఆర్థిక దుస్థితి యిటువంటి విషయాల కారణంచేత జిల్లా బోర్డులంటే అంత ఆశాజనకమైన పరిస్థితులలో లేవని చెప్పవలసిన అవసరం వుంటుంది. ముఖ్యంగా జిల్లా బోర్డులలో ప్రాథమిక విద్య, వైద్యం, పల్లెలకు రహదారుల సౌకర్యం జిల్లా బోర్డుల చేతులలో వున్నది. అటువంటప్పుడు జిల్లా బోర్డులలో సరైనటువంటి పరిస్థితులలో సరైనటువంటి మార్గాలలో నడపడం ఈ దేశానికి ఎంతో క్షేమకరం. ఇది ప్రతి ఒక్కరూ అభిలంషించేదే. కాని యీవిధంగా లేకపోవడానికి ముఖ్య కారణం ఒకటే అది జిల్లా బోర్డుకు డబ్బు లేనంత మాత్రమే. ఇప్పుడు ఎన్నికలు జరుపడం లేక పోయినందువల్ల 40 లక్షల రూపాయలు ప్రభుత్వం మిగుల్చుకుంటుంది. దీంట్లో కొంతభాగం యీ జిల్లా బోర్డులకు కేటాయించి ప్రతి ఒక జిల్లా బోర్డుకు 3, 4 లక్షల రూపాయలు కేటాయించి Speeial officer ద్వారా అయితేనేమి,

ఉతర ప్రాన్తైతేనేమి యీ ప్రాథమిక విద్య వైద్య రహదారుల సౌకర్యాలు వెంటనే బాగుచేయించి నట్టయితే జిల్లా బోర్డులో యిప్పుడున్నటువంటి దుష్ట పరిస్థితి తొలగి పోతుంది. ఇప్పుడు స్థానిక పరిపాలనా మాత్యులు మా constituency లో కూడా tour చేశారు. నందికొట్కూరు ఆసుపత్రి చూచే అవకాశం వారికి కలిగింది. అక్కడ ఆసుపత్రిలో సంవత్సరానికి కావలసినటువంటి వైద్య సౌకర్యాలు మందులు అంతా 500 రూపాయలు మాత్రమే కేటాయించబడింది. డాక్టరునడిగితే కేవలం 2 మాసాలకు మాత్రమే సరిపోతుందని చెప్పారు. అంతేకాకుండా జిల్లా బోర్డు ఆసుపత్రి భవనంకూడా శిథిలావస్థలో వున్నది. దానిని repair చేయించ డానికి వీలులేని పరిస్థితివున్నది. ప్రాథమిక విద్యకుకూడా కొన్నిచోట్ల ఎన్నెన్నో గ్రామాలలో బదులు కావలసిన అవసరంవున్నది. ఎన్నో అర్జీలు వస్తున్నాయి. ఆ అర్జీలను Special officer లు డబ్బులేని తేనందవల్ల తృప్తిపరచలేకుండా ఉన్నారు. ప్రభుత్వాన్ని నేను ముఖ్యంగా కోరేదేమిటంటే యీ election లో మిగిలించే డబ్బులో కొంత మొత్తాన్ని-కనీసం 20 లక్షలు జిల్లా బోర్డులకు కేటాయించి స్పెషల్ ఆఫీసరుకు ఒక సలహా సంఘం, M. L. A. లు అయితేనేం, M.C. లు అయితేనేం, పరిపాలన వ్యవహారంలో దక్షత కలిగిన non-official అయితేనేం, ఒక సలహా సంఘం ఏర్పాటుచేసి ఆ సలహా సంఘం కనీసం మాసానికి ఒకసారైనా కలిసి చర్చించి యీ మొత్తాన్ని సద్వినియోగం చేస్తే జిల్లాలు చాలాభాగము చక్కబడ గలవని నా సంపూర్ణమైనటువంటి విశ్వాసం. అందువల్ల యిప్పుడు సంవత్సరానికి ఒక ఎన్నికలు ప్రతి సంవత్సరం ఎన్నికలు జరపడానికి వీలులేకుండా యీ బిల్లు తెచ్చినందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను.

Sri T. RAMACHANDRA REDDI :—అధ్యక్షుమహాశయా, మంత్రి వర్యులుతెచ్చిన యీబిల్లును నేను సమర్థిస్తూ కొన్నిసూచనలుమాత్రం చేస్తున్నాను. రెండురోజులనుంచి యీ జిల్లాబోర్డులవ్యవహారంపై గౌరవసభ్యులు—అన్ని పక్షాల వారూ—చాలా తీవ్రంగా విమర్శలు చేస్తున్నారు. దీనినిబట్టే ప్రభుత్వంవారు జిల్లా బోర్డులు ఎంత అధ్వాన్నపరిస్థితిలో వున్నవో వారు గ్రహించుకోవచ్చు. అన్ని పక్షాల గౌరవసభ్యులుగూడా తీవ్రంగా విమర్శచేసేవారు ఉండనే ఉన్నారు. జిల్లా బోర్డులోని Special Officers యొక్క కాలపరిమితి మూడుదఫాలు పొడిగించారు. ఇంకా పొడిగించాలంటే చాలా శోచనీయంగాఉంటుంది. ప్రస్తుత జిల్లాబోర్డుల వ్యవహారం యీ శాసనసభ్యులకేం యితరులకేం అర్థంఅవుతూనే వున్నాయి. జిల్లా బోర్డు Special Officer లకు Persanal Assistents కు ఎంతగాచెప్పినా చెవిని పడడంలేదు. ఇటువంటి పరిస్థితులలో మరల జిల్లాబోర్డు Special Officer ల

Sri T. Ramachandra Reddi] [2nd December 1955

గడువు మరొకసంవత్సరం పొడిగించడం చాలా శోచనీయంగా వున్నది. కనుక మరల త్వరలో జనరలు ఎన్నికలు జిల్లాబోర్డులకుజరిపి మెంబర్ల ద్వారా President యొక్క పరిపాలనచేయిస్తే చాలా సవ్యముగా వుంటున్నది అని నాసలహా. కాని ప్రభుత్వంవారు 40 లక్షల రూపాయలు ఖర్చవుతుందని జంకుతూవున్నారు. ఇప్పటికి కోటానుకోట్ల రూపాయలు ఖర్చుపెడుచున్నారు. 40 లక్షలు ఖర్చుపెట్టడానికి Government ఎందుకు జంకుతున్నదో నాకు అర్థంకావడంలేదు. చేయకూడదనికూడా మనంచేస్తున్నాం. అటువంటప్పుడు మనం జిల్లాబోర్డుల ఎన్నికలకు 40 లక్షల రూపాయలు ఖర్చుపెట్టడానికి జంకడం చాలా శోచనీయంగా ఉన్నది.

SRI P. SUNDARAYYA :—Hear, hear.

SRI T. RAMACHANDRA REDDI :—ఇప్పటికైనా గౌరవసభ్యులందరూ వ్యతిరేకించే ఈ గడువులోపల త్వరలో ఎన్నికలు జరుపుతారని ఆశిస్తున్నాను.

ఈ బిల్లు మరొక సంవత్సరం పొడిగించినట్లైయితే 1957 లో జనరలు ఎన్నికలు రావచ్చును. పార్లమెంటు ఎన్నికలు అయినా రావచ్చును. మళ్లా ఈజిల్లాబోర్డులు స్పెషలు ఆఫీసరులగడవు పెంచమని అడుగవచ్చును. అటువంటిది చెయ్యకుండా ఉత్తరోత్తరా ఆరు మాసములలో ఎన్నికలుజరిపి ఏమైనాచేస్తే బాగాఉండును అని ప్రభుత్వానికి మీద్వారా విన్నవించుకుంటున్నాను.

SRI B. APPA RAO :—అధ్యక్షా, మంత్రిగారు తెచ్చినబిల్లును సమర్థిస్తూ జిల్లాబోర్డులను రద్దుచెయ్యమని కోరుచున్నాను. దానికి సభవారు అంగీకరించకపోవచ్చును. ఇతర రాజకీయపార్టీలవారుకూడా అంగీకరించకపోవచ్చును. ఈ నా అభిప్రాయాన్ని A. I. C. C. కి తీసుకుపోవడంకూడా జరిగింది. బాపూజీ బ్రతికి ఉండగా ఈ అభిప్రాయాన్ని తీసుకురావడం జరిగింది. ఈ రోజున కాంగ్రెసువాదులు కమ్యూనిస్టులు, ఇవి కావాలంటే, నేను అన్నది రాడికలుగా ఆలోచించవలెనని చెబుతున్నాను. వర్గరహిత సమాజముకావాలంటే స్వావలంబన విధానములో దేశములో అధికారము ప్రజలది అని మనము చాలా నినాదాలు చేసినాము. దేశములో బ్రహ్మాండమైనమార్పులు తలపెట్టి దేశఆర్థిక సాంఘిక స్వతంత్ర పోరాటములలో ముందుకుపోయినాము. ఇట్టి పరిస్థితులలో బ్రిటిషు సామ్రాజ్యవాదులు వారి అధికారము నిలబెట్టుకొనడానికి ఏర్పాటుచేసిన జిల్లాబోర్డులను రద్దు చెయ్యడానికి సాహసము ఉండవలెను. గ్రామాలలో సమస్త అధికారములు ప్రజల హస్తగతము

2nd December 1955] [Sri B. Appa Rao

చెయ్యడానికి విలేజిపంచాయితీలను ఏర్పాటు చెయ్యడానికి మనము శ్రద్ధవూనవలెను. అవసరమువస్తే రాష్ట్రప్రభుత్వానికి ఉన్నదనుకొన్న కొంత అధికారాన్నికూడ గ్రామస్థులకు గ్రామపంచాయితీలద్వారా ప్రజాపరంచేయాలి. అప్పుడే తమ కమ్యూనిస్టులను తొలగించడానికి ప్రజలు స్వయముగా ముందుకు రాగలరు. అందుచేత ప్రభుత్వం ఈ ఎన్నికలవాయిదా పొడిగించడం ఒక సంవత్సరానికే కాకుండా శాశ్వతముగా రద్దుచెయ్యమని కోరుచున్నాను. ప్రస్తుతము శాసనసభ నా సూచనను అంగీకరించదు. రాజకీయపార్టీల నాయకత్వము నిలబెట్టుకొనడానికి తమ వర్కర్లను సంతృప్తి పరచడానికి ఈ పొడిగింపు జరుగుచున్నది. విప్లవపార్టీలోనున్న కమ్యూనిస్టులుకూడా ఈ విషయము ఆలోచించుకోకుండా ప్రతిపంచాయితీబోర్డు మెంబరు షిప్పుకు తయారుగా ఉన్నారు. దానితోనే వారిపతనం ప్రారంభముఅయినది. పంచాయితీబోర్డులు స్థానిక సంస్థలలో గ్రూపులు ప్రారంభముఅయినవి. ఈనాడు నేను పార్టీ మెంబరుగా, పార్టీమాండేటు ప్రకారము ఈ బిల్లుకు ఓటుచెయ్యకతప్పదు. పార్టీ నాయకులు పదవీవ్యామోహం పెరగడానికి క్రమశిక్షణారహితమై నైతికపతనానికి దారితీయడానికి ఈ స్థానికసంస్థల ఎన్నికలే కారణం అని విస్మరించరాదు. ఏ ఉద్దేశముతో బ్రిటిషు సామ్రాజ్యవాదులు స్థానికసంస్థలనుపెట్టి పరిపాలనాధికారాన్ని నిలబెట్టుకొనుటకు ఉద్దేశించారో ఆ ఉద్దేశమును వారు సాధించుకున్నారు. స్థానికసంస్థల పరిపాలనద్వారా మనలో మనకు పార్టీలు, గ్రూపులు కల్పించారు. చిన్న చిన్న అధికారులుఇచ్చి మన ఉపయోగము పొందగలిగారు. సామ్రాజ్యవాదుల వరవడిలోనే మనము పోతున్నాము. అధికారాలను ప్రజల హస్తగతము చేస్తాము, వర్గరహిత సమాజంస్థాపిస్తాము అని చెప్పాము. గాంధిజీపేరు చెప్పుకుని Gandhism అనేపేరుతో, కేంద్రీకరణ Decentralization అనే సాకుతో దానిని సమర్థిస్తున్నాము. ఇది విచిత్రముగాఉంది. గ్రామపంచాయితీకి ఎక్కువ అధికారం యివ్వడం పనికిరాదా? అది వికేంద్రీకరణకాదా? స్వశక్తి పై ఆధారపడి స్వార్థచింతన దృష్టితో గ్రామాలలో రోడ్లు తదితర గ్రామాభ్యుదయ కార్యక్రమములు గ్రామస్థులు గ్రామపంచాయితీలద్వారా వేసుకోలేరా? భారతీయులను మనము నమ్మలేమా? గ్రామపంచాయితీలను మ్యునిసిపాలిటీలను మనము నమ్మలేమా? ప్రత్యేకముగా జిల్లాబోర్డులు ఉండవలెనా? రెండవ పంచవర్ష ప్రణాళికలో మనము కమ్యూనిటీ ప్రాజక్టు బ్లాకు డెవలపుమెంటులని పెట్టుకుంటున్నాము. 50% ప్రజలు ఖర్చుపెట్టుకుంటే పనులు చేస్తాము అంటున్నాము. ఇది దూబరా, అధికవ్యయం అనుకోవడముకూడా ఈ జిల్లాబోర్డులు అధికార వ్యామోహము కాకపోతే మరేమిటో వికేంద్రీకరణ విధానాన్ని, స్వావలంబన విధానాన్ని స్వయంపోషక విధానాన్ని

Sri B. Appa Rao] [2nd December 1955

గ్రామ అభ్యుదయాన్ని కాంక్షిస్తే మన చేతుల ఉండే అధికారాన్ని గ్రామాల పరం చెయ్యాలి. బాపూజీ ఆశయాలకు వారసులుఅయిన కాంగ్రెసుపార్టీ, ప్రభుత్వం ఈ ఆర్థిక సాంఘిక పోరాటములో అధికార వికేంద్రీకరణకు పూనుకోవాలని, డిపార్టుమెంటులను పెంచవద్దని విజ్ఞప్తిచేస్తూ, శాశ్వతముగా బోర్డులను రద్దు చెయ్యవలెనని మంత్రులను శాసనసభ్యులను విజ్ఞప్తి ద్వారా ప్రార్థన చేస్తూన్నాను; జైహింద్.

SRI E. NAGAYYA —అధ్యక్షమహాశయా, నేను ఈబిల్లును బలపరుస్తున్నాను. కాని కొన్నిసూచనలు యివ్వవలెనని నాఉద్దేశ్యము. 1952 సంవత్సరం నుండి District Board elections పెట్టకపోవడం యీ Special Officer లను from time to time పొడిగించడము సమంజసమైనదిగా నాకు కనబడలేదు. ఏదైనా కంప్లయింటుఉండి request చేస్తే మాకు ఎందుకయ్యా ఒకటిరెండు సంవత్సరాలుపోతే మీచేతికి వస్తుంది, అప్పుడు చేసుకోనండి అని చెబుతున్నాడు యీ Special Officer అలాకాకుండా వారికి శాశ్వతముగా ఇస్తే వారు భయముతో సరిగా పనిచేస్తారు. అప్పుడు మనకు సమాధానం సరిగారావచ్చును. అని నేను ఆశించుచున్నాను. ప్రస్తుతమువున్న అసెంబ్లీసభ్యులు మరికొందరిని నామినేటుచేసి, బోర్డును స్థాపించితే బాగుండును అని నేను అనుకున్నాను. అలాకాక ఇంకా సంవత్సరం పొడిగించితే ఇంకా చాలా అధ్వాన్నపుస్థితి ఏర్పడుతుంది. కొన్ని గ్రామాలలో పెట్టిన హాస్పిటల్సులో మందులు లేవు. కొన్నింటిలో డాక్టరు ఉండడు. Complaint చేస్తే వారు చెవిని పెట్టుకోలేదు. ప్రభుత్వంవారు సలహా సంఘాలను ఏర్పాటుచేసి special officer కు సహాయము చెయ్యవలెనని నేను మనవిచేస్తున్నాను.

SRI D. RAMABRAHMAM :—అధ్యక్షా, నేడు మనఅసెంబ్లీఎదుట ప్రభుత్వంవారు ప్రవేశపెట్టిన ఈ జిల్లాబోర్డులగడువు పొడిగింపును బలపరుస్తూ ప్రస్థతము మన రాష్ట్రమువచ్చిన తరువాత ఈ జిల్లాబోర్డు ఎన్నికలు జరగకుండా, కాల పరిమితిలేకుండా పొడిగించవలసిన కారణములు మనమందరము ఎరిగినవే. గత ప్రభుత్వం కొన్ని కారణములచేత పడిపోవడం జరిగింది. దానితరువాత గవర్నరు పరిపాలన రావడము మరల ఎన్నికలు జరపడము ఈ పరిస్థితులలో ప్రభుత్వము ఈ జిల్లాబోర్డు ఎన్నికలను జరిపించడము జరగలేదు. ప్రభుత్వం మళ్ళీ డిసెంబరు వరకు కాలపరిమితిని పొడిగించారు. మళ్ళీ సంవత్సరం కాలంపొడిగించమని కోరినారు. అందుచేత ఒక సంవత్సరము వాయిదావెయ్యాలని ప్రభుత్వ ఉద్దేశం కాదు.

2nd December 1955] [Sri D. Ramabrahmam

ఈ జిల్లాబోర్డులకు ఇప్పుడు ఆర్థికస్తోమతులేదు. జిల్లాబోర్డులను ఏరీతిగ ఎన్నికలు జరుపుకోవాలి. ప్రత్యక్షపు ఎన్నికలా, పరోక్షపు ఎన్నికలా ఏదిఅనే దానిని ఆలోచించడానికికూడ ప్రభుత్వంవారు ఒక నిర్ణయానికి రాలేక పోయినందున ఇపుడు గడువు పొడిగిస్తున్నారు. ఇప్పుడు ఏ జిల్లాబోర్డు చూచి నప్పటికీకూడ దానికి సరియైన ఆర్థికస్తోమతులేదు. ఎన్నికలుజరిపితే 40, 50 లక్షలు ఖర్చుకు కావలసిఉంటుంది. జిల్లాబోర్డులే ఆఖర్చు మొత్తాన్ని అంతాకూడ భరించవలసిన పరిస్థితులు ఉన్నవి. కాని దానికి ఆస్తోమతులేదు. అందువల్ల దీనిని పునరాలోచించి దీనికి ప్రభుత్వం యిచ్చుకోవలెనా అనేది ప్రభుత్వం ఆలోచించ వలసిన పరిస్థితులు వున్నవి. కాబట్టి ప్రభుత్వ ఆలోచనకోసం ఈగడువు పొడిగింపు జరిగింది. అయినప్పటికి ఇక్కడ ప్రభుత్వ పక్షమునవున్న సభ్యులందరుకూడ, ఎప్పటికికూడ special ఆఫీసర్లు ఉండాలి. వాండ్లపరిపాలన జరగాలి అని ఏ సభ్యునికి కూడలేదు. ఎన్నికలు జరపాలనే అందరికికూడ, ఇటువైపు సభ్యులకు, అటువైపు సభ్యులందరికికూడ ఉన్నప్పటికి ప్రభుత్వంలోను కాకుండా, స్థానికసంస్థలలో తగినటువంటి ఆర్థికస్తోమతు లేనందువల్ల ఈ పరోక్షపు ఎన్నికలుజరిపి, తాత్కాలికంగా కొన్నిరోజులవరకు ఈ జిల్లాబోర్డులను అన్నింటినికూడ మంచి ఆర్థికస్తోమతులు వచ్చినతర్వాత ప్రత్యక్ష ఎన్నికలకు మార్చుకొనుటకు మనసభకు అధికారంఉంటుంది. అట్లాగే ఇక్కడ ఈ జిల్లాబోర్డులు, కొందరు సభ్యులు సూచించినట్లు వుండవలెనా? దీనిని వికేంద్రీకరించి స్థానికసంస్థలకు, పంచాయతీ రాజ్యాలను స్థాపించవలెనా అని చెప్పి చాలామంది సభ్యులకు అనుమానము వచ్చింది. ఇపుడు జిల్లాబోర్డులు ఉన్నంత మాత్రంచేతకూడ ఉపయోగంలేదనిచెప్పి చాలామందికి అభిప్రాయం కూడ ఉంది. జిల్లాబోర్డులకంటెకూడ తాలూకాబోర్డులు నియమించి తాలూకా బోర్డులద్వారా పరిపాలనాజరిగితే అయాస్థానికంగాఉంటే ప్రదేశములలో ఇంకా కూడా ఎక్కువపని జరుగుటకు అవకాశం కలిగించినవారు అవుతారు. దానినికూడ ప్రభుత్వం దృష్టిలో ఉంచుకొని జిల్లాబోర్డులకు బదులు తాలూకాబోర్డులు నియమించవలెనని నేను సూచనచేస్తున్నాను. ఇపుడు జిల్లాబోర్డులు చేయవలసినటువంటి పరిపాలనకూడ ప్రభుత్వంవారే, High roads అన్నీ, High ways లో చేర్చుకొన్నారు. Secondary Education అంతాకూడా D.E.O. ల చేతికిపోయింది. ఏదో ఉన్నటువంటి Elementary Education పైననే పరిపాలనఉంది. Elementary Education మీద సరియైన పరిపాలన జరగాలంటే, దానిని సరియైన అజమాయిషీలో పెట్టవలెనంటే ఇపుడు ఉన్నటువంటి, పంచాయతీబోర్డులకు తగినటువంటి స్తోమతులేదు. అందుచేత తాలూకాబోర్డులు నియమించి, తాలూకా

బోర్డులద్వారా సౌకర్యములను ఎక్కువ కలుగచేయవలెను అని చెప్పి నేను ప్రభుత్వాన్ని కోరుతూఉన్నాను. కాక ఇపుడు single teacher schools అక్కడక్కడ ఎక్కువ చేస్తున్నాము. ఆ single teacher schools ఇపుడు ఉన్న Deputy Inspectors తగుమైన తనిఖీచేసి అక్కడ విద్యాబోధన సక్రమంగా జరుగుతుందా లేదాఅని చెప్పటానికి వీలులేని పరిస్థితులలో జరుగుతుంది. కాబట్టి వెంటనే కొన్నిమాసాల లోపలనే ఈ ఎన్నికలను ప్రత్యక్షంగానో పరోక్షంగానో జరిపించి వాటికి అన్నింటికి సరియైనవసతి కల్పించవలసినదిగ ఒకసూచన చేస్తూ ఇప్పుడు ప్రభుత్వంవారు ప్రవేశపెట్టిన గడువు తీర్మానాన్ని బలపరుస్తూ ఇంతటితో సెలవుతీసుకొంటూ ఉన్నాను.

Sri MAHAMMAD TAHSEEL :—అధ్యక్షా, తూర్పుగోదావరి జిల్లా agency ప్రాంతంలో రంప చోడవరం, ఎల్లవరం నూగూరు భద్రాచలం నాలుగు తాలూకాలు కలిపి ఒకే Agency District Board గా ఉంది. అయితే ఈ Agency District Board (ఎప్పటినుంచో చూస్తే) nominated District Board. మేము అనుకొనేది ఏమంటే, మిగతా రాష్ట్రములలో అన్నిచోట్ల ఎలక్షనులు పెట్టి, ఈ District Board లను ఎలక్షను ద్వారా మళ్లి తీసుకొని వచ్చినట్లయితే, అదే ప్రకారంగా అక్కడకూడ కొంత కాలానికి కాకపోయినా, కొంత కాలానికి ఐనా ఎలెక్షనులద్వారా అక్కడ District Board లు స్థాపింపుతారేమో అని మేము ఆశిస్తూ ఉన్నటువంటి సమయంలో ఇక్కడకూడ special ఆఫీసర్లను వేసి పరిపాలించడం అనేది చాలా విచారకరమైనటువంటి విషయం. ఎందుచేత నంటే అక్కడ ఉన్నటువంటి Agency District Board యొక్క ప్రెసిడెంటు, జిల్లా కలెక్టరు. దానిలో ఉండేది ఎక్కువ భాగము Badhrachalam R.D.O. Peddapuram R.D.O. Rajahmundry R.D.O. ఇతర బయటివాళ్లు జిల్లా కలెక్టరుకు ముఖ్యమైనటువంటి వారిని మాత్రమే వేశారుగాని, మిగతా వాండ్లను ఎవరినికూడ వాటిలో చేర్చక అది అంతాకూడ ఆఫీసర్ల పరిపాలన క్రిందనే ఇంత వరకూ సాగుతూ ఉన్నది. District Board ఉండడంవల్ల ఏ మాత్రంకూడ ప్రయోజనంలేదు. ఎందుచేత అంటే దానిలో ఉండేది అంతాకూడాను ఈ రివిన్యూ ఆఫీసర్లే. కాబట్టి వాండ్ల స్వంత ప్రయోజనాలకు దానిని ఉపయోగించుకుంటూ ఉన్నారు. లేకపోతే ఆ గ్రామాలలో District Board Schools ఉన్నాయి. ఆ schools నుంచి ఏదైనా ఒక petition గాని, ఏదో ఒక వ్యవహారం నిమిత్తం కాగితం వస్తే దానిని చూచేదిక్కు ఉండదు. ఎందుచేత అంటే అది తీగల స్కూలు మనం చూచినట్లయితే ఆ స్కూలులో రెండువందల పిల్లలు కనబడతారు.

2nd December 1955] [Sri Mahammad Tahseel

స్కూలుకు పైన కప్పులేదు. Buildings లేవు. దానినిగురించి ప్రభుత్వానికి ఎన్నో సార్లు వ్రాశారు. వ్రాసినప్పటికికూడ దాని విషయంలో ఏమి జోక్యం కలిగించుకోరు. నేను అప్పటికి వెళ్ళాను. పెద్ద వర్షం కురుస్తూంది. రెండువందల మంది పిల్లలు. Hall 94 మందికే సరిపోతుంది. అయితే వాండ్లు పడే అవస్థలను గురించి పూర్తిగా చెప్పడానికి అందనటువంటి పరిస్థితులు ఉన్నాయి. అదేకాకుండా కూనవరం hospital ఉంది. అది District Board Hospital. దానికి ఒక battery light కావలసివచ్చింది. Battery light మహా ఖరీదు చేస్తే ఎనిమిది రూపాయలు ఉంటుంది. District Board వాండ్లకు వ్రాసుకుంటే 4 రూపాయల service stamps ఖర్చు అయినవి, ఆ తర్వాత నే battery light రావడం జరిగింది. ఇట్టి పరిస్థితులలో అధికారుల చేతులలో పెట్టడం అనేది చాల అన్యాయం కాబట్టి, District board లను వెంటనే ఎలెక్షన్సుద్వారా పరిపాలన సాగించడం చాల ఉత్తమం. అదేవిధంగా ఈ ప్రదేశములలో పెట్టడం మూలంగా దానిని ఏ విధంగా నైతే చేస్తారో, అదేవిధంగా agency పరిపాలన సాగించినట్లయితే, agency ప్రజలయొక్క అభివృద్ధిని ఆకాంక్షించినవారు అవుతారు అని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను.

Mr. SPEAKER :—ఈ జిల్లా బోర్డు చట్టం agency కి apply కాదేమో ?

* SRI A. BAGAVANTH RAO :—అధ్యక్షా, ఆధునిక పరిస్థితులను అన్నింటిని దృష్టిలో ఉంచుకొని, మన ప్రజా స్వామ్యమంటే అర్థము చెప్పుకుంటూ ఉన్న ఈరోజులలో అసలు District Boards కాలపరిమితి పెంచాలి అనేదానిలో మనకు ఉన్నటువంటి issue మన శాసన సభ ముందరవున్నటువంటి, issue, ఒక చిన్నది మాత్రమే. District Board లు ఇప్పుడు special ఆఫీసర్ల పరిపాలన క్రింద ఉన్నవి. కాబట్టి వారి పరిపాలన ఒక సంవత్సరం పెంచాలా, లేక ఎలక్షనులు జరపాలా అనేది మాత్రమే simple issue. ఈ simple issue ని opposition party వారు సక్రమంగా అర్థం చేసుకోక, confusion of thought అనేదానికి దోహదం ఇచ్చినట్లు కనబడుతుంది. పోతే గవర్నమెంటు పార్టీ తరఫున లోపము లేక పోలేదు. ఇవి ఉంచాలాలేదా అనే దానిమీద, a sort of indecision on the part of the Government కనబడుతుంది. కాని అసలు ఈ District Board పరిపాలన, మంచి, చెడ్డ, ఈ democratic set up లో, District Board లు ఉండవలెనా లేక మరి abolish చేయాలా అనే సమస్యమీద సక్రమమైన అభిప్రాయాలు ఉన్నటుల కనబడుటలేదు.

Sri A. Bhagavantha Rao] [2nd December 1955

కాని అసలు District Boards పరిపాలన మంచి చెడు ఈ democratic set up లో ఈ District Boards ఉంచాలా లేక abolish చేయాలా అన్న సమస్యమీద సక్రమమైనటువంటి అభిప్రాయాలు వారికున్నట్లు కనబడడంలేదు. ఈ democratic set up లో District Boards అవసరమా లేదా అనేదానిని నేను ప్రశ్న వేస్తున్నాను. ఎందుచేతనంటే ఇప్పుడు district boards పరిపాలనలో ముఖ్యంగా ఉన్నది. రోడ్లు, Health, Education. ఇవి ముఖ్యమైన అవసరాలు. Health duel పరిపాలన క్రింద ఉంచితే బాగుండదనే దానిని గురించి మనం ఇప్పుడు గమనిస్తున్నాము. అయితే ప్రస్తుత పరిస్థితులలో తాలూకాలో ఉన్న Hospitals కూడా Government వారు తీసుకొంటారని ఒక scheme తయారు చేస్తున్నారు. ఇలా ప్రతిప్లానింగ్ లోను మనం ప్రతిదీ ఏ scheme పెట్టినా. Government take up చేసుకోవడానికి ఆధారంగా ఉండేటటువంటి schemes పెడుతున్నాము. ఈ రోజులలో ఈ చిన్న చిన్న బోర్డులు ప్రత్యేకంగా ఈ రస్తాలు బాగు చేయించే పని ప్రజారోగ్యాన్ని పరిశీలించవలసిన పని అచ్చంగా ఏమి కనబడడంలేదు. పోతే రోడ్లయొక్క పరిపాలన ఎలా ఉంది. ప్రజారోగ్య పరిపాలన ఎలాఉంది మనం పూర్తిగా గుర్తించవచ్చు. ఇక Secondary Education Elementary Education నిర్వర్తించాలనే దానిమీద opposition పార్టీవారు కూడా Secondary Education, Free and compulsory education ఉండాలని Text Books Government వారే అచ్చొత్తించాలని వారి పూర్తి అభిప్రాయం. ఈ Government వారు Secondary Education free and compulsory education గాని ఉన్నప్పుడు అవి District Boards నిర్వహించవలసిన అగత్యం లేనేలేదు. అట్లాంటప్పుడు అప్పుడు అసలు District Boards ఎందుకు ఉండాలని ప్రశ్నించవచ్చు. Vavilala Gopalakrishnaiah గారి లాంటివారు Elementary Education విధానాన్ని District Boards పరిపాలన క్రింద కాక ఒక జిల్లా Councils ద్వారా ఏర్పాటు చేయాలనే చెప్పినటువంటి వారుకూడా District Boards ఉండాలని చెప్పినట్లు తెలుస్తున్నది. అవిఇవి అన్నీకూడా confusion of thinking ఆధారంగా వున్నది గాని as a principle అసలు District Boards ఉండాలా లేదా అనేదానిని గురించి చెప్పినట్లు కనబడలేదు. అయితే District Boards పరిపాలనా కాలం పరిమితిని ఇప్పుడు ఒకసంవత్సరం పెంచాలంటున్నాము. లేక ఇప్పుడే ప్రత్యక్ష ఎన్నికల ద్వారా జరగాలనేదానిని కొంతమంది ప్రత్యక్ష ఎన్నికలద్వారా ఇప్పుడే జరపాలని ఆందోళనచేయడానికి కొన్ని ప్రత్యేక కారణాలు ఉన్నాయి. అయితే నేను అర్థం

2nd December 1955] [Sri A. Bhagavanta Rao

చేసుకోవటమే పొరపాటేమో ? Elementary Education District Board పరిపాలనక్రింద ఉండకూడదని మీరేచెప్పారు. మీ సిద్ధాంతంప్రకారం Secondary Education Government control క్రిందకు రావాలని compulsory free Education రావాలని మీరే చెప్తున్నారు. అయితే Elementary Education Secondary Education District Board పరిపాలనక్రింద ఉండకుండా roads ఏవైనాఉంటే High ways తీసుకోవలసి వచ్చినప్పుడు, ప్రజారోగ్యచట్టాలు ఏవైనావుంటే అవి state management చెయ్యాల్సి వచ్చినప్పుడు District Boards ఎందుకో నాకేమి అర్థంకావడంలేదు. Therefore అది confusion of thinking క్రింద నాకు అర్థమయింది గానిఅంతకంటే వేరేసిద్ధాంతం మాత్రం నాకర్థంకావడంలేదు. As a principle as a logical conclusion to your previous statements it must be said clearly that the district boards should be abolish అందుచేతనే ఇది సంవత్సరకాలం పొడిగించడం అన్నది administration inconvenience గా మాత్రం అర్థం చేసుకొని ఇది ఇంక మరొకసారి పొడిగించకుండా వీలులేనటువంటి పరిస్థితి Government మీద తీసుకోవలసిన బాధ్యత మనఅందరిమీద ఉన్నది. ఈలోపల అసలు District Boards ఉండాలా లేదాఅనే principle clear గా decide చేసుకోవలసిన అగత్యంకూడా ఉన్నది. ఈ విషయంలో నేను ఒకటిమాత్రంచెప్ప దలచుకొన్నాను. October ending నాటికి నేను ఒక notice ఇచ్చాను. District Boards abolish చేయాలనేటటువంటి అగత్యం ఉన్నదని Congress party లో తీర్మానం పెట్టవలసి వున్నది. అందుచేతనే ఈ principles సంవత్సరంకాలం వ్యవధికోరే యీ బిల్లుకి ఇంతసుదీర్ఘమైనటువంటి చర్చ ఏకో Government వారు పెట్టారుకదా మనం oppose చేసితీరాలనే సిద్ధాంతంమీద కాకుండా as a principle గా మీరు మాట్లాడవలసిందని opposition వారిని కోరుతూ సెలవు తీసుకొంటున్నాను.

SRIMATHI AMMANNA RAJA :—అధ్యక్షా, ఇప్పుడు జిల్లా బోర్డులు ఎన్నికలు జరగాలి. జరగడానికి ఇంకా సంవత్సరంవరకుకూడా వీలులేదు. దానికి శాసనసభ్యులు ఉండాలా, పంచాయతీబోర్డుల elections జరగాలా లేకపోతే ప్రత్యక్షంగా ఎన్నికజరగాలా అనేవిషయాలు చర్చించాము. దానికి సరైనసమాధానం రాలేకపోయింది. ఇప్పుడున్న Special Officers కు ఇంకా ఒక సంవత్సరం గడువు పొడిగించాలనే మనకు తప్పింది కాదు. తప్పు మనదే నేమో. Assembly members మనం రాష్ట్రపరిపాలనఅంతా మనమీద పెడితే ఫరవాలేదు, వారు

Srimathi C. Ammanna Raja] [2nd December 1955

మనలనునమ్మి ఇక్కడికి పంపించారు. దానికి సమర్థులము. జిల్లాబోర్డులు పెడితే అందులోకూడా మనమే తయారా. మనలో మనకే ఒకరిమీద ఒకరికి నమ్మకములేదు. అది కొంత మనలోపమే అనుకొంటా. అందుచేత అది తీసివేశారు. అంటే ఎవరో ఏదో అనుకుంటారని కాదు. ఎవరేది అనుకొంటే మనకే. ప్రస్తుతం మనం దేశానికి సేవ చేయడానికి వచ్చాము ? ఇప్పుడు ప్రస్తుతం Elections జరగడానికి వీలులేదు. Policy ఏమిటి? పంచాయితీబోర్డు ఎన్నికలు జరగాలి అని. Indirect elections జరగాలి అని. పంచాయతీబోర్డు జరగలేదు కాబట్టి ప్రస్తుతం dircet elections పెట్టుకోవడం ప్రయోజనాలలో ఒకటి. ఒక సంవత్సరం 2 సంవత్సరాలు గడువు ఉంటుంది. న్యాయంగా Government కు ఈ పరిస్థితులలో సహాయపడి దేశానికి సహాయపడి మనమందరం ఆ బాధ్యత సేకరించవలసి ఉంటుంది. కాబట్టి మనమందరం ఒప్పుకున్నట్లయితే నిజంగా చాలా బాగుంటుంది. ఎందుకంటె Special officer గా ఒకకలెక్టరుఉంటే ఇన్నివందల గ్రామాలనుచూచి ఎక్కడెక్కడ ఏ కష్టాలుఉన్నయో ఏది చెయ్యాలో తెలుసుకొనడం కష్టం. జరగడంలేదుకూడా మనకూ అనుభవమే అది. ముఖ్యంగా ఇదివరకు నేను Urban constituenciesలో ఉండేదానిని ఇప్పుడు పట్టిపల్లెటూరి Constituencies లో ఉన్నాను అక్కడ ఆ బాధలన్నీ తెలుసుకొన్న తరువాత ఈ అవకాశము వచ్చినట్లయితే కొంతైనా సరే మనం దానిని వృద్ధిలోకి తీసుకురావడానికి ఉపయోగపడతామేమోనని నిజంగా సంతోషించాను. 18, 20 ఏండ్ల రాజకీయాలలో ఉండీకూడా ఎన్నడు District Board Member కావాలనినేను అనుకోలేదు. అయితే ఆశపడుతున్నాను అని అనుకొనేవాళ్లు అనుకొంటే నాకేమి అభ్యంతరంలేదు. District Board member ఒక గౌరవం. ఇంతకన్న ఏమికావాలి అని కాకుండా ఈ బాధ్యత ఈ భారంకూడా మనమే వహించి కొంతవరకు గ్రామాలను అభివృద్ధిలోకి తీసుకు రాగలమని సంతోషించిన వాళ్లలో నేను ఒకదానిని. కానిజరగలేదు అనుకోండి. ఇప్పుడు ఇది తప్పనిసరి అయింది. ఒక సంవత్సరం అన్నారు. ఒక సంవత్సరం కాకపోతే మంచి పరిస్థితులు ఏర్పడినట్లయితే త్వరలోనే ఎదో విధమైన Elections ఒకవేళ పెట్టితే పెట్టవచ్చు. ప్రస్తుతం ఒకసంవత్సరానికి అనితీసుకొంటున్నాము. జిల్లాబోర్డులు సాధారణంగా నిర్వహించే విషయాలు Roads Hospitals, Schools మా జిల్లా నుంచి ఒకమంత్రిగా ఎన్నికైవచ్చి ఎన్నాళ్ళయిందో ? ఎప్పుడైనా ఉన్నరో లేదో కూడా నాకు తెలియదు. ఉండేవాళ్లు పక్షపాతం చేస్తారని కాదు. సాక్షాత్తుగా కష్టాలుచూచి ,ఐనా రవ్వంత అభివృద్ధి అయిఉండేదేమో ! ముఖ్యంగా తణుకు తాలూకాకు వెళ్ళి చూస్తే 10 సంవత్సరాలు అయిందేమో రోడ్లముఖం చూచి -

అనిపిస్తుంది. పట్టి గుంటలు ఎంతదూరము పోయినా అన్ని main roads ఆవిధంగా ఉంటాయి. రోడ్లన్నికూడా గ్రామానికి, గ్రామానికి మధ్యను అసలు పోనటువంటి కలెక్టరుగారు ఉన్నారు. ఎదో Assembly members గా ఉన్నాము కదా, మొత్తంమీద జిల్లానుంచివచ్చిన Members అందరము ఒకసలహా సంఘంగా ఏర్పడితే, మా కష్టసుఖాలుచెప్పి ఏమైనా చేయించుకొందామని అనుకొంటున్నారు. కొంతమంది అది M. L. A ల Dignity కి లోపం, కలెక్టరుకు సలహా సంఘం ఏమిటి అంటున్నారు. Dignity of labourలో మన మనస్సులో ఉండాలికాని దేశానికి ఉపయోగపడి తాము అనుకొన్నప్పుడు ప్రతిపనికి తయారుగానే ఉండాలి. ఇప్పుడు కొన్నిచోట్ల Bridgeలు కూడా పడిపోయినాయి. గ్రామాలలో వాటిని చూచేవారుకూడా లేరు. Repair లేకపోయినందువల్ల వర్షాలకు అవి పడిపోయినాయి. ఏ ఒక్క గ్రామానికిని రాకపోకలుకూడాలేవు. ఇటువంటి పరిస్థితులలో Collector గారు ఏమిచెయాలి ? వారికి కావలసినన్ని పనులు ఉన్నాయి. అన్నీ చూడడానికి వీలులేదు.

అటువంటప్పుడు ఈ సలహాసంఘాలైనా ఏర్పాటు చేసినట్లయితే, వారిముందు అందరు చెప్పుకోవచ్చు. రహస్యంగా ఒకరువెళ్ళి ఏదైనా represent చేసినట్లయితే, అది నమ్మతగినదా, లేక నమ్మతగనిదా అనే అనుమానమురావచ్చు. అందుచేత ఈ విధంగా సలహాసంఘాలు ఏర్పాటుచేసినట్టయితే, ఈ రోడ్లవిషయము ఇంకా జిల్లాలో ముఖ్యమైన విషయాలగురించి, ఎక్కడ ఎవరికి ఏ సదుపాయాలు కావాలో ఎక్కడ bridges కట్టాలో, ఎక్కడ hospitals ఏర్పాటుచేయాలో ఇవన్నీ చెప్పుకోడానికి, పరిశీలించడానికి అనుకూలంగాఉంటుంది. ఇక Hospitals సంగతి చెప్పనే అక్కరలేదు. అవి నడుస్తున్నాయో లేదో చెప్పడానికి కాకుండాఉన్నది. పైగా lady doctors గ్రామాలకు వెళ్ళడంలేదు అంటారు. గ్రామాలలో వాళ్ళకు ఏ సౌకర్యముందని వెళ్లమంటారు ? ఈ పరిస్థితులలో స్త్రీలనుకూడ ప్రత్యేకంగా sacrifice చేయమంటారు. ఎందుకో నాకు తెలియడంలేదు. వాళ్లకు కావలసిన సదుపాయాలు చేయడంలేదు కాని, వీళ్లుమాత్రము గ్రామాలకుపోయి పని చేయాలి. ఎలాచేస్తారు, ఒకసౌకర్యముకూడ లేకుండా ? కాబట్టి రోడ్లు బాగుచేసిననాడు గ్రామాలలో పరిస్థితులు బాగుచేసిననాడు ఎవరినైనా గ్రామాలకు పొమ్మంటే పోగలరుగాని, ఇప్పుడున్నటువంటి పరిస్థితులలో సాధ్యంగాదు. గ్రామాలలో నామకః స్కూళ్లు ఉన్నప్పటికీ, వాటి inspection అసలే జరుగదు. ఏలాటి సౌకర్యంలేకుండా ఎవరువెళ్లుతారు ? చంద్రమౌళిగారు ఒకపర్యాయము మా నియోజకవర్గమునకు ఎంతోకష్టపడి వచ్చారు. వచ్చినతరువాత, మరల అక్కడనుంచి ఏలాగు బయటపడతాము, అనే అనుమానం కలిగింది. పరిస్థితులు యీవిధంగా

ఉండగా, మూడేళ్లనుంచి జిల్లాబోర్డులు జరుగకపోయినందున మూడులక్షల రూపాయలు అప్పుతీర్చారట, ఎవరికికావాలి అప్పుతీర్చేవిషయము ? గ్రామాలు బాగుపడాలి. ప్రజలు బాగుపడాలి. అంతేగాని, ఏదో అప్పులుతీరాయి, balance మిగిలింది, special గా ఉన్నాముఅని సంతోషిస్తే ప్రయోజనంలేదు. జరగవలసినకార్యాలు జరగాలి. అందుచేత ఏదో ఇప్పుడు special officers యొక్క గడువు పొడిగించినప్పటికీ, ఏదోవిధముగా కొంతవరకు జరగవలసిన పనులుకూడ జరిగినట్లయితే, కొంతవరకైనా సంతోషమే. అయ్యపురెడ్డిగారు చెప్పారు. వీటికి ఎన్నికలు పెట్టనందువల్ల 40 లక్షల రూపాయలు మిగిలినాయి కాబట్టి, అది జిల్లాలన్నిటికి పంచిపెట్టినట్లయిన, కొంతవరకైన అభివృద్ధిసౌకర్యములు జరుగుతాయేమోనని, ఉద్దేశ్యం. ఈ 40 లక్షలు ఎప్పుడైన ఖర్చుపెట్టవలసే యుంటుందనుకోండి. ఎప్పుడైన election పెట్టవలసిందే. అయినా, జిల్లాబోర్డుపరిపాలన జరగడంలేదు కాబట్టి, గ్రామస్థులు చాలాఅవస్థలు పడుతున్నారు కాబట్టి, కొన్ని ముఖ్యమైన విషయములకు, కొంతవరకైన ఖర్చుపెట్టవలసి యుంటుంది. ఆ విధంగా చేయాలని సలహాయిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI P. SATYANARAYANA :—అధ్యక్షా, ఈ జిల్లాబోర్డుల విషయంలో కేవలం సిద్ధాంతదృక్పథాన్ని తీసుకొన్నారు. అయితే ఆచరణయోగ్యమైనటువంటి, సాధ్యమైనటువంటి ధోరణిలో ప్రతిపక్షమేమి ఆలోచించడంలేదు అని కొందరు మిత్రులు మాత్రము ఆరోపణచేశారు. వారికి సమాధానం ఆ పక్షమునుంచే చాలామంది చెప్పినారు. కాని మా అనుభవములో ఉండేటటువంటివికూడ ఒకటి రెండు విషయాలు మనవిచేస్తున్నాను. సుమారు ఒకవారమురోజులక్రిందట ఏదో సందర్భములో మన ఉపముఖ్యమంత్రిగారు మాట్లాడుతూ జిల్లాబోర్డురోడ్లు ఎంత పాడయినాయి అంటె routes తీసుకొన్నటువంటి బస్సులుకూడ ఆపివేయవలసి వచ్చిందని చెప్పారు. మా నియోజకవర్గంలో ఈమధ్యన కొన్నిప్రాంతాలకు వెళ్ళవలసియుంటే, జటకాబండి మాట్లాడితే ఆరోడ్డు పాడైపోయింది, నేను రానన్నాడు జటకా అతను. ఏమయ్యా రెండుమాసాలక్రితము నీవే బండికట్టావుగదా, అంటే, అప్పుడే చాలా బాధపడ్డాను, ఇక కట్టడానికి వల్లకాదు, అన్నాడు. ఆ తరువాత ఒంటెద్దుబండి మాట్లాడితే, అతడుకూడ అంగీకరించలేదు. Community project area లోనే పరిస్థితులు ఇంత అధ్వాన్నంగాఉంటే, మిగిలినప్రాంతాల్లో ఏవిధంగా ఉంటాయో చెప్ప నవసరంలేదు. ఇది కేవలం సిద్ధాంతదృష్టితో మేముచూసేటటువంటి విధానమేకాదు. ఇప్పుడు అనేకచోట్ల అనేకలక్షలు రూపాయలు ఖర్చుపెట్టిరోడ్లువేసి, వాటికి సరియైన maintenance లేకుండా విడిచిపెట్టడంవలన, అవిపాడైపోయి రాకపోకలకు చాలాకష్టంగాఉన్నది. 6 మైళ్లు, 8మైళ్లు hospitalకు గర్భిణిస్త్రీలు

పోవలసియుంటే, రోడ్లు ఉండికూడ బండ్లు కట్టుకోలేక మంచాలకు అటు యిటు కర్రలుకట్టి కావడివలె మోసుకుపోతూ అవస్థపడుతున్నారు. ఇప్పుడుపరిస్థితులు అంత అధ్వాన్న స్థితిలో ఉన్నాయి. అంతేకాకుండా కొన్ని స్కూళ్ళ విషయంలోకూడ ఇబ్బందులు వస్తున్నాయి. ఉదాహరణకు, ఉప్పాడ అనేటటువంటి గ్రామంలో ఒక High School ఉన్నది. దానిలో పరిశ్రమలకు సంబంధించినది అనగా తకలీ రాట్నం వడకడం నేతపని మొదలగు వాటికి సంబంధించినది ఒక Section ప్రారంభించవలెనని అన్నప్పుడు మేము కొంతమంది కలసి ఇది కేవలం తద్దినం పెట్టినట్లుగా ఉండకూడదు, అందులో తర్ఫీదు పొందిన విద్యార్థులు, ఆ చుట్టు ప్రక్కల గ్రామాలకు ఉపయోగపడే పద్ధతిలో స్థాపించితే బాగుంటుందని, అది కేవలము ఒక stereo-typed గా ఉండకూడదని మేము ఒక scheme ఇచ్చి మాట్లాడితే, District Board కు funds లేవు, అదేకాదు, ఏ మాత్రపు స్వల్పమైన మార్పుచేయడానికి కూడ వల్లకాదు, రేపోమాపో జిల్లా బోర్డులు రాబోతాయి, వచ్చిన తరువాత చూచుకోవచ్చును, ఇప్పుడేమి చేయడానికి వీలులేదు అని Special Officer తప్పించుకొన్నారు. అప్పటినుంచి ఇప్పటివరకుకూడ విద్యార్థులకు ఆ పరిశ్రమలకు సంబంధించిన విద్యను గరపకుండానే జరుగుతున్నది. పంచాయితీ బోర్డులకుకూడ దీనివల్ల చాలా ఇబ్బంది కలుగుచున్నది. సామర్లకోట ఇంచుమించుగా ఒక మునిసిపాలిటీ అనడానికి తగినటువంటి హోదా కలిగినటువంటి పట్టణము. అక్కడ ఒక market ఉన్నది. దానికి 10 వేల రూపాయలు ఆదాయం వచ్చేటటువంటి తాహతు ఉన్నప్పటికికూడ ఏదో కమ్మకక్కతో వేలములో 4 వేలకు, 3 వేలకు పాట కొట్టేసుకొంటున్నారు. ఆ గ్రామ విస్తృతాన్ని బట్టి market చాలక మరొక market తనంతట అది ఏర్పడింది. ఈ సందర్భంలో మేమంతా Special Officer దగ్గరకు రాయబారము వెళ్ళాము. ఈ market మా చేతిలో ఉన్నది. మీరు కొత్తగా మార్కెటుకట్టి అదీ, ఇదీ జాగ్రత్తగా చూసిన బాగుంటుంది, జనాభాను బట్టి రెండు అవసరము లేదా పాత market మాకు ఇచ్చినాసరే, దానివల్ల 10 వేలు రూపాయలు సంపాదించడానికి అవకాశమున్నది, అయినా మీకు నాలుగు వేలకంటే ఎక్కువ రావడంలేదు, అని చెప్పాము. దానికి మేము ఏమి చేయము! మాకు ఉన్న ఆదాయమిది. ఉన్నదికూడ వదలు కొమ్మంటారా అని అన్నారు. రెండవ మార్కెటుకు డబ్బులేదంటాడు. అక్కడ రెండు మార్కెట్లు లేకపోతే చాలా ఇబ్బందిగా ఉంటుంది. కేవలం అభివృద్ధికి అంతాకూడ నిరోధకం అవుతుంది. ఆవిధంగా పంచాయితీ బోర్డులకుకూడ ఇబ్బందిగానే ఉంటున్నది.

Sri P. Satyanarayana] [2nd December 1955.

అంతేకాకుండా తూర్పుగోదావరి జిల్లాలో ఒక బ్రహ్మాండమైనటువంటి సంత ఉన్నది. సంవత్సరానికి ఆరుకోట్లు అమ్మకం అయ్యేటటువంటిదది. ఆంధ్ర దేశంలో అంత పెద్ద సంత ఎక్కడకూడా లేదు. అక్కడకు వచ్చేటటువంటి లక్షలాది ప్రజలు ఎన్నో ఇబ్బందులు, బాధలు పడుతూఉంటే, దాన్ని అభివృద్ధి చేయడానికి ఒక పథకము ఇచ్చి దానిని దశలువారిగా అమలు జరుపమని Special Officer దగ్గరకు వెళ్ళి చెప్పితే, అందుకు డబ్బులేదని సమాధానమిచ్చారు. సంతలన్నీ వారిచేతులలో ఉండడంవల్ల, పంచాయితీ బోర్డు లకువ్యాపారస్థులకు ప్రజలకు అందరికి ఇబ్బందిగా ఉంటున్నది. జిల్లా బోర్డుల పరిస్థితులు నేడీవిధంగా ఉన్నాయి. కనుక కేవలము సిద్ధాంత దృష్టితోనే మేము దీనిని తీసుకోవడంలేదనిన్ని వాస్తవం జీవితంలోకూడ అనేక ఇబ్బందులు పడడంవల్లనే District Boards త్వరగా రావాలని కోరుతున్నామనిన్ని వారు గమనించవలసియున్నది. అంతేకాకుండా జిల్లా బోర్డులు ఉండాలా అక్కరలేదా అనేటటువంటి విషయంలో ప్రతిపక్ష సభ్యులకు స్పష్టమైనటువంటి అభిప్రాయాలు లేవు అనిఇంకొక ఆరోపణచేశారు. కాని మేము మాత్రము మొట్టమొదటినుంచి చెప్పుతూనే ఉన్నాము. గ్రామమనేటటువంటిది సమాజములో ఒక ప్రాతిపదికగా ఆ level లో ఒక బోర్డు ఉండి తీరవలసిందే. పంచాయితీ బోర్డు అనేది ఒక పరిపాలనా సంస్థ. తరువాత State level లో రాష్ట్రం మొత్తంమీద, మరొకటి ఉండవలసిందే. ఈ గ్రామాలన్నిటినికూడ manage చేయడానికి దానికి సావకాశముండదు. అందుచేత state level కున్ను, గ్రామ level కున్ను మధ్య మరొక స్థాయిలో ఒక జిల్లా బోర్డు అనేటటువంటిది ఉండి తీరవలెననేటటువంటి విషయములో ప్రతి పక్షమునకు ఏలాంటి సందేహములేదు.

దీని విషయములో మేము ఎప్పుడుగూడ కాదు అని చెప్పలేదు. అలాంటి అభిప్రాయము వారికి ఎందువల్ల కలిగిందో నాకు అర్థంకావటంలేదు.

మరొక విషయం వున్నది. నలభైలక్షలు ఖర్చుఅవుతుందికదా, యిదిఅంతా వృధాకాదా అని కొంతమంది యివ్వాళఅన్నారు. దానికి చాలమటుకు మనమిత్రులు గోపాలకృష్ణయ్యగారు సమాధానము చెప్పారు. ప్రజాస్వామికముఅంటేనే అసలు చాలాభాగము ఖర్చుతోకూడుకున్నటువంటిది అనిగూడ అన్నారు. ఒకవైపున ఖర్చు పెరుగుతూవుంటే, మరొకవైపున చైతన్యము బాధ్యతగా ఆలోచించడము, యిది అంతాగూడా పెరుగుతూనే వుంటుంది. అందుచే యీ నలభైలక్షలుఖర్చుకోసం మనము దీనిని వెనుదీయటానికి వీలులేదు. అంతేకాకుండా యిప్పటికి రెండు, మూడు శతాబ్దాలనుంచి ప్రజాస్వామ్యము ప్రపంచములో అనేకదేశాలలో అమలులోవుంది.

2nd December 1955] [Sri P. Satyanarayana

అక్కడ కేవలము జిల్లాబోర్డునుమాత్రమే కాదు. జిల్లాపరిపాలనాధికారిగూడ Elections లో వస్తున్నాడు. జిల్లాజడ్జీ Elections ద్వారా వస్తున్నాడు. తాలూకాలోగూడ అయన Elections ద్వార వస్తున్నాడు. అందుచేత మనకన్న రెండు శతాబ్దాల ముందునుంచి ప్రజాస్వామ్య వ్యవస్థ అమలు పరచుకునివుంటున్న ప్రాశ్చాత్య దేశాలలో యీ పద్ధతి వుంటూవుండగా, బహుశ మనముకూడ కొద్దిరోజులలో ఆ స్థాయికి పోవలసినప్పుడు యిప్పుడు మనము నలభైలక్షల రూపాయల ఖర్చుకోసము వెనుదీయడమనేది సబబుగాలేదని, అవసరములేదని నేను మనవి చేస్తున్నాను.

SRI V. KURMAYYA :—అధ్యక్షా, జిల్లాబోర్డుల పరిపాలన మరల ఒక సంవత్సరంపాటు జిల్లాకలెక్టరుకు అప్పజెప్పడం చాలా శోచనీయమైన విషయం అని నా ఉద్దేశ్యము. ఈ బోర్డుల పరిపాలన యిప్పటికి మూడు సంవత్సరములనుంచి సంవత్సరమున కొకపర్యాయము పొడిగిస్తూ, జిల్లాకలెక్టర్ల చేతులలో పెట్టటానికి ప్రజాప్రభుత్వము ఎందుకు పూనుకుంటున్నదో నాకు అర్థము కావడంలేదు. గత అరవై సంవర్సరాలనుండి బ్రిటిషువారు పరిపాలన చేస్తున్నప్పుడు ప్రజలను బానిసలుగాచేసి, ప్రజల అభిప్రాయాలను ఎదిరించి బ్రిటిష్‌వారికి సహాయముచేస్తున్న ఉద్యోగస్థుల చేతులలో, బాధలుపడి బ్రిటిష్‌వారిని ఎదిరించి స్వాతంత్ర్యము సంపాదించిన కాంగ్రెసుపార్టీ నేటిరోజుల ప్రజాపరిపాలనచేస్తున్నది. అటువంటి కాంగ్రెసు ప్రభుత్వము తిరిగి ఆనాటి బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని బలపరుస్తూవుండిన ఉద్యోగస్థుల చేతులలోకి పెట్టటానికి నిర్ణయించడమనేది చాలా విచారకరము. ఈ విధంగా చేయడమువల్ల ప్రజాప్రభుత్వము సాగకుండా పోతున్నదని చెబుతున్నాను. ఈనాడు కాంగ్రెసు ప్రభుత్వముక్రింద పనిచేస్తున్న బ్రిటిసు సామ్రాజ్యవాదులయొక్క మనస్సులు యిప్పటికినీ మారలేదని మనకందరికినీ తెలుసు. వారియొక్క మనస్సులు యింకనూ మారలేదని. యిప్పుడు మధ్యప్రదేశ్ గవర్నరుగావున్న పట్టాభిశీతారామయ్యగారు అనేకసార్లు చెప్పియున్నారు. మనము యీనాడు స్వరాజ్యము సంపాదించుకొని ప్రజాప్రభుత్వము అమలులో పెట్టుకున్నాము. స్వరాజ్యమువచ్చి కాంగ్రెసుపార్టీ ప్రజాపరిపాలన సాగిస్తున్నప్పటికినీ బ్రిటిష్‌వారి హయాములోవున్న పాతపద్ధతులలో మార్పుతీసుకొనిరాలేదు. ఇది ఎట్లావున్నదంటే కొత్త ఇంజనులను వేసుకున్నామేగాని, అవి యింకను పాతపెట్టెలను లాగుచున్నవని అన్నారు. ఈ క్రొత్త ఇంజనులు పాతపెట్టెలను లాగుతూవుంటే అవి లోటలోట ధ్వని చెస్తూ పోతూవుంటే, అందులో ప్రయాణముచేసే ప్రయాణీకులకు అనేక విధములుగా దెబ్బలు తగులుతూవున్నవి. అదేవిధంగా ప్రజాసంస్థలను తిరిగి ఆ పాత ఉద్యోగస్థుల చేతులకు అప్పజెప్పటమనేది చాలా విచారకరముగావున్నది. నలభై

Sri V. Kurmayya] [2nd December 1955

లక్షలరూపాయల ఖర్చుకోసం ముఖ్యమంత్రిగారు జిల్లాబోర్డుల ఎలెక్షనులు జరప కుండా ఆపడం ఎందుకు అని సూటిగా నేను ప్రశ్నించుచున్నాను. మనకు ప్రజా పరిపాలన కావాలని అంటున్నప్పుడు, యీ కొద్దిపాటి ఖర్చుకొరకు, అది లేకుండా చేయడము సబబేనా అని అడుగుచున్నాను. డబ్బుఖర్చుఅవుతుందని, యీనాడు జిల్లాబోర్డుల ఎన్నికలు ఆపుజేసినప్పుడు, రేపు అసెంబ్లీసభ్యుల ఎన్నికలుగూడ ఆపు జేసి, గవర్నరు పరిపాలన ఏ కొద్దిమంది Advisers తోనో ఎందుకు సాగించ నివ్వకూడదు? ఎన్నికలు కావాలనిచెప్పేది యిప్పుడు కాంగ్రెసుపార్టీ కాదు, కమ్యూనిస్టు పార్టీ కాదు, సోషలిస్టుపార్టీ కాదు, యింక యే యితరపార్టీగూడకాదు. ప్రజలే కోరుతున్నారు. ప్రజాప్రభుత్వములో జిల్లాబోర్డుల పరిపాలన ప్రజలే సాగించ వలెనని కోరుతున్నప్పుడు, ప్రజలకోరిక ఎందుకు నెరవేర్చకూడదని ప్రభుత్వాన్ని అడుగుతున్నాను. ఒక పర్యాయము గ్రామాలకువెళ్ళి, ప్రజల అభిప్రాయము ఏ విధంగా వున్నదో చూడమని మంత్రివర్గాన్ని కోరుతున్నాను. ప్రజలకు తమ ఓట్లు సక్రమంగా వినియోగించుకోటానికిగల హక్కును నిరర్థకముగా చేసేపనులను నేను అంగీకరించను. ప్రజాప్రతినిధులముగా ప్రజలచేత ఎన్నుకోబడి, తిరిగి మేము గ్రామాలకువెళ్ళినప్పుడు జిల్లాబోర్డు ఎన్నికలు యిప్పటికి మూడు సంవత్సరాలుగా ఎందువల్ల జరపడములేదని ప్రశ్నిస్తూవుంటే, మేము వారికి జవాబుచెప్పలేక పోతూ న్నాము. కాంగ్రెసుప్రభుత్వము ఏర్పడినతరువాతగూడ Decentralization కావాలని కోరుతున్నప్పుడు మరల Centralization నే అమలులో పెట్టటానికి కాంగ్రెసు ప్రభుత్వం ప్రయత్నించడము సబబుగాలేదు. జిల్లాబోర్డుల ఎన్నికలు జరిపితే, కాంగ్రెసుపార్టీ ఎన్నికలలో గెలిచిరాలేమని భయపడ నవసరములేదు. ప్రజలు కాంగ్రెసుపార్టీ యే అధికారములో వుండాలని వాంఛిస్తున్నారు. కాంగ్రెసు పార్టీయే గెలుస్తుందని నేను security య్వివగలను, యిస్తున్నాను. ఇదివరలో స్థానికసంస్థలకు సంబంధించిన చట్టాన్ని ప్యాసుచేయించిన మంత్రి శ్రీ చంద్రమౌళిగారు యిక్కడనే ఉన్నారు. ప్రకాశం పంతులుగారి హయాములో స్థానిక సంస్థలకు మంత్రిగాఉన్న తిమ్మారెడ్డిగారు ఏదో ఉద్దేశ్యము మనస్సులోపెట్టుకుని, పంచాయతీ బోర్డులకు indirect ఎన్నికలు జరుపుతామని చెప్పినదాన్ని, యీనాటి ప్రభుత్వము ఆవిధంగా indirect elections ఎందువల్ల జరపకూడదు? ప్రజలకు భయ పడేనా? లేకపోతే మనకు ఓట్లురావనా? ప్రజలు కాంగ్రెసుపార్టీని బలపరచ రనా? కాబట్టి నేను ఒకటేపద్ధతి చెబుతున్నాను.

MR. SPEAKER :—Indirect or direct elections అనేవిషయము యిప్పుడు యీ సభముందులేదు.

2nd December 1955]

SRI V. KURMAYYA :—లేదుతెండి. పంచాయతీ బోర్డులకు యిదివరకు indirect elections పెట్టుతామని గతప్రభుత్వం చెప్పింది. ఈబిల్లు యొక్క objects and reasons లో పంచాయతీ బోర్డులకు indirect elections పెట్టవలెనా, లేకపోతే direct elections పెట్టవలెనా లేకపోతే యేదిపెట్టాలి అనేది చెప్పలేదు. Indirect elections పెట్టడముఅనేది ప్రభుత్వానికి చేతకాకనా ? లేకపోతే, అవిపెట్టితే, ప్రజలు facists గా తిరిగిపోతారనా ? ఎన్నికలు జరపకుండా యిప్పటికి మూడుసంవత్సరాలుగా term of office extend చేస్తూవస్తున్నారు, ప్రభుత్వం. ఈవిధంగా ప్రభుత్వం చేయడంవల్ల పంచాయతీ బోర్డులకుగాని, జిల్లాబోర్డులకుగాని ఎన్నికలు జరుగవుఅని బోధపడుతున్నది. జిల్లాబోర్డులకు యీసారిగూడ ఎన్నికలు జరపకుండా తిరిగి ఒకసంవత్సరానికి term extend చేస్తూ పరిపాలన అధికార్లచేతులలోనే continue చేయబోతున్నారు. మరల వచ్చేసంవత్సరమునాటికి, విశాలాంధ్ర ఏర్పాటుకానున్నది. అప్పుడుగూడ విశాలాంధ్ర కొత్తగా ఏర్పడ్డది. పరిస్థితులు పరిశీలించాలనిచెప్పి, మరల term extend చేయటానికి అవకాశములు వుండేటట్లు కనబడుతున్నది. అప్పుడుగూడ ఎన్నికల ఏర్పాటు జరగదని నా అభిప్రాయము. ఈ విధంగా ఎన్ని సంవత్సరములు యీ జిల్లాబోర్డుల ఎన్నికలు జరపకుండా, ప్రజాపరిపాలన లేకుండా చూస్తారు ? జిల్లాబోర్డుల పరిపాలన special officers చేతులలో యీమూడు సంవత్సరములనుంచి ఏవిధంగా నిర్వహింపబడుతున్నదిన్నీ మనకందరికీ తెలుసు. ఒక్క ఉపాధ్యాయులేకాదు, జిల్లాబోర్డు పాఠశాలలేకాదు, రోడ్డులేకాదు, యివన్నీగూడా అధ్వాన్నస్థితిలో వుంటున్నవి. వీరిలో ఎవరైనా వారివారి కష్టసుఖములు చెప్పుకోటానికికూడా దిక్కుమొక్కు లేకుండా పోతున్నది. చెప్పుకుంటే, విన్నవారులేరు. చెప్పుకొనటానికిగూడా భయముగాఉన్నది. Special Officer గా జిల్లాకలెక్టరు ఉన్నాడు. ఆయనకు జిల్లాకు సంబంధించినవి అనేకపనులు. ఆయన క్రింద ఒక P. A. ఉంటాడు. ఈ P. A. లు యిదివరకు పార్టీ ఎన్నికలలో మేనేజర్లుగానో, Secretaries గానో వుంటూ వచ్చినవారు. ప్రస్తుతపు పరిపాలనలో P. A. గా ఉంటున్నారు. అందుచేత జిల్లాబోర్డు పరిపాలన సక్రమంగా జరగదు. జరగడములేదు. జరిపించలేదు. జిల్లాబోర్డుల పరిపాలన సక్రమంగా జరగాలి అంటే, యీబిల్లుద్వారా, మరొక సంవత్సరముపాటు యీ పరిపాలన special officers చేతులలో ఉంచినప్పటికిన్నీ, యీ సంవత్సరము పూర్తిఅయ్యేలోగానైనను ఎన్నికలను ఏర్పాటుచేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. లేకపోతే, జిల్లాబోర్డుల విషయములో నిజమైన సంపూర్ణమైన, సక్రమమైన పంచాయతీ రాజ్యాన్ని స్థాపించండి. ఎన్నికలు జరిపితే కాంగ్రెసుపార్టీయే గెలుస్తుందని నేను

సవాలు చేయగలను. ఇతరపార్టీలలో ప్రజలకు నమ్మకములేదు. జిల్లాబోర్డుల పరిపాలన విషయములో ప్రభుత్వం ఏపద్ధతిని అవలంబించబోతుందో నిర్దిష్టముగా చెప్పండి. అంతేకాని జిల్లాబోర్డుల పరిపాలన సక్రమంగా చేయగలమా లేదా అనే సందేహము ప్రభుత్వం పెట్టుకుని ఎన్నికలు జరపకుండా, Special Officers చేతులలో పెట్టడమువల్ల యీ మూడుసంవత్సరాలనుంచి, అధ్వాన్న స్థితిలోకి తీసుకొనివచ్చింది యీ ప్రభుత్వం. ఇప్పటికే ప్రజలకు ఎన్నికల విషయములో సమాధానము చెప్పలేకుండా బోతున్నాము. ప్రతిఓటరూగూడా తనయొక్క ఓటింగుహక్కును సక్రమంగా వినియోగించుకోటానికి చూస్తున్నాడు. ప్రస్తుతం ప్రభుత్వం తెచ్చిన యీ బిల్లువల్ల యీసారికి extend చేస్తున్నారు. ఈసారికిమాత్రము మేము ఒప్పుకోక తప్పలేదు. ఇకమీదటఅయినా ప్రభుత్వం ఎన్నికలు జరుపుతారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

SRI G. NARASIMHA MURTY :—అధ్యక్షా, జిల్లాబోర్డుల కాలవ్యవధిపొడిగించేసందర్భములో లోగడ Provincial Congress Committeeవారు ప్రత్యక్షఎన్నికలు జరపాలని చేసినతీర్మానము చాలా ప్రశంసనీయమైనది. ఆ తీర్మానానుసారముగా ప్రత్యక్షఎన్నికలు ప్రభుత్వం జరిపిస్తారని ఆశించాను. కాని యిప్పుడు ఒకసంవత్సరమువరకు మరల పొడిగించటము అవసరమా? లేకపోతే Special Officers చేతులలోనే జిల్లాబోర్డుల పరిపాలన వుంచడము సమంజసమా? ఈ పొడిగింపు విషయములో నేను ఒక్కవిషయము ప్రభుత్వానికి చెప్పదలిచినాను. 1942 వ సంవత్సరములో పూర్వము బ్రిటిషువారి హయాములో ఎన్నికఅయినా జిల్లా బోర్డుసభ్యులను బ్రిటిషువారిని ఎదిరించి స్వాతంత్ర్యము సంపాదించటానికి, జిల్లా బోర్డులుచేసిన ఒక తీర్మానకారణముగా జిల్లాబోర్డులను అప్పుడు రద్దుచేశారు. అప్పటినుంచి యిప్పటివరకు జిల్లాబోర్డులు ఎన్నికలద్వారా పునర్నిర్మాణము జరగలేదు. కాంగ్రెసుప్రభుత్వం వచ్చినతరువాత, ప్రకాశం పంతులుగారి హయాములో జిల్లా బోర్డులు మరల ఎన్నికద్వారా పునర్నిర్మాణము జరగబోతున్నదని ప్రకటించారు. నిజముగా ఎన్నికలు జరుగుతాయని ప్రజలు ఆశించారు. ఈమధ్యకాలములో, మరల ఎన్నికలుజరిగి, కాంగ్రెసుప్రభుత్వం ఏర్పడినతరువాత స్థానిక స్వపరిపాలనమంత్రిగా వచ్చిన శ్రీ A. B. Nageswara Rao గారు మా జిల్లాకు సంబంధించినంతవరకూ కాంగ్రెసువాదులలో ప్రముఖులు, జిల్లాబోర్డులకు ఎన్నికలు జరపాలని ఆందోళన చేసినవారు. వారు స్థానికసంస్థలకు మంత్రిగా రావడము ప్రజలు ఎంతో సంతోషించారు. ఇప్పుడుకూడా రాష్ట్రకాంగ్రెసుకమిటీ సంఘము వ్యవహారాలలోగూడా చేసిన తీర్మానానికి మంత్రిగారుకూడా చాలాసుముఖులని విన్నాను. ఈ బోర్డుల విషయములో రాష్ట్రకాంగ్రెసు కమిటీవారి తీర్మానము ప్రకారము తప్పకుండా వారు ఏదైనా చేస్తారని ఆశించాము.

2nd December 1955] [Sri G. Narasimhamurty

ఇకపోతే జిల్లాబోర్డులకు ఎన్నికలు జరపాలా ? లేకపోతే Special Officer చేతులలో యీ సంస్థలపరిపాలన continue చేయడమా అనే విషయమునుగురించి నాఅభిప్రాయము యేమిటంటే, ఏదో డబ్బుకోసము ఎన్నికలు అపడమనేది ప్రభుత్వము నిర్ణయించినట్లుగా నాకు బోధపడుతున్నది. అది సరియైనపద్ధతికాదు. అయినప్పటికినీ ప్రభుత్వానికివుండే సాధకబాధకాలూ ఆర్థికస్తోమతుఅన్నీ చూచుకుని ఎక్కువఖర్చు తగ్గించి, ప్రజల ఉపయోగముకొరకుప్రజలద్రవ్యం సక్రమంగా ఖర్చు చేయటానికి, మరొక సంవత్సరానికి పొడిగించడమనేది ప్రస్తుత పరిస్థితులనుబట్టి మంచిదేనని నా అభిప్రాయము. ఈ బోర్డులపరిపాలన Special Officers ద్వారా నడిపించేటానికి ఏవిధమైన అభ్యంతరములేదు. కనుక యీ మధ్యకాలములో జిల్లా బోర్డుల పరిపాలన Special Officers చేతులలో వుండడముకంటె, ఒక్కొక్క తాలూకాలోవున్న పంచాయతీగ్రామాలలోనుంచి, ఒక్కొక్క నియోజకవర్గములో నుంచి పంచాయతీబోర్డు సభ్యులతో ఏర్పాటుచేసి ప్రతిఒక్క తాలూకానుంచి ముగ్గురినో, నలుగురినో సభ్యులను వారిచేత ఎన్నికచేయించి పంచాయతీ గ్రామాలలోనుంచి ప్రతినిధులను జిల్లాబోరు సభ్యులుగా ఏర్పాటుచేసి, రాష్ట్రకాంగ్రెసు కమిటీవారి తీర్మానానుసారముగా, ఆవిధంగా జిల్లాబోర్డులను పునర్నిర్మించటానికి ఏర్పాటు చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, ఈ జిల్లా బోర్డుల బిల్లును నేను బలపరుస్తున్నాను. ఇప్పుడు మన రాష్ట్రము లోటు బడ్జెటులో ఉంటున్నది, జిల్లా బోర్డులుకూడా లోటుగా ఉన్నాయని మంత్రివర్గము ఎంతో సానుభూతి వీటిని ఒక సంవత్సము పొడిగించడము చాలా సంతోషమైన విషయము.

నిన్నటి పత్రికలో ఒకాయన విశాలాంధ్ర మనకు అక్టోబరు నాటికి రాబోతున్నది, మన మంత్రివర్గము తప్పకుండా మారుతున్నదని ప్రకటించారు.

THE HON. Sri N. SANJEEVA REDDI :—గున్నయ్యగారిని వారి అడ్రసు ఇవ్వమని అడుగుతున్నాను.

Sri P. GUNNAYYA :—ఆ పేపరు చూపిస్తానండి. విశాలాంధ్ర వచ్చినప్పుడు మన అసెంబ్లీని విశాలాంధ్ర అసెంబ్లీ అని పేరుతో నడిపిస్తే మన M.L.A. పదవులు అన్నీ దక్కుతాయని నా నమ్మకము.

MR. SPEAKER :—ఇప్పుడు మనకు విశాలాంధ్ర విషయము అక్కరలేదు. జిల్లా బోర్డులను గురించి మాట్లాడండి.

SRI P. GUNNAYYA :—అక్టోబరు నెలలో విశాలాంధ్ర వచ్చినప్పుడే ఈ జిల్లా బోర్డుల ఎన్నికలను ప్రభుత్వము తీసుకువచ్చినప్పుడు మనకు మన M.P. లు అక్కడ సహాయము చేస్తారు. అసెంబ్లీ రద్దులేకుండా ఉంటుంది. M.L.A. లు శాశ్వతంగా ఉంటారని మనవిచేస్తున్నాను. ఇప్పటికి మనము M.L.A. లుగా వచ్చి 8 మాసములు అయింది. ఈ మంత్రివర్గము స్థాపించి 7 మాసములు అయింది. శ్రీకాకుళం జిల్లాలో ఇప్పటికి ఆ జిల్లా బోర్డు P.A. గారు ఒక M.L.A. చెప్పిన పని చేయలేదు. ఒక్కమాటకూడా వినలేదు. మేము ఎంతమంది M.L.A. లమో మంత్రిగారికి ఈవిషయం విన్నవించాము. అది వారికి తెలిసేఉంటుంది. కనీసం P.A. గారిని transfer చేయమన్నా చేయలేదు. ఇప్పుడు ప్రస్తుతం M.L.A. లు చేసింది చరిత్రకెక్కదుగాని, మంత్రులు చేసింది చరిత్ర వ్యాపితంగా ఉంటుందని మంత్రివర్గము గుర్తిస్తుందని ఆశిస్తున్నాను. ఈ ఒక్క జిల్లా బోర్డుకు సంబంధించినంతవరకు రోడ్ల పనులకు 26 వేల రూపాయిలు estimate చేసినట్లు తెలిసింది. ఆ 26 వేలల్లో కనీసం రోడ్డు పనులకు 10 వేలు రూపాయిలు ఖర్చు అవుతున్నాయో, లేదో? మంత్రి గారు కూడా ఆరోడ్డుమీద ప్రయాణం చేశారు. అక్కడ పని బాగాలేదు అని చెప్పి జిల్లా కలెక్టరుకు report చేశాము. P.A. గారికి చెప్పాము. ఆఖరుకు మంత్రి గారికికూడా మెమోరాండం సమర్పించాము. ఇంతవరకు దానిసంగతి తెలియలేదు. 26 వేలు estimate చేసి 10 వేలు ఖర్చుపెట్టారు. అందులో 16 వేల రూపాయలు మనకు నష్టముగదా? ఇప్పుడు ఇవన్నీ రు. 0-4-0 లు అన్ని ఎకరాలమీద చేస్తేమనకు 16 వేలు వస్తుంది. ఇలాంటి పనులు ఆ జిల్లా బోర్డులలో జరుగుతున్నాయి.

జిల్లా బోర్డుల ఆస్పత్రులలో అసలు మందులే లేవని చెబుతున్నారు. మన అధ్యక్షుల వారుకూడా జిల్లా బోర్డు అధ్యక్షులుగా 3 సంవత్సరములు చేశారు. ఆ జిల్లాలో ఏ రోడ్డు ఎల్లా వున్నదో, ఎన్ని ఆస్పత్రులు ఉన్నాయో అన్ని విషయములుకూడా అధ్యక్షులవారికి తెలుసు. అధ్యక్షులువారు ఆ పదవి వదలిన 3 సంవత్సరములనుంచి ఆ జిల్లా బోర్డులో ఒక్క క్రొత్త పని జిల్లా బోర్డు తరఫున జరిగిందని రుజువుచేస్తే నేను తప్పకుండా ప్రభుత్వంవారు చెప్పినదానికి ఒప్పుకుంటాను.

ఈ జిల్లా బోర్డులను ఒక సంవ్సరము పొడిగించడము శాసనసభా గౌరవానికి, మా సభ్యులందరికి శ్రేయస్సుకొఱకు పొడిగించారని మంత్రివర్గం వారికి నా హృదయ పూర్వక నమస్కారాలు చేస్తున్నాను. ఈ జిల్లా బోర్డుల పరిపాల చేస్తున్నటువంటి P.A. లు మాకంటే అధికారులు లేరు అనిపించే ప్రదర్శన చేస్తున్నారు. అది మాన్పించేందుకు ప్రభుత్వమువారు తగిన శ్రద్ధ తీసుకొని మా అందరికి సహాయము చేస్తారని నేను ఆశిస్తునాను.

2nd December 1955]

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, దీనిమీద చాలామంది మాట్లాడినారు. ఇంతమంది మాట్లాడంలో ఎక్కువ విషయాలు వచ్చినప్పటికీకూడా ఈ చర్చ ఇంతకాలము జరగడంకూడా చాలా అవసరమే. మంత్రివర్గము మరొక పర్యాయము దీనిని గురించి ఆలోచించి శాసనసభముందు పెట్టే దానికి ఏమి మర్యాద లేకుండా చేసే ప్రస్తుత పద్ధతి మార్చుకొంటారని ఆశించాము. కనీసము మాండేటు ప్రకారము కాంగెసు పార్టీవారు ఎట్లా ఓటు చేసినా కనీసము వారు చెప్పిన మాటలను అయినా మంత్రివర్గం విని, తగినరీతిగా ఒక చట్టాన్నైనా త్వరలో తెస్తుందని ఆశతోనే ఈ చర్యను కొంతకాలము కొనసాగించమని కోరాము. అదేరకంగా జరిగింది. అనేకరకములైన ఆశ్చర్యకరములైన వాదనలు మనముందుకు వచ్చినవి. జిల్లా బోర్డుల ఎన్నికలను ఎందుకు జరపరు. 3 యేండ్లు వాయిదా వేశారుగదా ఇప్పుడు ఒక సంవత్సరము ఎందుకు వాయిదా వేస్తున్నారు. మంత్రి నాగేశ్వరరావుగారు ఎప్పుడూకూడా కావాలంటున్నారు అని అన్నారు. దాదాపు ఈ మంత్రివర్గము అధికారంలోకి వచ్చి 8 నెలలు అయింది. ఈ 8 నెలలలో స్థానిక స్వపరిపాలన శాఖ బాధ్యత తీసుకొని, మొట్టమొదటనుంచి జిల్లా బోర్డులు కావాలని ఈ మంత్రిగారు అన్నారు. వీరు కొత్తగా ఇప్పుడే ఈ శాఖను తీసుకున్నవారు కాదు. ఈ 9 నెలలో ఎందుకు ఒక నిర్ణయానికి రాలేకపోయారు. మంత్రివర్గంలో పేచీలు ఉన్నట్లయితే, నిజముగా జిల్లా బోర్డుల అవసరాన్ని మీరు గుర్తించిన వారైతే, అది వెంటనే నిర్ణయం చేయాలి. లేకపోతే నేను రాజీనామా ఇస్తానని మీరు ఎందుకు అనలేదు. ఇవన్నీ ఏదో సిద్ధాంతాలను అంగీకరించిడములేదు. అమల్లోకి రాకుండా ఈరకంగా చేయడము ఎందుకు, దానికి ఖర్చు 40 లక్షలు రూపాయలు అవుతుందని అయ్యపురెడ్డి మొదలైనవారు చెప్పారు. నిజంగా అంత ఖర్చు అవుతుందో లేదో అనేది అనుమానమే. అందువల్ల ఆ సంగతికూడా ఆలోచించాల్సి ఉంటుంది. ఒక వేళ అదివాదనకోసము అన్నప్పటికీకూడా 40 లక్షలు రూపాయిలు మిగుల్చుకోవడమే ప్రధానము అయినట్లయితే చాలా చిన్న సలహా చెబుతాను. ప్రతి సంవత్సరముకూడా గవర్నరుగారికి 14 లక్షల రూపాయిలు ఖర్చు పెడుతున్నారు. సంతకాలు వేయడం తప్ప ఆయన చేసేపని ఏమీలేదు. ఆ పనికూడా ముఖ్యమంత్రిగారికే ఇవ్వండి. ఆ రకంగా 3 యేండ్లకు 40 లక్షల రూపాయిలు మిగులుతుంది. ప్రజాతంత్రంగా పరిపాలన చేయాలన్నప్పుడు, ప్రజలచేత ఎన్నుకోబడిన మంత్రివర్గము ఉన్నప్పుడు సంతకాలుచేసే దానికోసము, ఒక గవర్నరు అవసరములేదు. మీకు నిజముగా డబ్బుమిగుల్చుకోవలసిన అవసరము ఉన్నట్లయితే గవర్నరుకోసం ఖర్చుపెట్టే డబ్బు కొంత పెట్టి జిల్లాబోర్డుల ఎన్నికలు ఎందుకు జరుపకూడదు ? ఇటువంటి అర్థములేనటువంటి వాదనలనుమాత్రం ఎప్పుడూ తీసుకురావద్దు.

Mr. SPEAKER:—This Ministry cannot change the Constitution.

Sri P. SUNDARAYYA :—This Ministry can recommend for amending the Constitution. కనీసం ఆలోచనఅయినా వచ్చిందా అన్నారు. చేయగలదా, లేదా అనేసంగతి గాదు. చేయగలిగిన దానినే ఎందువల్ల అధ్వాన్నముగా చేస్తున్నారు. వాదనలు అనవసరము. జిల్లాబోర్డులు సిద్ధాంతాలనుబట్టి ఉన్నదన్నారు. సిద్ధాంతాలుతప్పా ? ప్రజాస్వామ్యములో పరిపాలన సాగడము అనేదితప్పా ? ఈ రోజున పంచాయితీబోర్డులు, జిల్లాబోర్డులు, రాష్ట్రశాసనసభలు, ఢిల్లీలో పార్లమెంటు ఇవన్నీకూడా వివిధస్థాయిలో ప్రజలచేత ఎన్నుకోబడిన సంస్థల ద్వారా పరిపాలనసాగాలనిచెప్పి మనము ఒకప్రక్కన, కోరుతూవుంటే Constitution లోగూడా పంచాయితీల రాష్ట్రముఅని మధ్యన కొన్ని అంతస్థులు ఏమీ లేకుండా చేయాలని ఉద్దేశ్యముమాత్రముకోదు. ఉన్నప్పుడు ఈ ధోరణి ఏమిటి ? జిల్లాబోర్డులేవద్దని కొంతమంది సభ్యులు మాట్లాడుతున్నారు. జిల్లాబోర్డులు వద్దంటే ఎవరు పరిపాలనచేయాలి ? కలెక్టర్ల పరిపాలన, తహసిల్దారుల పరిపాలన, గ్రామ శెత్తందార్ల పరిపాలన, గ్రామమునసబుల పరిపాలన మనకు కావలసిందే. అందుచేత ఈ ప్రజాస్వామిక పరిపాలన ఒక ఉద్యోగస్థుల పరిపాలన శాశ్వతముగాచేసి ఇటువంటిధోరణి, ఇది ఒక ఫాసిస్టుధోరణి తప్పితే ప్రజాస్వామిక పరిపాలనాధోరణి కానే కాదు. ఆ సంగతి మీరు స్పష్టంగా గుర్తుంచుకోవలసి ఉంటుంది.

AN HON. MEMBER :—Point of order, Sir. ఫాసిస్టు పరిపాలన అని ప్రతిపక్షునాయకులు అంటున్నారు. పంచాయితీలకే సర్వఅధికారాలు ఇవ్వాలని దానిమీద జిల్లాబోర్డులు అవసరంలేదని అన్నాము. ప్రభుత్వోద్యోగులకు attribute చేస్తూ ఫాసిస్టు పరిపాలన అన్నారు.

MR. SPEAKER :—Point of order అని చెప్పి మరొక ఉపన్యాసం చేయడానికి వీలులేదు.

SRI P. SUNDARAYYA :—ఈ విషయం గురించి స్పష్టంగా చెప్పాలని మేము మొదటనుంచి చెబుతున్నాము. ఇక ముందు చెబుతాము. గ్రామాల్లో, జిల్లాల్లో, రాష్ట్రాల్లో ప్రజలచేత ఎన్నుకొనబడినవారిచేత పరిపాలనసాగాలి. పంచాయితీలకు, జిల్లాబోర్డులకు హక్కులు తక్కువగా ఉన్నాయి. వాటికి ఎక్కువ హక్కులు ఇవ్వాలి. లేకపోతే, ఈ సంస్థలన్నీ నిరుపయోగమే. కలెక్టర్లుమాత్రం ఉపయోగస్థులు ; ప్రజలచేత ఎన్నుకోబడిన సంస్థలు కాని, సభ్యులుకాని నిరుపయోగం అని

చెప్పే దృక్పథం పొరపాటు దృక్పథం, ప్రజాస్వామికతత్వానికి వేరుపురుగు అని చెప్పవలసియున్నది. బీ శెట్టి అప్పారావుగారు వీటివల్ల స్థానికతత్వాలు పెరిగిపోయాయని, స్వలాభాలుకోసమే చూస్తున్నారని, చాలా హృదయావేదనతో చెప్పారు. నిజంగా ఇదే హృదయావేదన లోక్ పార్టీ గ్రూపువారి మంత్రిపదవుల విషయంలోను స్వలాభాల విషయాలలోను మరిచిపోయి దేశక్షేమంకోసం తక్కువ మంత్రులతో పరిపాలన జరుగడానికి ప్రయత్నిస్తే బాగుంటుంది కాని ఒక సమస్య వచ్చినపుడు స్థానికతత్వాలకోసము స్వలాభాలకోసమే చేస్తున్నట్లు చెప్పడం, ప్రారంభిస్తే చాలా చెప్పుకోవలసివస్తుంది. కొంతమంది పరోక్ష ఎన్నికలు జరపాలని అంటున్నారు. Elementary education ప్రభుత్వాన్నే తీసుకోవాలని అంటున్నాముకదా; Hospitals provincialise చేయాలని చెబుతున్నాముకదా; రోడ్లుకూడా State Highways క్రిందకు తీసుకురావాలని చెబుతున్నారుకదా, ఇక జిల్లాబోర్డులు చేయవలసిన పనిఏమిటి అంటున్నారు. Education విషయంలో ఎక్కువడబ్బు ఖర్చుచేసి ప్రభుత్వం నడపాలని అంటున్నాంఅంటే, D.P.I. ద్వారా మాత్రమే అన్నీనడపాలని మా ఉద్దేశంకాదు. వివిధరకాలుగా జీతాలుఇచ్చేపద్ధతి పోగొట్టి వీటినన్నింటిని సక్రమమైన management క్రిందకు తీసుకురావాలని మా ఉద్దేశం. ఆ management చేసేది జిల్లాబోర్డులే కావచ్చు. Conditions of service and education ఒకేరీతిగా ఉండాలనికాని ఏ ప్రజాసంస్థలకు జోక్యం లేకుండా కేవలం 6, 7 గురు మంత్రులు ఇక్కడ ప్రభుత్వంలోకూర్చుని ఉద్యోగస్థుల ద్వారానే అంతా నడిపించాలని మా ఉద్దేశంకాదు. ఇక్కడ 196 మంది సభ్యులు మాట్లాడుతూంటే కొంతమంది ఉద్యోగస్థులు notes తీసుకుంటుంటారు; అయినా వారు మాట్లాడినవానికి ఏ ఉద్యోగస్థుడు విలువఇవ్వడం ఉండదు. తొమ్మిదినెలలైనది మనము ఇక్కడకువచ్చి. మీరుచెప్పిన ఫలానా విషయంగురించి ఈ చర్య తీసుకున్నాం అని ఏ ఉద్యోగినుంచి ఏ శాసనసభ్యునికికూడ జవాబువచ్చినదని నేను అనుకోను. ఏడుగురు మంత్రులు ఇక్కడ కూర్చుని గ్రామాలవరకు అన్నిరకాల పరిపాలన సాగించేపద్ధతి పనికిమాలిన పద్ధతిఅవుతుంది. జిల్లాబోర్డులను వెనువెంటనే ఏర్పాటు చేయాలి. పొరపాటు చేశాము; ఆలస్యం అయిపోయింది; డిసెంబరులోపుగా చట్టం అయిపోతోంది కాబట్టి వాయిదా వేయవలసిందని అంటున్నారు. ఎందుకు వాయిదా వేయవలసివచ్చింది? ఒక నిర్ణయానికి ఎందుకు రాలేకపోతున్నారు? ముందు పంచాయితీ బోర్డు సభ్యులద్వారా పరోక్షంగా ఎన్నికలు పెట్టాలని అన్నారు. ఇప్పుడుకూడా ఒకరు అదేమాట అన్నారు. ఒక తాలూకాలో 100 గ్రామాలుంటే మూడు నాలుగు గ్రామాలకన్న పంచాయితీలులేని గ్రామాలు చాలా ఉన్నాయి. జిల్లాబోర్డులు ఒక ప్రక్కన అన్నివ్యవహారాలు నడపాలని అంటూ రెండవప్రక్కన ఎన్నుకునేవాళ్లు

Sri P. Sundarayya] [2nd December 1955

తాలూకాకువుూడు నాలుగు పంచాయితీ సభ్యులను ఎన్నుకోవాలన్నది ఎంత చక్కని ప్రజాతంత్రమో నాకు అర్థంకావడంలేదు. ఎన్నికలు అవసరమే డబ్బుమిగిల్చేదానికి పరోక్ష ఎన్నికలు అంటేమాత్రం మేము అంగీకరించలేము. పెత్తనం ధనవంతుల చేతులలోనూ, భూస్వాముల చేతులలోను ఉండడానికితప్ప పరోక్ష ఎన్నికలవల్ల ప్రయోజనం ఏమిలేదు. పంచాయితీ సభ్యులనుంచి పరోక్ష ఎన్నికలకన్న పనికిమాలిన పద్ధతి లేనేలేదు. ఈ పద్ధతికి మేము పూర్తిగా వ్యతిరేకం. ప్రజలచేత వయోజన వోటింగు హక్కుద్వారా ఎన్నికఅయిన సభ్యులద్వారానే జిల్లాబోర్డులను నడిపించి తీరాలి. కాంగ్రెసుపార్టీవారు M. L. A. తో పరిపాలన చేయించాలని అన్నారు. కాంగ్రెసు సభ్యులలో కొంతమంది అసెంబ్లీసభ్యులతో నడపడం పొరపాటు అన్నారు. అమ్మన్నరాజాగారు మాట్లాడుతూ శాసనసభ్యులు ఉపన్యాసాలు ఇవ్వడమే అవుతోంది; గ్రామాలలోజరిగే పరిస్థితులు తెలియడంలేదు. ఏమిచెప్పినా ఎవరూ వినిపించుకోడంలేదు. ఈఇబ్బంది ఉన్నదని ఏ M.L.A. అయినా చెబితే ఏకలెక్టరు ఏఉద్యోగస్థుడు వినిపించుకోడంలేదు. మంత్రులకు 196 మంది శాసనసభ్యులు 16000 గ్రామాలలోఉండే సంగతులు చెబుతూంటారు.

Srimathi C. AMMANNA RAJA :—నేనుచెప్పాను అంటున్నారా ? నేను అలా చెప్పలేదు.

Sri P. SUNDARAYYA :—ఈ పర్యాయం నేను Rural Constituency నుంచి వచ్చాను. ఇంతకుముందు Urban Constituency నుంచి వచ్చాను. ఇప్పుడు గ్రామాల అవసరం తెలుస్తుంది. వారికష్టాలు బాగా తెలుస్తుంది అని చెప్పారు. తరువాత మీపార్టీలో జరిగిందిచెప్పారు. ఆప్రాంతం M. L. As కలిసిఉంటే బాగుటుంది అంటే దానికికూడా ఒప్పుకోలేదని అన్నారు.

కాంగ్రెసు పార్టీవారు చెప్పేదిఒకటి ; లెజిస్లేచరు పార్టీవారు చెప్పేదిఒకటి ; మంత్రివర్గమువారు చెప్పేదిఒకటి. డిసెంబరు రెండవ తారీఖున 10 వ తారీఖుతో బిల్లు అయిపోతుందనేసరికి వారంరోజుల్లో ఎన్నికలుజరపడం అసంభవం కాబట్టి మరొక సంవత్సరానికి వాయిదావేయాలని అంటున్నారు. మాకు మెజారిటీ ఉన్నదికదా అనే నమ్మకం, మరొక సంవత్సరానికి వాయిదా వేస్తేమాత్రం జరుపుతారనే నమ్మకం యేమిటి ? జరుపరు. జరుపదలచుకుంటే ఏర్పాటులకు జరపడానికి పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు యిచ్చిన సవరణను అంగీకరించండి. పొరపాటున జరుపలేకపోయాం

2nd December 1955] [Sri P. Sundarayya

అంటారా మరొక మూడు నెలలకు ఇచ్చిన సవరణను అంగీకరించవలసి ఉంటుంది. ఈ సవరణను అమలుజరుప దలుచుకుంటే ఇదివరకే తయారైన electoral rolls ఉన్నాయి. ఏప్రియలు లోపుగా ఎన్నికలు జరుపవచ్చును. సంవత్సరంవరకు వాయిదా వేయవలసిన అవసరంలేదు. సంవత్సరంవరకు వాయిదా వేయడంవల్ల జరుగబోయేది యేమిటంటే, ఈలోపుగా ఏ నిర్ణయం తీసుకోవలసిన అవసరంలేదని జాగుచేస్తారు. తరువాత 1956 అక్టోబరులో విశాలాంధ్రవస్తుంది. విశాలాంధ్ర వచ్చినతరువాత విశాలాంధ్ర జిల్లాబోర్డులసంగతి ఎత్తవచ్చును. విశాలాంధ్ర రాష్ట్రమేలేనిదే విశాలాంధ్ర జిల్లాబోర్డులు ఎక్కడనుంచి వస్తాయి ? జిల్లాలను రద్దుచేస్తూ ఒకేజిల్లాగా చేస్తారేమో. నాకు యింతవరకు జ్యోతిషం తెలియదు. విశాలాంధ్ర రావడంఅంటె ఉన్న జిల్లా బోర్డులను రద్దుచేసుకోవడం అనా ? హైదరాబాదు రాష్ట్రంలో నైజాముపెత్తనంవల్ల జిల్లాబోర్డులులేవు. మొన్ననే ఒకబిల్లు pass చేసుకున్నారు. ఎన్నికలను జరుపుకోటానికి తయారవుతున్నారు. ఏప్రెలునెలలోనో, ఎప్పుడో జరుపుకుంటారు. మనలను చూచి వాళ్లుకూడా వాయిదావేస్తే చెప్పలేం అనుకోండి. ఆ పక్షంలో మనం చక్కని ఆదర్శమే ఇస్తున్నమన్నమాట. జిల్లాబోర్డులు ఉన్నవాళ్లము మేమే రద్దుచేసుకుంటుంటే మీకు జిల్లాబోర్డులు ఎందుకు ; అనవసరం, అని సలహా ఇవ్వదలచుకుంటే స్పష్టంగా చెప్పండి. నాకు ఏమి అభ్యంతరంలేదు. కాంగ్రెసుపార్టీ అభిప్రాయప్రకారం జిల్లాబోర్డులు ఉండకూడదు. ప్రజలచేత ఎన్నికోబడిన వారిచేత పరిపాలన కూడదు అనిఅంటే సరిపోతుంది. హైదరాబాదులో వచ్చినబిల్లునుకూడా రద్దుచేసి ఇకముందు విశాలాంధ్రలో జిల్లాబోర్డులులేకుండా ఉద్యోగస్థులచేతనే పరిపాలన సాగిస్తాము అని చెబితే అభిప్రాయంఉంటే స్పష్టంగా ముందుకురండి. ముసుగులో గుద్దులాట ఎందుకు ? దాపరికాలు ఎందుకు ? వాయిదాఎందుకు ?

ఖర్చవుతుందని చెప్పారు. ఒకసూచన చేస్తున్నాను ఖర్చుతగ్గించడానికి. అసెంబ్లీ పార్లమెంటు ఎన్నికలు ఒకేసారి జరిగేటట్టుగా Delhi ప్రభుత్వం Constitution లో మార్పు తేవాలంటున్నది. తెస్తారు. పంచాయతీబోర్డులు ఏర్పాటు చేయాలంటే పంచాయతీఎన్నికలు జిల్లాబోర్డుఎన్నికలు కలిపి ఒకేసారిజరిపితే కలిసి వస్తుంది. ఈరోజు కొసరిపట్టు 50—70 బోర్డులు పెడుతున్నారు. మొత్తం ఆంధ్రరాష్ట్రంలో 14 వేల major గ్రామాలు 13 వేల చిల్లర గ్రామాలలో దాదాపు 6 వేల గ్రామాలకుమించి పంచాయతీలులేవు. ఇంకో 7, 8 వేల గ్రామాలకు పంచాయతీబోర్డులు ఏర్పాటుచేయాలి. సంవత్సరానికి 12 వందల పంచాయతీలు ఏర్పాటుచేస్తే మిగిలిన 7 వేలగ్రామాలలో పంచాయతీబోర్డులుస్థాపించడానికి 6 ఏండ్లు పడుతుందన్నమాట. అధేరకంగా మీరు యిచ్చిన లెక్కల ప్రకారంచూచినా ఎన్నియేండ్లకు పంచాయతీబోర్డులను ఏర్పాటుచేస్తారో అదికూడ

Sri P. Sundarayya] [2nd December 1955

చెబితే మీ పరోక్ష ఎన్నికలతతంగం వెనుకవున్న బండారం బయటపడుతుంది. అందుచేత నిజముగా పంచాయతీఎన్నికలు ఆంధ్రరాష్ట్రంఅంతటా జరగాలని April నెలలో Municipal act ను సవరిస్తూ చెప్పారు. ఈ Municipal ఎన్నికలతోపాటు జిలాబోర్డు ఎన్నికలు ఒకేపర్యాయం జరపండి. రాష్ట్ర శాసనసభ ఎన్నికలు పార్లమెంటుఎన్నికలు ఒకేపర్యాయం Constitution ప్రకారం జరుగుతవి. డబ్బుఖర్చు తగ్గడానికి ఒకమార్గం. ఎందుకు అది చేయకూడదు ? వాయిదావేయడం చాలా అర్థంలేనిది. ఏరీతిగానూ కారణం కనపడదు. తరువాత మరొకపర్యాయం మంత్రివర్గానికికూడా శాసనసభ్యుల అభిప్రాయం స్పష్టంగా కనబడుతున్నది. మార్చిదాకా వాయిదావేయడం మంచిదని జిల్లా బోర్డులను రద్దుచేయాలనేవారు కొంతమందివున్నా చెప్పినవారు ఎవరూలేరు. "మాపార్టీ mandate అయినది కాబట్టి note చేస్తాం. ఇది పనికిమాలినబిల్లు" అని చెప్పారు. మంత్రివర్గం ఇదమిద్ధంఅని తేల్చకుండా వున్నట్టయితే మంత్రివర్గం ప్రతిష్టవుండదు. శాసనసభయొక్క మర్యాద ఉండదు. మళ్ళా ఒకసంవత్సరం వాయిదాకోరుతున్నారు. 3సారులు వాయిదాఅయిపోయింది. ముందుజరుగవలసిన Time-table మనకు తెలుసును, 1956 December 10 వ తేదీ లోపల ఎన్నికలుజరిపి జిల్లాబోర్డులు ఏర్పాటుచేస్తాం అని చెప్పి హామీ యివ్వండి. దానినిగురించి మంత్రిగారు మొదటిరోజున సాధ్యమైనంత త్వరలో చేయాలని మా ఉద్దేశం అన్నారు. Hell is paved with good intentions నరకలోకానికి సదుద్దేశ్యాలతోనే ఆరంభించారు అని ఇంగ్లీషులో సామెత వున్నది. ఉద్దేశ్యములతో వున్నదికాదు సమస్య. జిల్లా బోర్డులను రద్దుచేస్తామనన్నా స్పష్టంగా చెప్పండి. లేకపోతే ఎన్నికలు ఫలానా తేదీలోగా జరుపుతాం అని ఖచ్చితంగా చెప్పండి. దాంట్లో కాంగ్రెసు మర్యాద ఉంటుంది, మంత్రివర్గం మర్యాద వుంటుంది, శాసనసభ మర్యాద వుంటుంది. Vote చేయవచ్చు, కాని అది ప్రజాస్వామికానికిగాని శాసనసభకుగాని మర్యాదగావుంటే పద్ధతిలో వుండదు. అందువల్ల యిప్పటికీ మునిగిపోయిందేమీలేదు. December 10 తారీఖులోపల చేయాలని చెప్పడంలేదు. April 10 లోపల అని సవరణ అంగీకరించండి. అపుడు ఖచ్చితంగా పనిచేయడానికి వీలుంటుంది. ఒక సంవత్సరం గడవుయిస్తే మీరు నిద్రపోయే దానికి గడవు యివ్వడం అవుతుంది. సవరణను అంగీకరించండి ; అంగీకరించని పరిస్థితులలో మేము వ్యతిరేకంగా Vote చేయవలసి వస్తుంది.

THE HON. SRI A. B. NAGESWARA RAO.—అధ్యక్షా, ఈ చిన్న అంశంమీద 36 మంది గౌరవ సభ్యులు మాట్లాడారు. నేను మొట్టమొదట

2nd December 1955] [Sri A. B. Nageswara Rao

లోనే bill ప్రవేశపెట్టినప్పుడే సభవారికి మనవిచేశాను. ఇది వెంబడే ఎన్నికలు జరపడానికి administrative inconvenience వున్నదనేది first point. నేను Municipal Act కు amendment తెచ్చిన రోజునే యీ ఎన్నికలు మరొక 9 నెలలలో, సంవత్సరందాకానో time లేదు—కాదు కూడదు అంటే 6 నెలలోనైనా చేయాలనే అభిప్రాయంతో అతి strict instructions యిచ్చి వాస్తవంగా మునిసిపలు ఎన్నికలు జరుపడానికి ప్రయత్నం చేశాను. ఇది తప్పకుండా జరుగుతుందనీ ఆశిస్తున్నాను. అటువంటి పరిస్థితులలో మొట్టమొదట బిల్లు ప్రవేశపెట్టినప్పుడే ఎన్నికలు వాయిదా వేస్తున్నాం అనిమనవిచేశాను. తరువాత ఏదో కాంగ్రెసువారు కాంగ్రెసు ప్రభుత్వం యిదంతా ఏదో పొడిగించిడంకోసం ఉద్యోగస్థులను చేతులలో పెట్టుకుంటే యీ మంత్రివర్గంగాని సభ్యులుగాని అధికారం చెలాయించవచ్చు ననే ఉద్దేశంతో చేస్తున్నట్టు ప్రతిపక్ష సభ్యులు మా పార్టీలో సభ్యులుకూడా మాట్లాడారు. కాని వారికి నేను వినయపూర్వకంగా చెప్పేదేమిటంటే అటువంటి దురభిప్రాయం, ప్రభుత్వానికి ఎన్నడూలేదని వారికి విన్నవించుకుంటున్నాను. గొల్లకోట నరసింహమూర్తిగారు నేను కాంగ్రెసులో లేనపుడు జిల్లాబోర్డులు elections జరగాలని ఉపన్యాసం చెప్పానని చెప్పారు. నేను ఇప్పుడుకూడా అదే అభిప్రాయంతో వీలయినంత త్వరలో జరపాలని అభిప్రాయంతోనే వున్నాను. ఏపద్ధతిలో జరగాలి అనే question వున్నది. తరువాత 40 లక్షల రూపాయల ఖర్చులెక్కేమిటి అని గౌరవసభ్యులు చెప్పవచ్చు. ప్రభుత్వం అలా చెప్పలేదు. కాని ఇది యిప్పటికే deficit లో వున్న వ్యవహారం. ఇది Special officer వచ్చిన తరువాత కాదని గౌరవ సభ్యులు గమనించాలి. ఈ రోజున జిల్లా బోర్డులలోవున్న అధ్వాన్నస్థితి, Elementary Education-ఏ లక్ష్మీనరసింహాందొరగారు అధ్యక్షులుగా వున్న శ్రీకాకుళంలో తప్ప-మిగతా 12 town లలో అదే అంకెలు తమకు అందజేయబోతున్నాను. ఎంతవరకు deficit వుందో ఏ పరిస్థితులు వచ్చాయో చూడవచ్చును. 76 లక్షలు deficit రావడం 46 లక్షలు advance చేయడం తటస్థించింది. అందువల్ల యిదివరకు deficit గా వున్న జిల్లా బోర్డులకు ఖర్చు యింత పెట్టడమా అనే ఒక ఆలోచనకూడా వున్నది. లేకపోలేదు. డబ్బు ప్రజలదేగాని ఖర్చుపెట్టేటప్పుడు జాగ్రత్తగా ఆలోచించి పెట్టాలి. ప్రజాస్వామికంకోసం 40 లక్షలు కాదు 50 లక్షలయినా ఖర్చుపెట్టాలనేది అంత తేలికగా చెప్పడానికి మాత్రం ప్రభుత్వానికి అంత తేలికైన పనికాదు. ఒక గౌరవ సభ్యుడు 20 లక్షలు ఖర్చుపెడితే అవుతుందన్నారు. అసెంబ్లీ elections కు మొట్టమొదట చెప్పినట్లు 35 లక్షలు ఖర్చు

Sri A. B. Nageswara Rao] [2nd December 1955

అయినదని అప్పుడే జిల్లా బోర్డుల ఎన్నికలుకూడా పెట్టినట్లయితే యింకా ఎక్కువ centres లో బందోబస్తు చేయిడానికి యింకా ఎక్కువ ఖర్చువుతుందిగాని అంతకు తక్కువ ఖర్చుకాదని గౌరవ సభ్యులకు మనవిచేస్తున్నాను. పంచాయతీ ఎన్నికలు మునిసిపలు ఎన్నికలు అన్నీకలిపి ఒకేసారి పెట్టమని సుందరయ్యాగారు చెప్పారు. అది ప్రభుత్వానికి తెలియకపోలేదు. సరైనపద్ధతిలో ఏప్రజాస్వామికంగురించి అందరు సభ్యులు మాట్లాడుతున్నారో ఆ ప్రజాస్వామికము సక్రమంగా అమలుజరపాలంటే ఇది సరైన పనికాదు. సక్రమంగా ఎన్నికలు జరగలేదని రేపు ప్రొద్దున్న ప్రతి పక్ష సభ్యులు నిందారోపణచేయుటకు సావకాశం వున్నది. ఏ ఎన్నిక లయినా పరోక్ష ఎన్నికలు పెట్టినాకూడా దేనికదే పెట్టాలిగాని కలిపి పెట్టడానికి ప్రభుత్వం ఒప్పుకునే పనికాదు.

పంచాయతీ, మ్యునిసిపలు ఎలెక్షన్లను పెట్టకూడదా అని సుందరయ్యాగారు మాట్లాడారు. తరువాత వావిలాల గోపాలకృష్ణయ్యాగారు మాట్లాడుతూ మంత్రిగారు ప్రజాపార్టీవారు. ఏలా ఈ తీర్మానముచేశారు? నేను చెప్పేదేమిటంటే నేను ఏపార్టీవాడినిఅయినా ఇక్కడ కూర్చున్నంతసేపు యునైటెడ్ కాంగ్రెసుపార్టీ మెంబరును. ప్రభుత్వంలో మెంబరును గనుక ప్రభుత్వం ఏది ఆదేశిస్తే అది చెయ్యడానికి నేను ఇక్కడ ఉన్నాను. అంతేగాని నా సిద్ధాంతం, నా అభిప్రాయం చెప్పడానికి కాదు. అదే ప్రజాస్వామ్యము. గోపాలకృష్ణయ్యగారు ఇదివరకటి అసెంబ్లీలో కూడా ఉన్నారు. వారు మాట్లాడితే పుస్తకములు చదివి, చట్టాలు చూపిస్తారు. Constitution యొక్క 45 సెక్షను ప్రకారం పంచాయితీలను ఏర్పాటుచెయ్యాలని, పంచాయితీ రాజ్యము కావాలని చెబుతూ ఈ పంచాయితీబోర్డులద్వారా indirect elections వద్దు direct elections కావాలని అన్నారు. ప్రజలమీద విశ్వాసం లేదని గోపాలక్రిష్ణయ్యగారు అన్నారు. ప్రజలమీద అవనమ్మకముతో ఈవిధముగా అన్నారేమో అనుకుంటున్నాను.

తరువాత Agency District Board గురించి మాట్లాడారు. వారికి అనుభవము తక్కువ Agency District Board ఈ Constitution క్రిందకురాదు. స్థానిక పరిపాలనాశాఖక్రిందకు రాదు. ప్రత్యేక Education department క్రిందఉన్నది. దానికి ప్రత్యేకసభ్యులు ఉన్నారు. 17 మంది సభ్యులు 6 గురు ఆఫీసర్లు M. L. A. లు 7 గురు నామినేటెడు మెంబర్లు ఉంటారు. దానికి ఈ జిల్లా బోర్డులకు సంబంధంములేదు అని మనవిచేస్తున్నాను.

తరువాత ఏది ఏమైనా elections మాత్రం అతిత్వరలో ఏర్పాటు చేస్తానని సుందరయ్యగారికి ఇతరులకు మనవిచేస్తున్నాను. గ్యారంటీ ఇవ్వమంటే

మాత్రం కాదు. అది ఆచారం కాదు.' ఇది గవర్నమెంటు చేసితీరుతుందని ఏ మానవ మాత్రుడు చెప్పలేడు. భగవంతుడు చెప్పవచ్చునేమో. ఉప్పెన, వరదలు, earthquake లు రావచ్చును. మ్యునిసిపలు ఎలెక్షన్సుకు 3 నెలలు చాలనుకున్నాము. ఏమైనా గ్యారంటీమాత్రం ఇవ్వడానికి వీలులేదని మనవిచేస్తున్నాను. ప్రభుత్వం మాత్రము అతిత్వరలో ఎలెక్షన్సు పెట్టితీరుతుంది. ఏ విధముగా జరపాలనేది సభ వారి ముందుఉన్నది. Indirect, direct elections ఇందులో ఏవి మామూలుగా Central Council of Ministers చెప్పినట్లు కొంత direct, కొంత indirect అనేపద్ధతి ఢిల్లిలోఉంది. తిరిగి సభవారిముందు ఈ విషయము వస్తుంది. అందుకని ఈ extension దయచేసి అందరు ఏకగ్రీవముగా ఒప్పుకోనవలెనని కోరుచున్నాను. జూను ఆఖరులోగా ఎలక్షన్సు జరపడానికి అవకాశములేదు.

SRI P. SUNDARAYYA :—జూలై ఒకటవతారీకుకు ఒప్పుకుంటారా?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—July ఒకటి వరకు మ్యునిసిపలు ఎలెక్షన్సుతో సరిపోతుంది. ఇప్పటినుంచి ప్రయత్నముచేసి జూలై తరువాత వీలైనంతత్వరలో ఎలెక్షన్సు ప్రభుత్వం పెట్టడానికి ప్రయత్నంచేస్తుంది. కాబట్టి దయచేసి ఏకగ్రీవముగా ఈ సవరణను ఒప్పుకోనవలెనని చెబుతూ వినయ పూర్వకముగా ప్రార్థనచేస్తున్నాను.

MR. SPEAKER : The question is :

"That the Madras District Boards (Amendment) Andhra Amendment Bill, 1955, be taken into consideration."

The motion was carried and the Bill was taken into consideration.

Clause 2.

MR. SPEAKER : The motion is:

"That clause 2 do stand part of the Bill."

The hon. Member Sri Vavilala Gopalakrishnayya will move his amendment. I think the second part of his amendment 'and constitute the District Boards' is not admissible. It is unnecessary because there is provision in the Act itself for the constitution of District Boards.

[2nd December 1955

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Sir, I move :

" For the letters and word '10th December 1956', substitute the following: "1st April, 1956."

The amendment was duly seconded.

SRI PILLALAMARRI VENKATESWARLU : Sir, I move :

"For the words '10th December 1956', substitute the words' 10th April, 1956."

The amendment was duly seconded.

MR. SPEAKER : The amendments moved by Sri Vavilala Gopalakrishnayya and Sri Pillalamarri Venkateswarlu are before the House for discussion.

Sri PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, అమెండుమెంటుకు మంత్రిగారు ఒప్పుకుంటే సంతోషిస్తాము. వారి పార్టీలో ఉండే రామచంద్రారెడ్డిగారుకూడా సంతోషిస్తారు. అంతేకాకుండా రాష్ట్రకాంగ్రెస్ కమిటీ నిర్ణయముకూడా వారి దృష్టికి తీసుకువస్తున్నాను. పార్టీ Representation అంటూరా కాంగ్రెసు, సోషలిస్టు, కమ్యూనిస్టు ఇండిపెండెంటువారుకూడా వెంటనే ఎలక్షన్సు కావాలంటున్నారు. ఆంధ్రదేశములో అందరూకూడా ప్రత్యక్ష ఎన్నికలు కావాలని అభిప్రాయము తెలియచేస్తున్నారు. మేముకూడా ఆశించేది అదే. శాసన సభలో పెద్దపార్టీ అయిన కాంగ్రెసుకమిటీకూడా తీర్మానంచేసింది. ఆ పార్టీ పరిపాలన చేస్తున్నప్పుడు ఆ పార్టీ తీర్మానం తప్పకుండా గౌరవిస్తుందని దాని ప్రకారం ఎలెక్షన్సు జరుపుతారని ఆశించినాము. కాని సంవత్సరం postpone చెయ్యడానికి అవసరం ఏమివచ్చింది? మా అభ్యంతరము ఏమిటంటే ఒక సంవత్సరం postpone చేస్తే విశాలాంధ్ర వస్తుంది. పూర్వం ఆంధ్రరాష్ట్రం వస్తుందని అప్పుడు ఎన్నికలు అవసరం లేదన్నాము. ఆంధ్ర రాష్ట్రం వచ్చింది. రెండు మూడు సంవత్సరములు అయింది. రెండు ప్రభుత్వాలు మారినయి. మళ్లీ ఇప్పుడు విశాలాంధ్ర వస్తున్నది కాబట్టి ఎలెక్షన్సు కావలెనంటున్నాము. ఈనాడు కాంగ్రెసు కోసముకూడా మేము పోరాడవలసి వచ్చినది. ఇవన్నీ చూచి మనము ఆలోచించవలెనని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. విశాలాంధ్ర రాబోతూ ఉన్నది. ఎలక్షన్సుకు డబ్బు లేదంటున్నారు. 1949 అయింది. 1952 అయింది 1955 అవుతున్నది. ఇప్పటికి మూడుసార్లు ఎలక్షన్సు జరుగవలసింది. 80 లక్షలు save అయినది. దీనికోసము 40 లక్షలు ఖర్చుపెడితే ప్రజాస్వామ్యాన్ని 40 లక్షలు ఇచ్చి గౌరవించినట్లు అవుతుంది అని చెబుతున్నాను.

MR. SPEAKER :—Is this amount year-marked and kept any where?

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇందువల్ల ఇవన్నీ కూడా ఏ దృక్పథంతో చూచినా elections ను వాయిదా వెయ్యడం అంటే మేము ఎవరు చెప్పినా వినము. ఇతర పార్టీ తీర్మానాలను మేము గౌరవించ తలచుకోలేదు. అది కాంగ్రెసు కానీయండి, మరి ఎవరైనా కానీయండి, మా చేతులలో అధికారము ఉంది. మా ఇష్టం ప్రకారం సాగవలసినదే. మా మెంబర్లు మాట్లాడినాకూడా వారు No Confidence motion పెట్టరు. ప్రజాస్వామ్యం మేము గుర్తుకు తీసుకోలేదు అని మేము చెప్పాము. మేము ఎక్కడ చెప్పినా ప్రజా అభిప్రాయం తీసుకొని దాని ప్రకారం మంత్రిగారు పోవలసినదే. ఇవన్నీ ఆలోచించినప్పుడు ఏ పరిస్థితులలోను మంత్రివర్గముయొక్క సవరణ అంగీకరించడానికి వీలులేదు. నేనేకాదు సంజీవరెడ్డి గారు కూడా హృదయంలో అంగీకరించరు అని స్పష్టముగా చెబుతున్నాను. జిల్లా బోర్డులు అవసరమున్నదా అనే ప్రశ్న కాదు. అవసరంలేదంటే dissolve చెయ్యడానికి resolution తెచ్చేవారము. స్పెషల్ ఆఫీసర్ల పరిపాలన అవసరములేదు. అందరు విసిగి ఉన్నారు. ఇప్పుడే చెప్పారు మన గున్నయ్యగారు, Personal Assistant ను ట్రాన్సఫరు చెయ్యమంటే చెయ్యలేదని. ఈ విధముగా అనేక రకాల బాధలు పడుతూ ఉన్నారు. ఇవి పార్టీ ప్రయోజనము కోసము కాదు. ఈనాడు పార్టీ ప్రయోజనాలు ఏవిధముగా ఉన్నాకూడా, జిల్లా బోర్డు స్పెషల్ ఆఫీసరుతో విసుగెత్తిపోయినాము. వారిని తీసివేయమని ఈబాధ వదలించమని మంత్రి గారిని ప్రార్థిస్తున్నాను. ఇవి వాయిదా వేయమంటే దాని అర్థము ఏమిటి? విశాలాంధ్ర కొత్తరాష్ట్రము ఇంకా 2, 3 సంవత్సరములకు వచ్చును. విశాలాంధ్రలో కూడా జిల్లా బోర్డులను తీసివేస్తామా ? April లోపుననే ఎలక్షన్సు జరుగవచ్చును. 2, 3 సంవత్సరాలు ఈ విషయమై ఆలోచించడానికి, టైములేదని నచ్చచెప్పడానికి సరైన కారణములు కన్పించవచ్చును. అందుచేత నేను చెప్పేది ఏమిటంటే ఎట్లాగైనా నిర్ణయము చేసుకున్నారు. పార్టీ discipline కాపాడవద్దా? అందుచేత దానిమీద నిర్ణయము తీసుకోనండి. పార్టీ మీటింగులో తేల్చుకుని April 1 లోపున ఎలక్షన్సు పెట్టడానికి అవకాశం ఉంది. సభ వాయిదా వేసి అయినా అట్లా చెయ్యండి.

MR. SPEAKER :—There is no motion before me for adjournment.

SRI PILLALAMARRI VENKATESWARLU :—The HON. Minister can get up and ask for adjournment.

Sri Pillalamarri Venkateswarlu] [2nd December 1955

ఇది ఏ విధముగా ఆలోచించినా వాయిదా వెయ్యడం అంటే ఒక విషయం మాత్రం జ్ఞాపకం పెట్టుకోండి. శాశ్వతముగా రెండు మూడు సంవత్సరాలు జిల్లా బోర్డు ప్రెసిడెంటు కావడానికి chance లేకుండా చేసుకొనడానికే ఈ బిల్లుకు అనుకూలముగా వోటు చేయండి. అలా కాకపోతే ప్రజలకు జిల్లాబోర్డులే ఎక్కువ సౌకర్యములు కలుగ చెయ్యగలవు. మీ కాంగ్రెసు తీర్మానాన్ని గౌరవించ తలచుకుంటే మంత్రిగారిమీద వత్తిడి తీసుకువచ్చి ఏప్రియల్ 10 కో July 1 కో విశాలాంధ్ర వచ్చేలోపున ఎలక్షన్సు జరిపి జిల్లా బోర్డులను ఏర్పాటు చెయ్యాలని తీర్మానము చెయ్యవలెనని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. సంకుచిత తత్వముతో కాక అన్ని విషయములు ఆలోచించి మా సవరణ అంగీకరించి వోటు చెయ్యండి లేకపోతే తటస్థంగా అయినాసరే ఉంటే సంతోషిస్తాం.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, April ఒకటవ తారీఖులో పెట్టడం ఉద్దేశం, రెండవ పంచవర్ష ప్రణాళిక అమలు జరుప బోతున్నాము. ఆ రోజున అంతకుముందు చెప్పిన ఉదాహరణకూడ, ఇదివరకు ఉన్నటువంటి structure చాలదని ప్లానింగు అమలు జరపడానికి, మళ్లీ ఒక విధానం కావలెనని చెప్పి ఇదివరకు సెంట్రలు గవర్నమెంటు, అడిగింది. వారు ఒక నిర్మాణం చెప్పారు. జిల్లాలలోకూడ పరిపాలనా విధానంలో మార్పువస్తేనేగాని వీలులేదు. పూర్వపు విధంగాను కాకుండా ప్రజలకు సంబంధించి ప్రజలను కలుపుకో కలిగినటువంటి, జిల్లాబోర్డు సంస్థలు వగైరా ఉంటేనేగాని లాభములేదని చెప్పారు. రెండవది ప్రజలలో విశ్వాసములేక చెప్పామని అంటున్నారు. ప్రజలలో ఎక్కువ విశ్వాసము ఉండబట్టే నేను మంత్రిగారికి మరొకసారి చెప్పుతున్నాను. Adult franchise తోటి ఏదిఉన్నదో దానిమీద direct voting మీరు పెట్టేటట్లయితే, ఆ ప్రజల విశ్వాసం ఉన్నదో లేదో మీకు తెలుస్తుంది. ప్రజల విశ్వాసము మీకు లేక indirect గ దొంతర్లమీద ఇంకొకరిని పంచాయితీబోర్డుమీద పెట్టుతామని మీరు ఆలోచిస్తున్నారు.

MR. SPEAKER :—You are going to a different subject.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—అందువల్ల నాకు ఉన్నదని చెప్పడానికి prove చేసుకొంటున్నాను. అందుకు వారికి జవాబుచెప్పితేనే గాని నా point పూర్తికాదు. అందువల్ల ప్రజలమీద విశ్వాసము ఉన్నదంటే direct election పెట్టమని చెప్పుతూఉన్నాము. ప్రస్తుతం అమలు జరపాలంటే, పంచవర్ష ప్రణాళిక రెండవది ఇదివరకు మాదిరి కాదు. ప్రజలు ప్రతిచోట కదిలేటట్టు

వంటి పద్ధతితోటి తీసుకొనివచ్చే ప్రణాళిక. అది నిజంగా, జయప్రదంగా అమలు జరగాలంటే ప్రజాస్వామికంఅంతా అందులో పాల్గొనవలెను. పాల్గొనుటలో ప్రయత్నం కాదు. నిర్వహణలోకూడాను. ప్రజాస్వామికంకూడా నడవవలెను. అందువల్ల ఈ framework లో కూడ ఆఖరుమాట వ్రాశారు. ఏమనిఅంటే, Administrationలో legislative and administrative changes వస్తేనేగాని వీలు లేదు. ఇంకా ఆ విధంగా మార్పు తీసుకొనిరమ్మని చెప్పి మాకు జ్ఞాపకంవుంది. అందరికి ఒక కాపీ ఇచ్చారు. ఆఖరుపేజీలోఉంది. దాంట్లో రెండవ para లో వ్రాసి ఉంది. Legislative and administrative changes వస్తేనేగాని వీలులేదని చెప్పారు. అందువల్ల దయచేసి April ఒకటవతేదికే కొత్తబోర్డులు వచ్చేటట్లు ఏర్పాటుచేస్తే బాగా ఉంటుంది అని చెబుతున్నాను.

MR. SPEAKER : I will now put the amendment of Sri Pillalamarri Venkateswarlu first to the vote of the House.

The question is:

"For the words '10th December 1956', substitute the words '10th April, 1956'."

The motion was declared lost. A poll was demanded and the House divided this :—

*Ayes.*

1. Sri Vavilala Gopalakrishnayya
2. Sri Gottumukkala Jaganadha Raju
3. Sri M. Satyanarayana Raju
4. Sri A. Yeruku Naidu
5. Sri P. Sundarayya
6. Sri Pillalamarri Venkateswarlu
7. Sri B. Ratnasabhapathi Setty
8. Sri A. Venkatrama Raju
9. Sri G. Yellamanda Reddi
10. Sri D. V. Subba Rao
11. Sri B. Sankarayya
12. Sri G. Nageswara Rao
13. Sri V. Visweswara Rao

14. Sri P. Satyanarayana
15. Sri S. Kasi Reddi
16. Sri S. Seetharamayya
17. Sri Mahammad Tahseel
18. Sri G. Ramunaidu

*Noes.*

1. Hon. Sri N. Sanjeeva Reddi
2. Hon. Sri K. Chandramouli
3. Sri Vijaya Bhaskara Reddi
4. Sri Kalluru Subba Rao
5. Srimathi Ammanna Raja
6. Srimathi N. Venkatratnam
7. Srimathi B. Rukmini Devi
8. Sri G. Bapaiah
9. Sri P. Bapaiah
10. Sri A. Bhagavantha Rao
11. Hon. Sri D. Sanjivayya
12. Hon. Sri A. B. Nageswara Rao
13. Sri S. Brahmayya
14. Sri J. Chandramouli
15. Sri N. P. Chengalraya Naidu
16. Sri Chinnama Reddi
17. Sri Marupilla Chitti alias Appalaswamy
18. Sri T. Gopalakrishnayya Gupta
19. Sri K. Koti Reddi
20. Sri V. Kurmayya
21. Sri Gopalu Reddi
22. Sri N. Govindarajulu
23. Sri P. Gunnayya
24. Sri Gadiraju Jagannadharaju
25. Sri T. Jiyyardas

26. Sri P. Kodandaramayya
27. Sri Pragada Kotaiah
28. Sri Raja V. V. Krishnam Raju Bahadur
29. Sri T. Lakshminaryana Reddi
30. Sri M. Munuswami
31. Sri E. Nagayya
32. Sri Sanda Narayanappa
33. Sri R. Nathamuni Reddi
34. Sri Pamideswara Rao
35. Sri G. Paramdhamayya
36. Sri D. Perumallu
37. Sri M. Pothu Raju
38. Sri Kottapalli Punnayya
39. Sri Ayyapureddy
40. Sri P. Rajagopala Naidu
41. Sri Rajaram
42. Sri D. Ramabrahmam
43. Sri T. Ramachandra Reddi
44. Sri P. Ramacharlu
45. Sri N. Ramulu
46. Sri U. Rangababu
47. Sri M. Rangayya
48. Sri K. Santhappa
49. Sri Chowdari Satyanarayana
50. Sri P. Anthoni Reddy
51. Sri Raja Sagi Suryanarayana Raju
52. Sri Seshadri
53. Sri P. Singarayya
54. Sri P. Sreeramulu
55. Sri N. Srinivasa Rao

56. Sri B. Subba Rao
57. Sri Sahik Moula Saheb
58. Sri Challa Subbarayudu
59. Sri C. P. Thimma Reddi
60. Sri T. Veeraraghavulu
61. Sri Nagineni Venkataiah
62. Sri B. P. Sesha Reddi
63. Sri P. Venkataravanapppa
64. Sri G. Venkata Reddi
65. Sri P. Venkatasubbaiah
66. Sri A. Lakshmunaidu
67. Sri R. Latchapatrudu
68. Sri V. Kothandarami Reddi
69. Sri T. N. Venkata Subba Reddi
70. Sri Reddi Jagannadham
71. Sri Kasim Venkata Reddi
72. Sri M. Matcharaju
73. Sri B. Appa Rao
74. Sri P. Narasimhappa Rao
75. Sri C. V. Suryanarayana Raju
76. Sri S. Ranganatha Mudaliar
77. Sri G. Narasimha Murthy
78. Sri T. Papa Rao

*Ayes* : 18 ; *Noes* : 78.

The amendment was lost.

MR. SPEAKER . :I will now put the amendment of Sri Vavilala Gopalakrishnayya to the vote of the House :

The question is :

" For the letters and word '10th December 1956', substitute the following :

2nd December 1955]

"1st April, 1956."

The amendment was lost.

Clause 2 was put and carried.

Clause 3 was put and carried.

Clause 1 and the Preamble were put and carried.

THE HON. SRI A B. NAGESWARA RAO : Sir, I move :

"That the Madras District Boards (Amendment) Andhra Amendment Bill, 1955, be passed into law."

MR. SPEAKER : The question is :

"That the Madras District Boards (Amendment) Andhra Amendment Bill, 1955, be passed into law."

The motion was carried, and the Bill was passed into law.

## (3) THE ANDHRA IRRIGATION (LEVY OF BETTERMENT CONTRIBUTION) BILL, 1955 (AS AMENDED BY THE SELECT COMMITTEE.)

THE HON. SRI K. CHANDRAMOULI : MR. SPEAKER, Sir, I move :

"That the Andhra Irrigation (Levy of Betterment Contribution) Bill, 1955, as reported by the Select Committee, be taken into consideration."

ఇంతవరకు ఈ సభలో చర్చజరగడం, తరువాత బిల్లును Select Committee కి పంపడం సభ్యులందరికీకూడా తెలిసినటువంటి విషయమే. Select Committee లో ఈబిల్లునుగురించి ఈసభలో అన్నిపక్షాలవారు చెప్పినటువంటిఅభిప్రాయాలను దృష్టిలో ఉంచుకొని చాలావిశాలమైనటువంటి దృక్పథంతో కొన్నిమార్పులుకూడా తేబడ్డాయి. అందులో ముఖ్యంగా మొదటిబిల్లులో ఉన్నటువంటి 25 వేల రూపాయలు విలువగల పన్నులకు ఈ betterment levy వేయబడదు అనేటటువంటి విషయాన్ని సభ్యులందరూ ఆలోచించి, 25 వేలు రూపాయలు గరిష్టపరిమితిని లక్ష రూపాయలకు హెచ్చించడానికి Select Committee వారు సిఫార్సుచేశారు. అంతేకాక ప్రాజెక్టు పూర్తిఅయిన 3 సంవత్సరాల తరువాతనే betterment levy ని విధించాలని సిఫార్సుచేశారు. కాని వాటన్నింటికంటెకూడా ప్రధానమైనవిషయం ఇంకొకటున్నది. ప్రభుత్వం మొదటలో తయారు చేసినటువంటి బిల్లులో ప్రాజెక్టులను

Sri K. Chandramouli] [2nd December 1955

నిర్ణయించినందువల్ల అదనంగావచ్చిన ఆదాయాన్ని ఆధారంగా చేసుకొని అభివృద్ధి పన్నును విధించాలనివున్నది. ఆపద్ధతి చాలాచిక్కులలో కూడుకున్నదనే అభిప్రాయంతో వ్యవసాయానికి ఇంతఖర్చు అవుతుందని ఒకరు అంతఖర్చుఅయిందని ఒకరు, అభిప్రాయపడటంవల్ల పంటల ధరలనుబట్టి మార్పులు ఉంటూఉంటాయి. అటువంటి దృష్టితో ఈ కాకుండా మద్రాసు ప్రభుత్వం ఆమోదించిన విధంగా గాకుండా Bombay ప్రభుత్వం అనుసరించిన విధంగా భూమియొక్క విలువను ఆధారంగా చేసుకొని, అభివృద్ధిపన్ను విధించాలని సిఫార్సుచేశారు. ప్రాజెక్టు ప్రారంభించి పూర్తిఅయిననాటికి ఉన్న market values కట్టడం తేలిక. ఈ values కట్టేదానిలో ఉండేటటువంటి difference ను బట్టి రైతుకు ఎంత లాభంకలిగిందో మనం తెలుసుకుంటే బాగుంటుంది అనేటటువంటి ఉద్దేశ్యంతో సవరణకూడా select committee వారు ఈ సిఫార్సుచేశారు. ఇంకా కొన్ని చిన్నసవరణలు ఉన్నాయి. సవరణలు 2, 3, పర్యాయములు Select Committee వారు కూర్చొని ఈ విషయాలన్నీ ఆలోచించి సిఫార్సుచేశారు. Select Committee అధ్యక్షులవారు సభ్యుల ఆయొక్క అనుమతితో కమిటీవారు సవరణచేసిన విధంగా ఈబిల్లును ప్రకటన చేయించారు. Clauses లు చర్చకు వచ్చినప్పుడు ప్రత్యేకంగా తక్కినవిషయాలు మనం ఆలోచించడానికి అవకాశంఉన్నదని ఈ Select Committee మార్పులు చేసినవిధంగా ఈబిల్లును ఆలోచనలోకి తీసుకొని దానిని pass చేయవలసిందిగా సభ్యులకు మనవిచేస్తున్నాను.

MR. SPEAKER :—Motion moved.

"That the Andhra Irrigation (Levy of Betterment Contribution) Bill, 1955, as reported by the Select Committee, be taken into consideration."

SRI P. RAJAGOPAL NAIDU :—అధ్యక్షా, ఈనాడు క్రొత్త ప్రాజెక్టులు కట్టాలనే ఉద్దేశ్యంతో కొంత హెచ్చు ఆదాయం రావాలని ప్రభుత్వం ఈ అభివృద్ధి పన్నును వేస్తూ ఉన్నది. అది అవసరం అయినా దానిలో ఉన్నటువంటి సాధకబాధకాలను కూడా ప్రభుత్వం ఆలోచించవలసి ఉన్నది. ఈనాడు డబ్బు కొంత ఖర్చు పెట్టడంవల్ల భూమి విలువ పెరుగుతూ ఉన్నది. కనుక భూమి విలువలో కొంత భాగం కావాలని ప్రభుత్వం చెబుతూ ఉన్నది. అయితే ఇంత భాగం కావాలనే విషయంలో జాగ్రత్తగ ప్రభుత్వం ఆలోచించాలని చెబుతున్నాను. ఆంధ్ర రాష్ట్రంలో ఈనాడు ఏ ప్రాజెక్టుకైనాసరే అయ్యేఖర్చు ఎకరానికి సగటున 300 రూపాయలు అలా ఉన్న పక్షంలో ఈ బిల్లును అనుసరించి వసూలు చేసు

బద్దాయి. అంతకంటే హెచ్చుగా ఉంటుందని నా ఉద్దేశ్యం. ముఖ్యంగా ఎప్పుడైతే మెట్టమాగాణి అవుతుందో అది 500 రూపాయలు దగ్గరనుంచి 1000, 1500 రూపాయల వరకుకూడా పెరిగే వీలు ఉన్నది. అలాంటప్పుడు ఆతేడా డబ్బు 800 రూపాయలు కావచ్చు. 1000 రూపాయలు కావచ్చు. కాబట్టి అందులో సగం 500 రూపాయలు ఎకరానికి ఇవ్వవలసివస్తే సగటున 300 రూపాయలు ఆ ప్రాజెక్టుకు ఖర్చు అయ్యేటప్పుడు ఆ ప్రాజెక్టుకు ఎంత ఖర్చు పెడుతున్నారో అంతకంటె ఎక్కువగాకూడా ప్రభుత్వం వసూలు చేసుకొనే వీలున్నది ఇందులో. అందువల్ల అంతకంటె రైతులనే ఆ ప్రాజెక్టు కట్టుకోమని చెప్పినట్లయితే సులభంగా ఉండేటట్లు కన్పిస్తుంది.

కాబట్టి ఈ విషయాన్ని జాగ్రత్తగా పరిశీలించాలని నేను కోరుతున్నాను. ఇక్కడ ఈ సగము అనేదానికంటే నాల్గవ భాగము అని చెప్పినట్లయితే చాలా బాగుంటుందని నేను అనుకుంటున్నాను. లేక సంవత్సరానికి ఎకరానికి ఇన్ని రూపాయలు ఇవ్వాలని పెట్టినట్లయితే, అది ఖచ్చితంగా ఉంటుందని, చక్కగా ఉంటుందని నేను అభిప్రాయపడుచున్నాను. ఇందులో మరొక చిక్కుకూడ ఉన్నది. 'A' అనే అతనికి 2 ఎకరాలు భూమి ఉందనుకోండి. ప్రాజెక్టు పూర్తి అయిన తరువాత, ఆ భూమి విలువలో పెరుగుదల కనిపిస్తుంది. అతడు వెంటనే ఆ భూమిని 'B' అనే అతనికి అమ్మివేస్తాడు. అలాగు అమ్మివేసిన తరువాత కొన్నటువంటి అతడు అభివృద్ధి పన్ను కట్టవలసియున్నది. ఎందుచేతనంటే, నిర్వచనంలో ఎవ్వరైతే ఆ భూమిని కలిగి ఉంటాడో అతడు అభివృద్ధి పన్ను చెల్లించాలని ఉన్నది. అభివృద్ధి చెందిన దానివల్ల కలిగే ఫలితాన్ని ఎవరైతే ఈ భూమిని విక్రయము చేశారో, వారు పొందుతున్నారు. ఎవరైతే కొన్నారో వారు ఈ అభివృద్ధివల్ల ఫలితాన్ని పొందడం లేదు. కాని ఈ అభివృద్ధి పన్ను చెల్లించవలసినటువంటి భారము కొన్నటువంటి వాని మీద పడుతుంది. కాబట్టి ఈ విషయాన్ని ప్రభుత్వము ఆలోచించాలని కోరుతున్నాను. అంతేకాకుండా, ఈ ప్రాజెక్టును మొదలు పెట్టినప్పుడు భూమి ఒకరకంగా ఉంటుంది. మరల ప్రాజెక్టు పూర్తి అయిన తరువాత 1, 2 సం॥ లలో ఈ మెట్ట భూమి అంతా మాగాణిగా మార్చవలసివచ్చినప్పుడు, దానిమీద కొంత ఖర్చు పెట్టవలసివస్తుంది. కాని ఇక్కడ తీసుకొంటున్నటువంటి విలువ పెరుగుదల విషయంలో చూస్తే ఈ ప్రాజెక్టు మొదలుపెట్టినప్పుడు భూమివిలువ ఎంతఉన్నదో, దానికిని, తరువాత ప్రాజెక్టు పూర్తిఅయినతరువాత వచ్చేటటువంటి విలువకును పీటితేడా తీసుకొంటున్నారుగాని, ఆ మధ్యలో దానిని మాగాణిగా మార్చడానికి రైతు ఎంతడబ్బు ఖర్చుపెట్టినాడో, ఆ ఖర్చును తీసివేయడంలేదు. కాబట్టి ఆ ఖర్చును ఈ పెరుగుదల

Sri P. Rajagopal Naidu] [2nd December 1955

విలువలో తీసివేస్తే న్యాయంగా ఉంటుందని ప్రభుత్వానికి విజ్ఞప్తిచేస్తున్నాను. మరొక విషయము మనవి చేస్తున్నాను. క్షామంవచ్చినపుడు, సాధారణంగా రైతులు శిస్తులు చెల్లించలేకపోతున్నారు. అప్పుడు పూర్తిగా remissions ఇవ్వవలసి వస్తుంది. ఆ రోజులలో ఈ Betterment levy చెల్లించడం రైతులకు చాలా చిక్కుగా ఉంటుంది. కాబట్టి దాన్ని తీసివేయడమా, లేక ఏమిచేయాలి అనేదికూడ ప్రభుత్వము ఆలోచించాలని నేను కోరుతున్నాను. అంతేకాక Project పూర్తి అయినప్పుడు, భూమి ఎంతవిలువఉన్నది అని ఒక విలువను కడుతూఉన్నారు. ప్రాజెక్టు పూర్తిఅయిన తరువాత మరల కొద్దినెలలకు ఈ విలువ పడిపోవచ్చు. అప్పుడు కూడ ఆ భూమివిలువ ఆ భూమినిబట్టే కాకుండా, దానిలో వచ్చేనీటినిబట్టి, పంటనుబట్టికూడా ఉంటుంది. కాబట్టి ధరలు పడిపోయినపుడు. ఆ విలువ తగ్గిపోవచ్చు. ఆలా ధరలు పడిపోయినపుడు అభివృద్ధి పన్నును తగ్గించడానికి ప్రభుత్వము ఏమిచేస్తుందో ఆ విషయాన్ని మంత్రిగారు సెలవిస్తే బాగుంటుందని నేను అనుకొంటాను. కాబట్టి ఈ చిక్కులన్నిటిని విచారించి సాధ్యమైనంతవరకు పరిశీలన చేసి, ఈ బిల్లును సక్రమమైన పద్ధతులలో రూపొందించవలెనని నేను ప్రభుత్వాన్ని కోరుతూఉన్నాను. ముఖ్యంగా ఈ అభివృద్ధి పన్నులో పేర్కొనిన విలువలో సగము కాకుండా, ఇంకా తగ్గింపుచేయువలెనని మంత్రిగారికి విజ్ఞప్తిచేస్తున్నాను.

MR. SPEAKER: The House will now adjourn and meet at 11 a.m. tomorrow, 3rd December, 1955.

The House then adjourned.

REVENUE DEPARTMENT

# APPENDIX

## PAPER TO BE PLACED ON THE TABLE OF THE HOUSE.

*VIDE* ANSWER TO LEGISLATIVE ASSEMBLY QUESTION

NO. 163 STARRED (BY SRI S. VEMAYYA, M.L.A.)
(Q. No. 105) Vide page Suphra)

| *Name of the district.* | *Clause (a) of the question.* | *Clause(b) of the question.* | *Clause (c) of the question.* |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| 1. Guntur .. | 1952-53 Yes<br>1953-54 Yes | 1950<br>439 | Does not arise. |
| 2. Cuddapah- | 1952-53 No.<br>1953-54 No. | ...<br>... | The matter was under correspondence with the Superintendent, Government Press. |
| 3. Chittoor. | 1952-53 Yes | 800 | Does not arise. |
| | 1553-54 No. | ... | The matter was under correspondence with the Controller of Stationery and Printing. |
| 4. Nellore ... | 1952-53 Yes<br>1953-54 Yes | 69<br>300 | Does not arise. |
| 5. Krishna ... | 1952-53 Yes | 998 | Does not arise. |
| | 1953-54 No. | ... | The matter was under correspondence with the Superintendent, Government Press. |
| 6. Kurnool ... | 1952-53 Yes<br>1953-54 Yes | 510<br>94 | Does not arise. |
| 7. East Godavari | 1952-53 Yes<br>1953-54 Yes | 840<br>736 | Does not arise. |

| (1) | (2) | | (3) | (4) |
|---|---|---|---|---|
| 8. Anantapur. | 1952-53 | Yes | 880 | Does not arise. |
| | 1953-54 | No. | ... | The matter was under correspondence with the Superintendent, Government Press. |
| 9. West Godavari. | 1952-53 | Yes | 1425 | Does not arise. |
| | 1953-54 | Yes | 400 | |
| 10. Visakhapatnam. | 1952-53 | Yes | 1850 | Does not arise. |
| | 1953-54 | Yes | 1300 | |
| 11. Srikakulam | 1952-53 | Yes | 694 | Does not arise. |
| | 1953-54 | Yes | 308 | |

S. KOTESWARA RAO,
*Deputy Secretary to Government.*

# THE ANDHRA IRRIGATION (LEVY OF BETTERMENT CONTRIBUTION) BILL, 1955

(L.A. Bill No. 12 of 1955)

(Report of the Select Committee with the Bill as amended)

# CONTENTS

# THE ANDHRA IRRIGATION (LEVY OF BETTERMENT CONTRIBUTION) BILL, 1955.

*Composition of the Select Committee.*

1. Sri N. Sanjeeva Reddi—*Deputy Chief Minister* (*Chairman.*)
2. Sri K. Chandramouli—*Minister for Land Revenue.*
3. Sri Kala Venkata Rao—*Minister for Planning.*
4. Sri Meduri Nageswara Rao.
5. Sri S. K. V. Krishnavatharam.
6. Sri Kakani Venkataratnam.
7. Sri T. Ramachandra Reddi.
8. Sri P. Thimma Reddi.
9. Sri K. Punnaiah.
10. Sri Puchalapalli Sundarayya.
11. Sri Pillalamarri Venkateswarlu.
12. Sri T. Papa Rao.
13. Sri C. V. Suryanarayana Raju.
14. Sri Gottumukkala Jagannadha Raju.
15. Sri M. Satyanarayana Raju.

I

# REPORT OF THE SELECT COMMITTEE ON THE ANDHRA IRRIGATION (LEVY OF BETTERMENT CONTRIBUTION) BILL, 1955.

(L. A. Bill No. 12 of 1955.)

To

The Andhra Legislative Assembly,
Kurnool.

The Select Committee appointed to consider the Andhra Irrigation (Levy of Betterment Contribution) Bill, 1954 (L.A. Bill No. 12 of 1955), has the honour to make the following report :—

The Bill was published in the Andhra Gazette Extraordinary, dated 16th July 1955.

2. The Committee was appointed on 27th September 1955 ; it met on 28th September 1955, 20th October 1955 and 21st October 1955 in the Committee Room, Assembly Buildings, for considering the provisions of the Bill.

3. The Committee decided to consolidate the definition of "drainage work", "irrigation work" and "work" and recast it under the definition of "work."

4. The Committee decided to levy betterment contribution only in cases where the cost of the work exceeds one lakh of rupees. The Committee decided that no betterment contribution shall be levied until the expiry of three years from the date of completion of the construction, expansion or alteration of the "work". The Committee also made it clear that a land shall not be deemed to be benefited merely by reason of maintenance of an existing work wholly or partly at the expense of the Government.

5. The Committee after full discussion considered that the basis for the levy of contribution should be the increase in the value of the land as a result of the completion of a work as in Bombay and not the increased yield from the land as suggested in the Bill.

6. The Committee considered that before levying contribution, a notice should be published in the District Gazette and that individual notices should also be served whenever practicable on the owners and persons interested, inviting their objections, if any.

7. The Committee also made necessary provisions for inquiry into objections by the Inquiring Officer. The District Collector will pass orders on the basis of the records of inquiry of the Inquiring Officer. Against the order of the District Collector, an appeal will lie to the Board of Revenue within a period of sixty days, the Government having powers of revision.

8. The Committee also decided that when the land is not in occupation of the owner, the actual occupant of the land other than a tenant and ryot having permanent right of occupancy under the Estates Land Act, should be made liable to pay the contribution.

9. Dissenting minutes have been received, one from Sri M. Satyanarayana Raju and another from Sri P. Sundarayya and Sri P. Venkateswarlu.

10. The Committee authorized the Chairman to present the report on their behalf.

11. A copy of the Bill as amended is annexed.

N. SANJEEVA REDDI,
*Chairman of the Select Committee.*

## II

N B —(Portions underlined indicate amendments suggested by the Select Committee and portions omitted are shown by dots)

*A Bill to provide for the levy of betterment contribution on certain lands in the State of Andhra.*

## L.A. Bill No. 12 of 1955.

(*As amended by the Select Committee.*)

WHEREAS it is expedient to provide for the levy of betterment contribution on certain lands in the State of Andhra ; Be it enacted in the Sixth Year of the Republic of India as follows :

1. *Short title and extent.*—(1) This Act may be called the Andhra Irrigation (Levy of Betterment Contribution) Act, 1955.

(2) It extends to the whole of the State of Andhra.

2. *Definitions.*—In this Act unless there is anything repugnant in the subject or context.—

(1) "contribution" means the betterment contribution referred to in section 3 ;

(2) "Government" means the State Government ;

(3) "notification" means a notification published in the *Andhra Gazette,* and the word "notified" shall be construed accordingly ;

(4) "owner" in relation to any land, means the person liable to pay the public revenue due on the land and includes a ryot having a permanent right of occupancy within the meaning of the Madras Estates Land Act, 1908 (Madras Act I of 1908) ;

(5) "prescribed" means prescribed by rules made under this Act ;

(6) "work" means an irrigation work or drainage work as defined hereunder—

(*a*) "*irrigation work*" includes—

(i) all canals, channels, tanks, wells, reservoirs, ponds, spring ponds and madugus used for the supply or storage of water for purpose of irrigation, and all dams, embankments, weirs, sluices, groynes and other works (other than escape channels) connected therewith or auxiliary thereto, which are owned or controlled by the Government, or constructed or maintained by them and not handed over to any person.

(ii) all such lakes and other natural collections of water, or parts thereof, as are situated on lands which are the property of Government ;

(iii) all rivers and natural streams or parts, thereof ;

(*b*) "drainage work" includes the following works which are owned or controlled by the Government, or constructed or maintained by them and not handed over to any person :—

(i) channels, whether natural or artificial, for the discharge of waste or surplus water, and escape ehannels from an irrigation work, together with dams, embankments, weirs, sluices, groynes and other works, connected with or auxiliary to all such channels ;

*Explanation.*—For the purpose of this clause, any part of stage of a work which is notified under sub-section (2) of section 3 shall be deemed to be a 'work'.

3. *Levy of betterment contribution.*—(1) The Government shall be entitled to levy a betterment contribution, in accordance with the provisions of this Act, from the owner of any land which, in their opinion, is benefited or is capable of being benefited by the completion of the construction, expansion or alteration by the Government, whether after the commencement of this Act, or at any time before such commencement but not earlier than the 15th August 1947, of any work (including the installation by them of a pumping set), the cost of which exceeds one lakh of rupees :

